# పగటి కల

గిజుభాయి





"పగటి కల"—"దివాస్వప్న" పేరుతో హిందీలో మధ్యప్రదేశ్ అధ్యాపక శిక్షణా మండలి, మాసపత్రిక "పలాస"—సంపుటి: 13, సంచిక 7, 8, 9లలో 1985న ముద్రింపబడినది.

వెల : 7-50

ట్రస్ట్ సంపాదకుడు : చేకూరి రామారావు
ముఖచిత్రం : బాల్‌రెడ్డి
మొదటి ముద్రణ : నవంబరు, 1986.
వివరాలకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్
3-6-687, హిమాయత్‌నగర్
హైదరాబాద్-500 029.

---

ముద్రణ : హైదరాబాద్ ప్రింటర్స్, హబ్సిగూడ హైదరాబాద్..

## గిజుభాయి - ఒక స్వాప్నికుడు

ప్రఖ్యాత గుజరాత్ విద్యావేత్త గిజుభాయి పూర్తిపేరు గిరిజాశంకర్ భగవాన్‌జీ బధేకా. ఇరవై సంవత్సరాల పాటు శిశు విద్యలో రావలసిన మార్పుల గురించి నిరంతరం శ్రమించిన గిజుభాయి ఒక ఆదర్శ పురుషుడు. పదిహేనుపైగా పిల్లల విద్యావిషయాలపై గ్రంథాలు రాసిన గిజుభాయి ఆలోచనలో ఆచరణలో సమంగా జీవించినవాడు. తన సహచరులు రచించిన 223 విద్యా విషయ గ్రంథాలకు ఆయన అన్ని విధాలా సహాయం చేశారు. ఈ గ్రంథాలన్నీ గుజరాతీ భాషలోనే వెలువడ్డాయి.

శ్రీ కాశీనాథ్ ద్వివేదీ తదితరులు ఈ గ్రంథాలను హిందీలోకి అనువదించారు. వాటిపై పరిశోధనా గ్రంథాలు కూడా ఆ తర్వాత వచ్చాయి.

"పగటికల" అనే రచనతో ఆయన ఒక స్వాప్నికుడిగా, ఆచరణ యోగ్యమైన కలలుకనే విద్యావేత్తగా జీవించాడు. తన జీవిత కాలంలో ఆయన స్వయంగా తన పద్ధతుల్లో దాదాపు ఆరువందల మంది ఉపాధ్యాయులకు శిక్షణ ఇచ్చి విద్యాకార్యకర్తలను రూపొందించారు.

గిజుభాయి సౌరాష్ట్రలోని చితల్‌గావ్ గ్రామంలో 15 నవంబర్ 1885 నాడు జన్మించారు. ఆ తరువాత ఆయన తన కార్యరంగమైన విద్యారంగంలో ఆగస్ట్ 1920 నుంచి 23 జూన్ 1939 దాకా ఒక అపూర్వమైన-అద్భుతమైన పనిని సాధించారు. అందువల్లనే గుజరాత్‌లో

15 నవంబర్ 1984న గిజుభాయి జన్మ శతాబ్ది సంవత్సరంగా రాష్ట్ర వ్యాప్తంగా కార్యక్రమాలు జరిపారు.

గిజుభాయి స్వయంగా గుజరాతీ భాషలో రచించిన గ్రంథాల్లో మాంటెస్సరీ పద్ధతీ, బాల శిక్షణ్, ప్రాథమికశాల-మా శిక్షణ పద్ధతియా, దివాస్వప్న (పగటి కల) 'మాబాపోనా ప్రశ్నో' మొదలైనవి వున్నాయి.

గిజుభాయి ఒక ఉపాధ్యాయుడిగా, విద్యావేత్తగా బాల విద్యలో తమ జీవితాన్ని సమర్పించారు. ఎన్నో ప్రయోగాలు చేసి, సృజనాత్మకంగా నిరూపించి తమ ప్రతిభావ్యుత్పత్తుల ద్వారా గుజరాత్ ప్రాథమిక విద్యారంగంలో మౌలికమైన మార్పును ప్రవేశపెట్టారు. జాతీయ పోరాట కాలంలోనే జాతీయ నాయకులు గిజుభాయి విద్యావిషయ కృషిని గుర్తించి ప్రశంసించారు. మహాత్మగాంధీ, కిశోరీలాల్ మశ్రూవాలా, కాకా కాలెల్కర్, నానాభాయిభట్ మొదలైన అనేక మంది ప్రముఖులు గిజుభాయిని భారతజాతి సొంతం విద్యారంగంలో ఒక సజీవమైన ఆదర్శంగా స్వీకరించాలని నివాళులు అర్పించారు.

గిజుభాయిని గుజరాత్‌లో "మూంచ్ వాలీ మా" (మీసాలున్న అమ్మ) అని ఎంతో ప్రేమగా పిలిచేవారు. ఆయనకు పెద్ద మీసాలుండేవి. "మాతృత్వాని"కి ఒక కొత్త కోణాన్ని చూపిన ఆయన వ్యక్తిత్వాన్ని ఆ పిలుపు ప్రేమగా గుర్తించింది.

ఆయన విద్యాతత్వంలో ఒక స్వప్నం వుండేది. ఒక ఉపాధ్యాయుడిగా ఆయన చిన్న పిల్లల జీవితాన్ని తీర్చి దిద్దే కలను సార్థకం చేయాలని ప్రయోగాలు చేసి చూపారు.

గిజుభాయి "దర్శనం" (తత్వం)లో కేంద్ర బిందువు చిన్న పిల్లవాడు (బాలకుడు లేదా బాలిక). సాంప్రదాయికమైన పద్ధతులను దూరంనెట్టి ఒక నూతన విధానం ద్వారా మనుష్యమయమైన సమాజాన్ని



నిర్మించే స్వప్నంతో ఆయన కృషిచేసారు.

ఆ నూతన విధానంలో పిల్లల ఆహ్లాదమయమైన ప్రపంచం ఉంది. ఊహలకు రెక్కలు తొడిగి ఆనందమయమైన జీవితం కోసం పిల్లలను ప్రేరేపించే సృజనాత్మకత వుంది. ఆ పాటల ద్వారా పని, యోగ్యత కోసం జ్ఞానం అనే సజీవ లక్షణం వుంది.

కేవలం ఉద్యోగం-జీతం అనే పరిమిత స్థాయిలో జడంగా బతికేసే ఉపాధ్యాయులను కాకుండా ఆదర్శంగా-ప్రేరణనిచ్చే వ్యక్తిత్వంతో-ధైర్యంతో ఒక ఆశయం కోసం జీవించే "భావి ఉపాధ్యాయుల" నిర్మాణం గిజుభాయి "పగటి కల"-అదే ఆచరణలో కూడా ఈనాడు ఒక వాస్తవం.

## ఏమిటీ పగటి కల?

కొంచెం కల్పనా శక్తి వుండాలి. మరికొంచెం ఆలోచనా శక్తి ఉండాలి. విద్యా విషయకమైన ఆధునిక సాహిత్యంలో మరింత పరిచయం ఉండాలి. అప్పుడు ఏ వ్యక్తి అయినా సులభంగా విద్యావేత్త కావచ్చు. శ్రీ గిజుభాయీ విద్యావేత్తగా ప్రసిద్ధి చెందిన వ్యక్తి. ఆయన దక్షిణా మూర్తి గారి సంస్థలో అనేక ప్రయోగాలు చేసి విద్యా రంగంలో సరికొత్త భావాలనూ, సరికొత్త పద్ధతులనూ సమాజం ముందు ఉంచారు. ఇప్పుడు గుజరాత్ అంతా వారిని ఒక గొప్ప విద్యావేత్తగా పరిచయం చేసుకొంటూ వుంది.

విద్యకూ, సంస్కరణకూ సంబంధించిన భావనలకు రూపకల్పన చేయడం, విద్యా బోధనకు సంబంధించిన వివిధ పద్ధతులను రూపొందించడం, వాటి ద్వారా అధ్యాపన కళకు సంబంధించిన సిద్ధాంతాలను ఆకళించుకొని అందరికీ వివరించడం, తన సొంత దృష్టాంతం ద్వారా విద్యా బోధనను వృత్తిగా స్వీకరించిన సోదరులను ఆ పద్ధతులు అమలు పరచడానికి సిద్ధ పరచడం విద్యావేత్త చేయవలసి నటువంటి పని. శ్రీ గిజుభాయీ గారూ ఆ పనే చేశారు. విద్యారంగంలో సంస్కరణలను ప్రవేశ పెట్టదలచుకున్న వ్యక్తులు అటువంటి విద్యావేత్తలు కానట్లయితే సంస్కరణకు సంబంధించిన వారి అభిప్రాయాలు అభిప్రాయాలుగానే ఉండిపోతాయి. గుజరాత్ రాష్ట్రం గిజుభాయీ గారిని ధురంధరుడైన విద్యావేత్తగా తెలుసుకొన్నదే కాని గుర్తించ లేకపోయింది. వారి దగ్గరకు వచ్చి మాంటిస్సోరీ పద్ధతికి చెందిన అధ్యాపన కళనూ, సిద్ధాంతాలనూ, ఆచరణనూ అభ్యసించిపోతున్న ఉపాధ్యాయ సోదరులూ, సోదరీమణులూ (గుజరాత్, కాఠియావాడ్‌లకు చెందినవారు) తప్ప మిగిలిన వారిలో చాలా తక్కువమంది మాత్రమే ఆయనను గొప్ప విద్యావేత్తగా గుర్తించ గలిగారు. ఆయన విద్యా బోధనకూ, అధ్యాపన కళకూ సంబంధించిన అనేక శాస్త్రీయ గ్రంథాలు రచించారు. ప్రాథమిక పాఠశాలలకు సంబంధించిన తన రచనల సారాంశాన్ని ప్రజల ముందు ఉంచడానికి చేసిన సరళమైన, సుందరమైన, సరసమైన ప్రయత్నమే యీ పగటికల.

గిజుభాయీ గారు యీ పుస్తకానికి 'పగటి కల' అని పేరు పెట్టారు. ఈ పుస్తకంలో నిర్దేశించబడిన విషయాలన్నీ ప్రస్తుతం ప్రాథమిక పాఠశాలల్లో పని చేస్తున్న ఉపాధ్యాయుల పగటి కలకు ఆధారంగా ఉండాలనే ఆశయంతోనే యీ పేరు పెట్టారు. అయితే గిజుభాయీ గారికి మాత్రం ఆ విషయాలు పగటి కలగా లేవు. ఆయన ప్రాథమిక పాఠశాల ఏదీ నడపక పోయినప్పటికీ బాలల శిక్షణకు సంబంధించిన బోధనా ప్రణాళికలోని నియమాలను తన బాల మందిరంలో అమలు పరచారు. ఆ నియమాలను అన్ని ప్రాథమిక పాఠశాలలకు అన్వయింప జేసే విషయంలో ఆచరణ సాధ్యమైన తమ అభిప్రాయాలను ఈ పుస్తకంలో వెల్లడించారు. గుజరాత్, కాఠియావాడ్ ప్రాంతాలకు చెందిన ఉపాధ్యాయులూ, ఇంకా దేశంలోని ఇతర ప్రాంతాల ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయులూ యీ పగటి కలను తమదిగా చేసుకొంటే; ఇందులోని, మార్దవమూ, మాధుర్యమూ యీ పగటి కలను నిజం చేసుకోవాలనే అభిలాషను వారి హృదయాలలో రేకెత్తిస్తా యనడంలో సందేహం లేదు.

ప్రస్తుతం ప్రాథమిక పాఠశాలలలో బోధించ బడుతున్న విషయాలు గానీ, విధానాలు గానీ బాలలకు చాలా హానికరమైనవిగా వున్నాయి. ప్రస్తుతం విద్యార్థతను పరీక్షలతోనూ, బహుమతులతోనూ, పోటీలతోనూ, కుస్తీ పట్లతోనూ కొలుస్తున్నారు. ఈ రకపు చదువు సంధ్యల ఫలితాలే ఈర్ష్య, ద్వేషం, దెబ్బలాటలు, అశాంతి, అసంతృప్తి, అదుపు తప్పడం, పరిస్థితి అస్తవ్యస్తంగా మారిపోవడం. ఈ విషయాలన్నీ యీ పుస్తకంలో ఓ వైపు మిక్కిలి మనోహరంగానూ, మరో వైపు అత్యంత దయనీయంగానూ చిత్రించబడినాయి. కాని రచయిత దయనీయ స్థితిని చిత్రించడంతో సరిపెట్టుకోలేదు. ఈనాటి ప్రాథమిక పాఠశాలలలోనూ, ప్రారంభిక విద్యా బోధనలోనూ వ్యాపించి వున్న దయనీయ స్థితికి పరిష్కార మార్గాన్ని కూడా ఆయన అందంగానూ ఆకర్షణీయంగానూ పఠితల ముందు ఉంచారు. ఈ సమస్యను పరిష్కరించడానికి అవసరమయిన హృదయ స్ఫూర్తినీ, దాని స్వరూప స్వభావాలనూ ఈ పుస్తకంలో యథాతథంగా చిత్రించారు. ప్రాథమిక పాఠశాలల్లో మనకు కన్పిస్తున్న మాలిన్యమూ, గందరగోళమూ, క్రమ శిక్షణా రాహిత్యమూ మొదలైన వన్నీ హృదయ స్ఫూర్తితో పనిచేసే ఉపాధ్యాయ మాంత్రికుని మంత్రదండం స్పృశించగానే మాయమై పోయి; వాటి స్థానంలో గిజుభాయీ గారి క్లాసులో క్రమశిక్షణ, స్వేచ్ఛత, స్వచ్ఛందత, ప్రశాంతి, ప్రసన్నతలు రాజ్యం చేస్తున్నాయా అనిపిస్తుంది. ఉపాధ్యాయుడు తన విధి నిర్వహణలో ఎన్ని ఇబ్బందులను ఎదుర్కోవలసి వస్తున్నదో మనకు బోధపడుతుంది. పుస్తకాన్ని వ్రాసే సమయంలో రచయిత ఇటువంటి సజీవమైన చిత్రణను తన దృష్టి నుంచి తప్పుకోనివ్వలేదు. ఈనాటి మన సమాజం పూర్వాచార పరాయణత్వం కలిగి వున్నటువంటిది. అందులో దానికి అమితమైన విశ్వాసం యేర్పడి వుంది. చిన్నచిన్న మార్పులను కూడా అనుమానంతో చూస్తూ వుంటుంది.



మార్పులను స్వీకరించడానికి అంత త్వరగా సిద్ధపడదు. తమ పిల్లల చదువు సంధ్యల పట్ల తల్లిదండ్రులు చూపుతున్న నిర్లక్ష్య భావం నిజంగా క్షమార్హమైనది కాదు. హెడ్‌మాస్టర్ల భయం, ఇన్‌స్పెక్టర్ల భయం ఉపాధ్యాయులను నిద్రలో కూడా వేధిస్తూనే ఉంటుంది. పాఠ్యక్రమ బంధనం నుంచి, పరీక్షల సంకెళ్ళ నుంచి ఉపాధ్యాయులూ, సంరక్షకులూ విముక్తులు కాలేక పోతున్నారు. రచయితకు యీ విషయాలన్నీ బాగా తెలుసు. ఈ కారణంగానే ధైర్యంతో, సాహసంతో, తమ కార్య దీక్షా దక్షతతో ఈ యిబ్బందులను అధిగమించడానికి తగిన ప్రశాంతమైన మార్గాన్ని ఆయన అందంగానూ, దృఢంగానూ మనకు చూపించ గలిగారు.

పుస్తక మంతటిలోనూ ఒక మూల దాగి వున్న ముఖ్యమైన తత్వం వైపు యీ పుస్తక పఠితల దృష్టిని ఆకర్షించడం నా మిత్ర ధర్మంగా భావిస్తున్నాను. మన ఆశయాలూ, ఆకాంక్షలూ, ఎంత అందంగా వున్నప్పటికీ, ఎంత ఉన్నతంగా ఉన్నప్పటికీ ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయుల స్వభావంలో మార్పు రానంతవరకూ, లేక తీసికొని రాలేనంత వరకూ మన శక్తియుక్తులనూ, ప్రయోగాలనూ రుజువు చేయగల నేర్పుగానీ, నైపుణ్యంగానీ సద్వినియోగం కాజాలదు. ఈ విషయం గిజుభాయీ గారి మనస్సును నిత్యం వేధిస్తున్నట్లుగా కన్పిస్తున్నది. అంచేత ఉపాధ్యాయుల స్వభావంలో విప్లవం తీసికొని రావాలనే విషయాన్ని ఆయన యీ పుస్తకంలో ఎంతో మృదుత్వంతోనూ, మెలకువతోనూ వ్రాశారు. ఈనాటి మన ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుడు అజ్ఞుడు, భృత్యుడు, ధనలోభం కలవాడు, తనను తాను నమ్మలేని వాడు. ఉపాధ్యాయునిలో ఉన్న యీ బలహీనతను గిజుభాయీ గారు ఎంతో సానుభూతితో గమనిస్తారు. అతని మానసిక వ్యాధికి అతనితో పాటు తాముకూడా సంతాపిస్తారు. ఈ దృష్టితోనే ఆయన యీ

విషయాల నన్నిటినీ యీ పుస్తకంలో చర్చిస్తారు. ఇది చదివిన ఉపాధ్యాయుడు తాను బలహీనుణ్ణి అనే అభిప్రాయంతో భయపడతాడు, సిగ్గుపడతాడు. గిజుభాయీ గారి పగటి కలను సాక్షాత్కరింప జేసుకొనడానికి తగిన బలం సంపాదించడం కోసం తన మనస్సులో నిద్రిస్తున్న మహత్వాకాంక్షను తట్టి లేపుతాడు.

ఏమిటీ పగటి కల? నిన్నటి ప్రాథమిక విద్యా విధానం పై సంక్షిప్తంగా జరిపిన సమీక్ష. రేపటి ప్రాథమిక పాఠశాల యొక్క స్పష్టమైన, మనోహరమైన స్వరూపాన్ని అందంగా చూపిస్తున్న అద్దం. పాఠకులను అమితంగా ఆకర్షించగల కథగా వ్రాయ బడటం యీ పుస్తకం యొక్క ప్రత్యేకత! గిజుభాయీ గారు నాకు అత్యంత సన్నిహితులైన మిత్రులు. అప్పుడప్పుడు నేను ఆయన రచనలను విహంగావలోకనంతో పరామర్శిస్తుంటాను. ఆయన రచనలకు నేను సంపూర్ణంగా ముగ్ధుడనైన సందర్భాలు అరుదైనప్పటికీ; నిజంగా యీ పుస్తకం విషయంలో గిజుభాయీ గారికి నా హృదయ పూర్వకమైన కృతజ్ఞతను వెల్లడించకుండా ఉండలేకపోతున్నాను.

— హర్‌భాయీ త్రివేదీ

మొదటి భాగం

# ప్రయోగం ప్రారంభం

నేను చదివాను. ఆలోచించాను. బాగా ఆలోచించాను. అయితే ఆలోచనే కాని అనుభవం లేదు. ఆచరణ లేదు. స్వయంగా ఆచరణలో పెట్టి చూడాలనుకున్నాను. అప్పుడే నా అభిప్రాయాలు రుజువు అవుతాయి. నా భావనలో ఎంత ఔచిత్యం వుందో, ఎంత అనౌచిత్యం ఉందో అప్పుడే తెలియగలదు.

నేను విద్యాశాఖలోని ఉన్నతాధికారి దగ్గరకు వెళ్ళాను. ప్రాథమిక పాఠశాలలో ఒక క్లాసు నాకు అప్పగించమని కోరాను.

అధికారి నవ్వుతూ అన్నాడు—"ఎందుకు బ్రదర్, అది మీకు సాధ్యమయ్యే పనికాదు. చిన్న పిల్లలకు చదువు చెప్పడం మాటలా! అందులో ప్రాథమిక పాఠశాల పిల్లలకు బోధించడమంటే ఎంతో శ్రమ పడాలి, శక్తినంతా ధారపోయాలి. వాళ్ల ప్రాణాలు తోడేస్తారనుకోండి. మీరు రచయితలు, భావుకులు గదా! టేబులు దగ్గర కూర్చొని వ్యాసాలు వ్రాయడం సులభం. ఊహలో బోధించడం కూడా సులభమే. కాని ప్రత్యక్షంగా పనిచేయడం, దానిని సాధించడం చాలా కష్టం."

నేనన్నాను—"అందుకే స్వయంగా ఆచరణలో పెట్టి చూడాలనుకుంటున్నాను. నా ఊహలను నిజం చేయాలనుకుంటున్నాను."

అధికారి అన్నాడు—"సరే మంచిది, మీకంత పట్టుదల వుంటే

సంతోషంగా ఓ సంవత్సరం పాటు ఆచరణలో పెట్టి చూడండి. ప్రాథమిక పాఠశాలలో నాలుగవ తరగతిని మీకు అప్పగిస్తున్నాను. ఇదిగో నాలుగవ తరగతి పాఠ్యక్రమం, ఇవిగో ఆ క్లాసు పాఠ్య పుస్తకాలు. ఇవి సెలవలకూ, విద్యాశాఖ నియమ నిబంధనలకూ సంబంధించిన కాగితాలు! తీసికోండి."

నేను సగౌరవంగా వాటిని అందుకున్నాను. పాఠ్యక్రమాన్ని జేబులో భద్రపరచుకున్నాను. పాఠ్య గ్రంథాలను కట్టగడుతూవున్నాను.

అధికారి అన్నాడు–"చూడండీ, మీ యిష్టం వచ్చిన పద్ధతిలో ప్రయోగం జరిపే స్వేచ్ఛ మీకు వున్నది. అందుకోసమే మీరు వచ్చింది కూడా. కాని యీ విషయం మాత్రం దృష్టిలో ఉంచుకోండి. పన్నెండో మాసంలో పరీక్షలు వచ్చిపడతాయి. మీ కార్యక్రమం అంతా పరీక్షల కొలబద్దతోనే కొలవబడుతుంది."

నేనన్నాను"-అలాగేనండీ! నా విన్నపం కూడా ఒకటి వుంది. మీరే స్వయంగా పరీక్షకులుగా ఉండాలి. స్వయంగా మీరే నా కార్యక్రమాన్ని అంచనా వేయాలి. ప్రయోగం జరిపే స్వేచ్ఛను నాకు కల్పిస్తున్నారు. నా కార్యక్రమాన్ని మీకే చూపించడం నాకూ సంతోషంగా వుంటుంది. నేను సాధించబోయే విజయానికి గానీ, పొందబోయే పరాజయానికిగానీ కారణాలు మీరు తెలుసుకోగలరు కూడా."

అధికారి నవ్వి ఆమోదసూచకంగా తలవూపాడు. నేను కార్యాలయం నుంచి బయటికి వచ్చేశాను.

## 2

నేను పాఠ్యక్రమ మంతా పరిశీలించాను. అందులో అనేక మార్పులు, చేర్పులు చేయగలననే నమ్మకం కుదిరింది. పాఠ్య పుస్తకాలను కూడా ఒకసారి పైపైన తిరగేశాను. గుణదోషాలు కళ్ళకు కట్టినట్లు కన్పిస్తున్నాయి. ఏమేమి మార్పులు చేయవచ్చునో కూడా ఆలోచించాను. మొదటిరోజు నుంచి



చివరిరోజు వరకూ వున్న కార్యక్రమమంతా ఒక చిత్రంలాగా నా మనస్సులో స్థిరపడిపోయింది. పరీక్షలూ, దాని ఫలితం రోజునుకూడా ఊహించుకున్నాను. సంవత్సరమంతా ఇలా పనిచేయాలి, అలా పని చేయాలి, ఫలితంకూడా యిలా వుంటుంది అనే ఊహలుకూడా నా మనస్సులో కదిలాడాయి. ఆలోచనలో మునిగివున్న నాకు అర్ధరాత్రి దాటి పోయిన సంగతికూడా తెలియలేదు. చివరకు మరుసటి రోజు కార్యక్రమాన్ని గబగబా కాగితంమీద నోట్ చేసికొని మూడుగంటలవుతూ-అవుతూ ఉండగా కునుకులో మునిగిపోయాను.

తెల్లవారింది. ఉత్సాహం వుంది. శ్రద్ధ వుంది. ఆసక్తి వుంది. ఆత్రం వుంది. స్నానం చేశాను. అల్పాహారం తీసుకున్నాను. మూడో నంబరు పాఠశాలకు సకాలంలో చేరుకున్నాను. ఇంకా పాఠశాల ప్రారంభం కాలేదు. తలుపులు తెరవలేదు. మా ప్రధానోపాధ్యాయులు కూడా రాలేదు. బంట్రోతు తాళంచెవులు తీసుకొని రావడానికి వారింటికి వెళ్ళాడు. పిల్లల రాకపోకలు ప్రారంభమయ్యాయి. రోడ్డు అంతా పిల్లల కోలాహలంతో నిండిపోయింది.

"ఎప్పుడు పాఠశాల ప్రారంభమవుతుందా, ఎప్పుడు క్లాసు బాధ్యతను తీసుకొని పని ప్రారంభిద్దామా, ఎప్పుడు నా నూతన ప్రణాళికను అమలు పరుద్దామా, ఎప్పుడు క్లాసులో క్రమశిక్షణనూ, ప్రశాంతతనూ నెలకొల్పుదామా, ఎప్పుడు రసవంతంగా పాఠం బోధిద్దామా, ఎప్పుడు విద్యార్థుల మనస్సును ఆకర్షిద్దామా" అని నేను ఆలోచిస్తూవున్నాను. బహుశా ఆ సమయంలో నా మెదడులోని రక్తంకూడా అతివేగంగా పరుగులు తీస్తూ వుండవచ్చు ననుకుంటాను.

గంట మ్రోగింది. పిల్లలు క్లాసుల్లోకి వచ్చి కూర్చున్నారు. ప్రధానోపాధ్యాయుడు నాతోపాటు వచ్చి నా క్లాసు చూపించాడు. ఆయన పిల్లలతో అన్నాడు-"చూడండి, వీరు లక్ష్మిశంకర్‌గారు. మహా సజ్జనులు, ఉన్నతాశయాలు గలవారు. నేటినుంచి వీరు మీకు ఉపాధ్యాయులుగా ఉంటారు. వీరు

చెప్పినట్లు చేయండి. వీరి ఆదేశాలను పాటించండి. ఎవరూ అల్లరి చేయకూడదు సుమా!"

అటువైపు ప్రధానోపాధ్యాయుడు వాళ్ళకు నన్ను పరిచయం చేస్తున్నాడు. ఇటువైపు నేను రాబోయే పన్నెండు మాసాల కాలం నాకు తోడుగా వుండే సహచరులను ఎదురుగా చూస్తూ వున్నాను. ఒకడు చిరునవ్వు నవ్వాడు. ఒకడు ఓరచూపు చూస్తూ కళ్లు మలుపుతున్నాడు. ఒకడు కోరచూపు చూస్తూ గర్వంగా తల ఆడించాడు. నావైపు కొందరు ఆశ్చర్యంగా చూస్తున్నారు. కొందరు పరిహాసంగా చూస్తున్నారు. కొందరు స్తబ్ధులై నిలబడి వున్నారు.

నేను చూశాను. ఇటువంటి పిల్లలకు నేను బోధించాలి. వెకిలిచేష్టలు చేసేవాళ్ళకూ, అల్లరి చేసేవాళ్ళకూ, గర్వపోతులకూ, పొగరుబోతులకూ, నానా రకాలుగావున్న యీ నాలుగవ తరగతి పిల్లలకు నేను చదువు చెప్పాలి. నా మనస్సు కొంచెం ఉద్రేకపడింది. నా హృదయం కొంచెం కంపించింది. అయినా స్తిమిత పడ్డాను. ఫర్వాలేదను కున్నాను. నిదానంగా ప్రయత్నించి చూద్దాం అనుకున్నాను.

నేను జేబులోనుంచి కాగితం బయటకు తీసి రాత్రి నోట్ చేసుకున్న విషయాలను చూసుకున్నాను. అందులో మొదటి కార్యక్రమం శాంతి ఆట. తరువాత క్లాసు పరిశుభ్రతను పరీక్షించడం, తరువాత సమష్టిగానం, ఆ తరువాత పిల్లలతో సంభాషణ మొదలైనవి వున్నాయి.

నేను పిల్లల్ని పలకరించాను—"రండి మనం శాంతి ఆట ఆడదాం. చూడండి, నేను 'ఓం శాంతిః' అంటాను. అప్పుడు అందరూ మౌనంగా కూర్చోవాలి. అందరూ వరుసలో పద్మాసనం వేసి కూర్చోవాలి. ఎవరూ కదలకూడదు. మెదలకూడదు. తరువాత నేను తలుపులు మూసివేస్తాను. అప్పుడు చీకటిగావుంటుంది. మీరంతా ప్రశాంతంగా వుండాలి. మీకు పరిసరాల కోలాహలం వినిపిస్తుంది. అది వింటుంటే చాలా ఆనందంగా ఉంటుంది.



మీకు ఈగల మోత వినిపిస్తుంది. మీ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు కూడా వినిపిస్తాయి. తరువాత నేను పాట పాడతాను. మీరందరూ వినండి.

ఇదంతా చెప్పిన తరువాత నేను శాంతి ఆట ప్రారంభించాను. నేను 'ఓం శాంతిః' అన్నాను. కాని పిల్లలు తన్నుకుంటూ, గుద్దుకుంటూ, తగవులాడుకుంటూ, ఇష్టం వచ్చినట్లు మాట్లాడుకుంటూ వున్నారు. రెండు మూడు సార్లు హెచ్చరించాను. కాని నా మాటలు గాలిలో కలిసిపోయాయి. నేను మనసులో కొంచెం సిగ్గుపడ్డాను. మౌనంగా వుండమని ఎలా చెప్పేది? అల్లరి చేయవద్దని ఎలా చెప్పేది? చెంపలు వాయించి ఎలా భయపెట్టేది? అయినా ఫర్వాలేదనుకొని నేను ముందుకు సాగిపోయాను. కిటికీలు మూసివేశాను. అంతా చీకటైపోయింది. తరువాత ధ్యానం (?) కొనసాగింది. పిల్లల్లో ఎవరో 'ఊ,ఊ' అంటున్నాడు. ఒకడు 'హావ్వా, హావ్వా' అని అరుస్తున్నాడు. ఒకడు దబదబా కాళ్ళు నేలకేసి బాదుతున్నాడు. ఇంతలో ఒకడు చప్పట చరచాడు. దానితో అందరూ చప్పట్లు చరుస్తూ వున్నారు. తరువాత ఒకడు నవ్వాడు. వెంటనే అందరూ నవ్వారు. నేను సిగ్గుపడ్డాను. నా ముఖం వెలవెల బోయింది. నేను కిటికీలు తెరచాను. కొంచెంసేపు గది బయటికివెళ్ళి మళ్లీ తిరిగివచ్చాను. క్లాసంతా అల్లరితో నిండిపోయింది. పిల్లలు ఒకరికొకరు 'ఓం శాంతిః' అని చెప్పుకుంటున్నారు. కొందరు నిలబడి స్వయంగా కిటికీలు మూసేస్తున్నారు.

నేను ఆలోచించాను. నేను తయారు చేసుకున్న నోట్సు వ్యర్థమైపోయింది. ఇంట్లో కూర్చొని నోట్సుతయారు చేసుకొని ఊహాజగత్తులో బోధించడం సులభమే. కాని యిక్కడ ఇనుపగుగ్గిళ్లు నమలవలసి వస్తున్నది. గతంలో వాళ్లు నేర్చుకున్నది అల్లరి చేయడమే నన్నట్లుగా వుంది. ఇప్పటి వరకూ వాళ్లు అటువంటి కోలాహలం మధ్య పెరుగుతూ వచ్చారు. వాళ్ళముందు శాంతి ఆట ఆడటం బర్రె ముందు భాగవతం చదివినట్లుగానే వుంది. అయినా నేను విచారించలేదు. మొదటి ముద్దలోనే

ఈగ పడిందన్నట్టుగా అయింది. రేపటినుంచి మరో కొత్త కార్యక్రమం ప్రారంభిస్తాను.

నేను క్లాసులోకి వచ్చాను. పిల్లలతో చెప్పాను—"అబ్బాయిలూ, ఈరోజు ఇంతకన్న ఎక్కువగా చేసే పనేమీలేదు. రేపటి నుంచి ఒక కొత్త కార్యక్రమం ప్రారంభిద్దాం. ఈ రోజుకు సెలవు తీసుకోండి."

సెలవుమాట వినగానే పిల్లలు 'హో-హో' అంటూ కేకలు వేస్తూ క్లాసులోనుంచి బయటికి వచ్చేశారు. పాఠశాలంతా గందరగోళంతో నిండిపోయింది. వాతావరణమంతా 'సెలవు, సెలవు, సెలవు' అంటూ ప్రతిధ్వనించింది. నాలుగవ తరగతి పిల్లలు ఎగురుతూ, దుముకుతూ, గంతులు వేసుకుంటూ ఇంటి దారిపట్టారు.

ప్రక్కనున్న విద్యార్థులూ, ఉపాధ్యాయులూ 'ఇదేమిటా!' అని వింతగా చూస్తూ ఉండిపోయారు. ప్రధానోపాధ్యాయుడు గబగబా నా దగ్గరకు వచ్చాడు. నొసలు విరిచాడు. "మీరు వాళ్ళకు సెలవు యెందుకిచ్చారు ? ఇంకా రెండు గంటలు పాఠశాల జరగాలి గదా!" అన్నాడు.

నేనన్నాను-"అయ్యా, పిల్లలు యీ రోజు ఆసక్తి చూపడంలేదు. అందరూ అస్తవ్యస్తంగా వున్నారు. శాంతి ఆటతోనే ఆ విషయం నాకు అర్థమైపోయింది."

ప్రధానోపాధ్యాయుడు కొంచెం కటువుగా అన్నాడు-"వాళ్ళు యెట్లావున్నా సరే నన్ను అడగకుండా మీరు యీ విధంగా సెలవు యివ్వడానికి వీలులేదు. ఒక క్లాసు పిల్లలు ఇళ్ళకు వెళ్ళిపోతే మిగిలిన క్లాసుల వాళ్ళు ఎలా చదువుతారు? మీరు చేస్తున్న యీ ప్రయోగాలు ఇక్కడ పనికిరావు."

ఆయన కొంచెం కోపం తెచ్చుకొని మళ్ళ అన్నాడు-"మీరు చెపుతున్న ఆసక్తి-గీసక్తి, అవధానం-గివధానం అన్నీ కట్టి పెట్టండి.



శాంతి ఆట మాంటిస్సోరీ పాఠశాలలోనే వుంటుంది. ఇక్కడ శాంతి ఆట నవ్వులాటగా ఉంటుంది. ప్రాథమిక పాఠశాల పిల్లలు చెంపదెబ్బపడితేనే చెప్పినట్లు వింటారు. అందరూ నియమ పూర్వకంగానే చదువుతున్నారు, చదివిస్తున్నారు. మీరుకూడా ఆ దారిలోనే బోధిస్తే సంవత్సరాంతానికి సత్ఫలితం కనిపిస్తుంది. మీ ప్రయోగంతో వాళ్ళముందు' నవ్వులపాలయ్యారు. పైగా ఒకరోజు అనవసరంగా నష్టపోయారు."

నాకు మా ప్రధానోపాధ్యాయుని మీద జాలి కలిగింది. నేనన్నాను-"దెబ్బలు కొట్టి చదివించేపని అందరూ చేస్తూనే వున్నారు. దాని ఫలితమే ఇవాళ చూస్తున్నాను. పిల్లలు మొరటుగానూ, అమర్యాదగానూ ప్రవర్తిస్తున్నారు. అల్లరి పిల్లలయిపోయారు. హద్దు మీరిపోయారు. కొరకరాని కొయ్యలుగా తయారయ్యారు. ఈ నాలుగు సంవత్సరాలలో వీళ్ళు 'హో-హో' 'హూ,హూ' అని కేకలు వేయడం, చప్పట్లు కొట్టడమే నేర్చుకున్నట్లుగా కన్పిస్తున్నది. వాళ్ళకు పాఠశాలమీద ప్రేమలేదు. సెలవు పేరు వినగానే ఎగురుతూ, దుముకుతూ పరుగుతీశారు."

"అయితే ఇప్పుడు మీరు ఏమి సాధిస్తారో చూస్తాంగదా!" అన్నాడు ప్రధానోపాధ్యాయుడు.

నేను కూడా మరింత పట్టుదలతో నెమ్మదిగా ఇంటికి చేరుకున్నాను. ఆలోచిస్తూ పడుకొన్నాను-"నేను చేయబోయే పని చాలా కష్టమైనది. ఇది నాకు నిజంగా ఒక పరీక్ష అనే చెప్పాలి. అయినా నాకేమీ చింతలేదు. అధైర్యపడకూడదు. ఎక్కడైనా శాంతి ఆట ఇలా వుంటుందా? మాంటిస్సోరీ పద్ధతిలో దీనికోసం ముందుగానే ఎంతో శిక్షణ ఇవ్వబడుతుంది. వచ్చీ రావడంతోనే శాంతి ఆట ప్రారంభించి నేను కూడా కొంచెం తెలివి తక్కువ పనేచేశాను. నేను వాళ్ళను పరిచయం చేసుకోవాలి. పరిచయాన్ని పెంచుకోవాలి. వాళ్ళ ప్రేమను పొందాలి. వాళ్ళకు అభిరుచిని కలిగించాలి. అప్పుడే వాళ్ళు నేను చెప్పినట్లు వింటారు. నేను చెప్పి

సట్లు చేస్తారు. బడికన్న సెలవంటేనే ఎక్కువగా ఇష్టం వున్నచోట పని చేయడమంటే అర్థం భగీరథ ప్రయత్నమే."

మరుసటి రోజు చేయవలసిన కార్యక్రమాన్ని నిశ్చయించుకొని ఆ తరువాత నిద్రపోయాను. నా కార్యక్రమాన్ని గురించిన కలలతోనే ఆ రాత్రి గడచిపోయింది.

## 3

పాఠశాల ప్రారంభమయింది. నేను క్లాసులోకి వెళ్ళాను. పిల్లలు నా చుట్టూచేరి నిలబడ్డారు. ఆనందంగా వున్నారు. ఉత్సాహంగా ఉన్నారు. పరిహాసంగా అడిగారు-"మాస్టరుగారూ, ఈ రోజు కూడా సెలవు ఇవ్వరూ? ఈరోజు కూడా సెలవు, సెలవు, సెలవు!"

నేను సరేనన్నాను-"అయితే యీ రోజంతా సెలవు యివ్వను. ఓ రెండు గంటలు మాత్రమే. ముందుగా నేనొక కథ చెపుతాను వినండి. తరువాత వేరే విషయాలు మాట్లాడుకుందాం."

నేను వెంటనే కథ ప్రారంభించాను.

"అనగా అనగా ఒకరాజు. ఆ రాజుకు ఏడుగురు రాణులువున్నారు. ఏడుగురికీ ఏడుగురు రాకుమారులు, ఏడుగురికీ ఏడుగురు రాకుమార్తెలు!"

పిల్లలందరూ గోలగా, గలిబిలిగా, గందరగోళంగా అరుస్తూ వచ్చి నా చుట్టూ కూర్చున్నారు. నేను కథ చెపుతూ చెపుతూ మధ్యలో ఆపి వాళ్ళతో అన్నాను-"చూడండి, అందరూ సరీగా కూర్చోండి. ఇలా అయితే కుదరదు."

అందరూ కొంచెం కుదురుగానే కూర్చున్నారు. అయితే "తొందరగా చెప్పండీ, తొందరగా చెప్పండీ, తరువాత ఏమయిందండీ, ఆ తరువాత ఏమయిందండీ!" అంటూ అదే పనిగా ప్రశ్నిస్తున్నారు.

నేను చిరు నవ్వు నవ్వుతూ కథ ప్రారంభించాను—



"ఏడుగురు రాకుమార్తెలకు ఏడేడు రాజభవనాలు, ప్రతి భవనానికీ ఏడేడు ముత్యాల పందిళ్ళు!"

పిల్లలు కళ్ళప్పగించి కథ వింటూ కూర్చున్నారు. క్లాసంతా నిశ్శబ్దంగా వుంది. ఒక్కరు కూడా నోరెత్తడం లేదు. "ఈ క్లాసులో ఇంత ప్రశాంతత ఎలా యేర్పడిందా!'' అని ప్రధానోపాధ్యాయుడు ఆలోచించి వుంటాడు. ఆయన హఠాత్తుగా నా క్లాసులోకి ఊడిపడ్డాడు. ''చెప్పండి, చెప్పండి, కథ చెపుతున్నారా?" అన్నాడు.

"అవునండీ, కథ చెపుతున్నాను. ఇది కొత్తరకం శాంతి ఆట. రెండూ తోడు జోడుగా నడుస్తున్నాయి.'' అన్నాను నేను.

ప్రధానోపాధ్యాయుడు వెనక్కు తిరిగి వెళ్ళి పోయాడు. నా కథ కొనసాగుతూనేవుంది. ప్రక్కనున్న క్లాసులన్నీ గందరగోళంగా వున్నాయి. అప్పుడు నేనన్నాను—''ప్రక్క క్లాసుల్లో ఎంత గందరగోళం జరుగుతున్నదో చూడండి!'' పిల్లలందరూ ఆ గందరగోళం పట్ల తమ నిరసన భావాన్ని తెలియజేశారు.

కథ సగం పూర్తయింది. అప్పుడు అందరినీ అడిగాను—"అబ్బాయిలూ సెలవు కావాలా? కావాలంటే కథ ఆపివేస్తాను. కథ కావాలంటే కొనసాగిస్తాను."

అందరూ ఒక్కసారిగా అరచారు—"కథ చెప్పండి, కథ చెప్పండి. మాకు కథే కావాలి. సెలవు అక్కరలేదు."

''అయితే మంచిదే! కథ వినండి, మధ్యలో కొంచెం పిచ్చా పాటి మాట్లాడుకుందాం. ఆ తరువాత గంట కొట్టే వరకూ కథ చెపుతాను.'' అన్నాను నేను.

ఒక కుర్రవాడు అన్నాడు—"మధ్యలో మాటలెందుకండీ, అవి రేపు చెప్పుకుందాం. త్వరగా కథ చెప్పండి. కథ సాంతం అయిపోవాలి.''

''కథ అప్పుడే యెక్కడ అయిపోతుంది? ఈ కథ ఇంకా

నాలుగు రోజులకు కూడా పూర్తికాదు." అన్నాను నేను.

అందరు—"ఓహో, అంత పెద్ద కథా? అయితే బలే మజాగా ఉంటుంది."

నేను జేబులో నుంచి రిజిస్టరు తీశాను. పిల్లల పేర్లు వ్రాసుకోవడం ప్రారంభించాను. అందరూ చకచకా, టకాటకా వచ్చి పేర్లు వ్రాయించుకున్నారు. నేను హాజరు తీసుకున్నాను. "చూడండీ, ఇక నుంచి నేను రోజూ కథ ప్రారంభించే ముందే హాజరు తీసుకుంటాను. ఆ తరువాతనే కథ చెపుతాను." అని చెప్పి కథ ప్రారంభించాను. గంట కొట్టే వరకు కథ సాగుతూనేవుంది.

గంట కొట్టినా పిల్లలు కదలడం లేదు. "కాసేపు కూర్చోండి, కథ చెప్పండీ!" అంటున్నారు.

"ఈ రోజు ఇంతవరకు చాలు, మళ్ళీరేపు" అని నచ్చజెప్పి వాళ్ళందర్నీ అడిగాను—"రేపు సెలవు కావాలా? కథ కావాలా?"

"మాకు కథ కావాలి, కథే కావాలి!" అంటూ అందరూ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

నిన్నటి 'సెలవు, సెలవు, సెలవు', అనే శబ్దాలకు బదులు నేటి వాతావరణంలో 'కథ, కథ, కథ' అనే శబ్దాలు ప్రతిధ్వనించాయి.

నేను ఆలోచించాను—"నిన్నటి నష్టం ఈ రోజు పూడ్చుకో గలిగాను.కథ ఒక అద్భుతమైన ఇంద్రజాలం అనే మాట అక్షరాలా నిజం!"

## 4

మరుసటిరోజు ఉదయం పిల్లలందరూ ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ వచ్చారు. నేను క్లాసులోకి ప్రవేశించగానే ఒకరి నొకరు త్రోసుకుంటూ గబాగబా వచ్చి నా చుట్టూ కూర్చున్నారు. "మాస్టరుగారూ, కానివ్వండి, కథ చెప్పండి!" అంటున్నారు.



"ముందు హాజరు తీసుకోవాలి. తరువాత కొంతసేపు సంభాషణ. ఆ తరువాత మన కథ" అన్నాను.

నేను జేబులో నుంచి సుద్దముక్క తీశాను. వలయాకారంగా నేల మీద ఒక గీత గీశాను. రోజూ వచ్చి ఆ గీత మీద వలయాకారంగా కూర్చోమని చెప్పాను. నేను కూర్చొని చూపించాను-, "ఈ విధంగా కూర్చోవాలి. ఈ చోటు నాది. నేను ఇక్కడ కూర్చొని కథ చెపుతాను." అన్నాను.

అందరూ అలాగే కూర్చున్నారు. నేను కూడా కూర్చున్నాను. హాజరు తీసుకున్నాను. కథ ప్రారంభించాను. అందరూ ఎంతో ఆసక్తి చూపుతున్నారు. కథ సాగిపోతూ వుంది. అందరూ మంత్రించిన బొమ్మల్లాగా కదల కుండా కూర్చున్నారు. మంత్రముగ్ధులై వింటున్నారు. మధ్యలో కథ ఆపివేశాను. "కథ ఎలా వుందో చెప్పండి" అని ప్రశ్నించాను.

"కథ చాలా బాగుంది. మాకు బాగా నచ్చింది!" అన్నారు.

"కథ వినడానికి ఎలా ఇష్టపడుతున్నారో అలాగే కథ చదవడం కూడా మీకు ఇష్టమేనా?"

"అవును కథలు చదవడం కూడా మాకు ఇష్టమే. కాని ఇటువంటి కథలుండే పుస్తకాలు ఎక్కడున్నాయి?''

"ఇటువంటి కథల పుస్తకాలు నేను తెచ్చియిస్తే మీరు చదువుతారా?"

"చదువుతాం, చదువుతాం, తప్పకుండా చదువుతాం."

అందులో ఒక తెలివైన కుర్రాడు అన్నాడు - "మాకు మేము చదువుకోవడమే కాకుండా మీరు కూడా కథలు చెబుతూ వుండవలసిందే!"

అలాగే నంటూ మళ్ళీ కథ ప్రారంభించాను.

గంట మోగింది. నా కథ ఆగిపోయింది. అందరూ నా చుట్టూ నిలబడ్డారు. కొందరు నావైపు ప్రేమతో చూస్తూవున్నారు. కొందరు నెమ్మదిగా

నా చేతిని తాకుతూ మనసులో ఆనందంతో పొంగిపోతున్నారు.

"సరే ఇక ఇళ్ళకు చేరండి!" అన్నాను.

"ఇప్పుడే వెళ్ళమండీ, సాయంత్రం దాకా కూర్చుంటాం. మీరు కథ చెప్పండీ!"

పిల్లలు ఇళ్ళకు వెళ్ళిపోయారు. కొందరు ఉపాధ్యాయులు నా దగ్గరకు వచ్చారు. "మీరు ఎంతపని చేశారండీ! మీ పిల్లలు కథ వినడం చూశారు. ఇప్పుడు మా క్లాసుల్లో పిల్లలు కూడా కథలు వినాలంటున్నారు. చదువు మీద శ్రద్ధ చూపడం లేదు. మీ క్లాసులోకి వచ్చి కథ వింటామని గోలచేస్తున్నారు. లేకపోతే మీరైనా కథ చెప్పండి అని మమ్మల్ని వేధిస్తున్నారు.

"మీరు కూడా అప్పుడప్పుడు వాళ్ళకు ఏదైనా కథ వినిపిస్తూ వుండండి!" అన్నాను.

"కథలెవరికొస్తాయండీ బాబు! ఒక్క కథ కూడా గుర్తుకు వచ్చి చావడం లేదు చెప్పడానికి!"

నాలో నేను నవ్వుకున్నాను.

## 5

ఆ మర్నాడు ఆదివారం. విద్యాశాఖ ఉన్నతాధికారిని కలిసికొనడానికి వెళ్ళాను.

ఆయన అడిగాడు-"ఏం బ్రదర్! మీ ప్రధానోపాధ్యాయుడు చెపుతున్నాడు. మీరు కాలమంతా కథలతోనే గడిపేస్తున్నారటనే?"

"అవునండీ, ఇప్పటి వరకూ కథే సాగుతున్నది.

ఆయన మళ్ళ ప్రశ్నించాడు-"మరి ప్రయోగం ఎప్పుడు అమలు జరుపుతారు? అభ్యాసాలు ఎప్పుడు పూర్తి చేస్తారు?

నేను చెప్పాను, ''ప్రయోగం అమలు జరుపుతూనే ఉన్నాను.



ఉపాధ్యాయులనూ, విద్యార్థులనూ మరింత దగ్గరకు చేర్చడానికి కథ ఒక మంచి సాధనం. ఆ విషయంలో కథ అద్భుతంగా, ఇంద్రజాలం లాగా పనిచేస్తుంది. ఈ నిజాన్ని నేను అనుభవం ద్వారా తెలుసుకొన్నాను. మొదటి రోజు నా మాటే విననివాళ్ళు, 'హా, హా' 'హీ, హీ' అని నన్ను నానా రకాలుగా వేధించిన వాళ్ళు కథ చెప్పడం ప్రారంభించిన దగ్గర నుంచి శాంత మూర్తులై పోయారు. నన్ను ప్రేమతో చూస్తున్నారు. చెప్పినట్లు కూర్చుంటున్నారు. చెప్పిన మాట వింటున్నారు. మౌనంగా వుండమనీ, అల్లరి చేయవద్దనీ చెప్పవలసిన అవసరమే కలగడం లేదు. ఇంటికి వెళ్ళిపొమ్మని చెప్పినా కూడా క్లాసులో నుంచి కదలడంలేదు."

ఉన్నతాధికారి అన్నాడు-"మంచిదే, అర్థమయింది. మరి నూతన విధానంతో ఎప్పుడు బోధిస్తారు?"

"అయ్యా, ఇప్పుడు చేస్తున్న పనే అది. నూతన విధానంతోనే బోధిస్తున్నాను. ఇప్పుడు వాళ్ళకు కథ ద్వారానే కట్టుబాట్లు నేర్పుతున్నాను. అవధానం అలవరుస్తున్నాను. వాళ్ళ భాషను తప్పులు దిద్ది సంస్కరిస్తున్నాను. సాహిత్యపరిచయం కలిగిస్తున్నాను. రేపటి నుంచి మరికొన్ని ఇతర విషయాలు కూడా నేర్పడం ప్రారంభమవుతుంది." అని చెప్పాను నేను.

"అయితే బాగానే వుంది. కాని సంవత్సరమంతా కథలతోనే గడచిపోకుండా చూస్తారు కదూ!" అన్నాడాయన.

"దానిని గురించి మీరేమీ ఆందోళన పడకండి!" అన్నాను.

## 6

కథ కోసం విద్యార్థులు గోళాకారంలో కదలకుండా కూర్చున్నారు. నేను బోర్డుమీద వ్రాశాను—

ఈ రోజు కార్యక్రమం—హాజరు తీసుకోవడం, సంభాషణ, కథ.

హాజరు తీసుకున్నాను. సంభాషణ ప్రారంభించాను - "రండి, మీ గోళ్ళు చూపించండి! అవి ఎలా ఉన్నాయో చూద్దాం. అందరూ నిలబడి మీ చేతులు చూపించండి!

అందరిగోళ్ళూ పెరిగే వున్నాయి. గోళ్ళలో మట్టికూడా పేరుకు పోయి వుంది.

"మీ టోపీలు చేతిలోనికి తీసికొని చూడండి! ఎంత మురికిగా ఉన్నాయో చూడండి! ఎంత చిరుగు పట్టాయో, పాతబడ పోయాయో చూసుకోండి!''

అందరూ తమ టోపీలు తీసి చూసుకున్నారు. ఒకరిద్దరివి తప్ప మిగిలిన వాళ్ళ టోపీలన్నీ శిధిలావస్థలోనే వున్నాయి.

"మీ చొక్కా గుండీలు సరిగా ఉన్నాయేమో చూసుకోండి?"

చివరకు చెప్పాను—"ఈ రోజు ఇంతకన్న పరీక్షించను. కథకు ఆలస్యమై పోతున్నది కదూ! అని వెంటనే కథను ప్రారంభించాను.

కథ మధ్యలోనే ఒక పిల్లవాడు అడిగాడు—"మాస్టరుగారూ, కథల పుస్తకాలు ఎప్పుడు తెస్తారండీ?"

''ఒకటి రెండు రోజుల్లో తీసుకొని వస్తాను. సరే, కథల పుస్తకాలు చదువ దలచుకున్న వాళ్ళంతా చేతులెత్తండి!" అన్నాను. అందరూ చేతులెత్తారు.

"అయితే ఇది వరకు మీరు ఏయే కథల పుస్తకాలు చదివారో వాటి పేర్లు చెప్పండి!" అన్నాను. కొద్ది మంది రెండు మూడు కథలు చదివారు. వాళ్ళు నాలుగో తరగతి దాకా వచ్చారు. అయినా వాళ్ళ పాఠ్య పుస్తకాలు తప్ప ఇతర పుస్తకాలు చాలా మంది అసలు చదవనేలేదు.

"మీలో ఎవరైనా మాస పత్రిక చదువుతున్నారా?'' అని అడిగాను. ఇద్దరు మాత్రం "మేము 'బాలమిత్ర' చదువుతున్నామండీ!" అన్నారు.



"అయితే మంచిదే! నేను కథల పుస్తకాలు తెస్తాను. మీరందరూ చదవండి. కావలసినన్ని కథల పుస్తకాలు తెస్తాను. మీరు చదివి చదివి అలసి పోతారనుకోండి!" అన్నాను.

అందరూ చాలా సంతోషంగా కన్పించారు.

తరువాత గంటమోగే వరకు కథ చెప్పాను. వెళ్ళేటప్పుడు ఒక సంగతి చెప్పాను-"అబ్బాయిలూ ఒక మాట వినండి, వలయంగానే కూర్చొని వినండి! రేపు అందరూ మీ గోళ్ళు తీయించుకొని రండి. మీకు చేతనైతే మీరే తీసుకోండి. చేతకాకపోతే మీ నాన్నతోనో, అమ్మతోనో తీయించుకోండి."

"నేను గోళ్ళు పళ్ళతో కొరుక్కుంటానండీ!" అన్నాడు ఒక పిల్లవాడు.

"అలా చేయకూడదు. గోరుగల్లుతోనో, చాకుతోనో గోళ్ల తీసుకోవాలి." అని చెప్పాను.

"మనం మరో తమాషా చేద్దాం!" అన్నాను మళ్ళీ.

"అదేమిటీ?" అన్నారు అందరూ.

"మీరు మీతల మీది టోపీలు తీసేసి బడికి రండి. ఈ మురికి బట్టిన టోపీలు లేకపోవడమే మంచిది. అయినా ఈ టోపీల అవసరం మాత్రం ఏముంది?" అన్నాను.

అందరూ నవ్వారు-"అమ్మబాబోయ్! టోపీలు లేకుండా బడికి రావడమే! ప్రధానోపాధ్యాయులు కోప్పడతారు."

"రేపటినుంచి నేను టోపీ లేకుండానే వస్తాను. మీరందరూ అలాగే రండి."

"టోపీలు లేకుండా రావడానికి మా అమ్మా, నాన్నా ఒప్పుకోకపోతే?" అన్నారు అందరూ.

"మురికి టోపీ ధరించే కన్నా అది లేకపోవడమే మంచిదనీ, అది

అనవసరపు బరువు అనీ మీ తల్లిదండ్రులతో చెప్పండి!" అన్నాను.

"చొక్కా గుండీలు చక్కగా కుట్టించుకొనిరండి. ఇలా గుండీలు లేకుండా వుండటం బాగా లేదుకదూ!" అని కూడా అన్నాను. అందరూ మనసులో ఆలోచించుకుంటూ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

దారిలో ప్రధానోపాధ్యాయులు కలిశారు. ఆయన అన్నాడు-"ఏం బ్రదర్, అంతా తారుమారు చేసేస్తున్నారు.? ఈ నటనంతా ఎందు కంటారు? గుండీలు కుట్టించుకోమనీ, గోళ్లు తీయించుకోమనీ, ఇదనీ, అదనీ-ఎందుకండీ ఇదంతా? నూతన విధానంతో బోధించడానికి వచ్చారు కదా! ఆదేదో బోధించగూడదూ? గోళ్ళూ, గుండీలూ తల్లిదండ్రులు చూసుకో వలసిన పని. అదేదో వాళ్ళే చూసుకుంటారు. వాళ్ళు చూసుకోక పోయినా మనకేమిటి నష్టం? ఆ శ్రమ మనకెందుకండీ? మరో సంగతి వినండి. టోపీలు లేకుండా పిల్లలు బడికి రావడానికి నేను అనుమతించను. అలా రావడం అసభ్యంగా వుంటుంది. అలా రావాలంటే పై అధికారుల నుంచి అనుమతి తీసుకోవడం చాలా అవసరం."

నేనన్నాను-"అయితే మరి యివే గదండీ నూతన బోధనా పద్ధతులు? మురికి దుస్తులతో వస్తూ, మొరటుగా ప్రవర్తిస్తూ ఉండే పిల్లలకు మొదటి సారిగా బోధించవలసినవి మరేముంటాయండీ? ఈ లోపాలను వాళ్ళ దృష్టికి తీసుకొనిరాగానే వాళ్ళంతా ఎంతో సిగ్గు పడ్డారు. ఇలా మురికిగా ఉండడం బాగా వుండదనే అభిప్రాయం వాళ్ళకు కలిగింది. ఇక ముందునుంచి చాలా మంది విద్యార్థులు పరిశుభ్రంగా ఉండడానికి ప్రయత్నం ప్రారంభిస్తారనే నమ్మకం కూడా నాకు కలిగింది. ఇక టోపీల సంగతంటారా? ఈ విషయంలో పై అధికారుల అభిప్రాయం కూడా తెలుసుకుంటాను. అధికారుల అనుమతి లభించకపోతే యీ మార్పును ప్రస్తుతం ప్రవేశ పెట్టకుండా వాయిదా వేస్తాను."

నేను ఇంటికి వెళ్ళాను. భోజనం చేశాను. వెంటనే ఉన్నతాధికారి



ఇంటికి వెళ్ళాను.

"ఏమండీ! చీకటిబడి వచ్చారేమిటి?"

"అయ్యా, ఒక విషయంలో మీ అభిప్రాయం తీసికోవాలని వచ్చాను"

"చెప్పండి, ఏమిటా విషయం?"

"నేనూ, నావిద్యార్థులూ క్లాసులోకి టోపీలు లేకుండా రావచ్చునా?"

"అలా ఎందుకు రావడం?"

"వాళ్ళ టోపీలన్నీ బాగా మురికి బట్టి పోయాయి. వాటికి అక్కడక్కడ చిరుగులు కూడా వున్నాయి. అంత అసహ్యంగా వున్న టోపీలు తీసివేసి వస్తే మాత్రం నష్టం ఏమిటంటారు? అంత లేత వయసులో వున్న ఆ పిల్లల నెత్తి మీద ఆ టోపీ బరువు లేక పోతే మాత్రం ఏమిటంటారు?"

"అలా టోపీలు తీసివేసి రావడం ప్రజలకు విచిత్రంగానూ, హాస్యాస్పదంగానూ కన్పించదూ?"

"కన్పిస్తుంది. కాని యీ విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?"

"నూతన ప్రయోగం అమలు జరిపే సందర్భంలో మనం అటు వంటి సాంఘికాచారాల జోలికి పోకుండా వుండడమే మంచిదనుకుంటాను. మనం పాఠశాల ఆవరణలోనే కూర్చొని ప్రస్తుత విద్యా విధానంలో ఏయే మార్పులు అవసరమో, ఏయే సంస్కరణలు ప్రవేశ పెట్టగలమో ఆలోచించాలి. అంటే అవన్నీ పాఠశాల పరధిలోనే ఆలోచించాలి. టోపీలు-గీపీలు సంగతి వదిలేయ్ బ్రదర్!"

"మీ అభిప్రాయం కొంచెం సంకుచితంగా వున్నట్లు కన్పిస్తున్నది. అయితే ప్రస్తుతానికి దీని కోసం వత్తిడి చేయననుకోండి! ప్రారంభంలోనే ప్రజల విముఖతనూ, మీ వ్యతిరేకతనూ కొని తెచ్చుకోను."

"పిల్లలు క్లాసు గదిలో టోపీలు తీసివేసి తమ పని చేసుకుంటుంటే మీకేమైనా అభ్యంతరమా?" అని అడిగాను.

"నాకేమీ అభ్యంతరం లేదు. క్లాసులోపల మీ యిష్టం వచ్చిన మార్పులు చేసుకోండి. అలా చేసుకుంటూ పోతే, ప్రజలు కూడా దాన్ని ఆమోదించే పక్షంలో టోపీలు తప్పని సరిగా పెట్టించాలనే పట్టుదల నాకేమీ లేదు." అన్నాడు ఉన్నతాధికారి.

"సరే, మంచిదే. మరో విషయం అడుగుతున్నాను. నేను క్లాసులో ఓ చిన్న గ్రంథాలయం స్థాపించాలనుకుంటున్నాను. దానికి యేమయినా ధనసహాయం లభించగలదా?"

అధికారి అన్నాడు- "అది సాధ్యం కాదండీ! ధన సహాయానికి అవకాశమేలేదు. ఓ విధంగా చెప్పాలంటే మీ ప్రయోగం మనిద్దరికి సంబంధించిన విషయమే. బడ్జెటులో కేటాయించబడిన ధనంతోనే పాఠశాలలు నడుపవలసి వుంటుంది. మీ పాఠశాలలో మీ క్లాసు వాటాకు అర్థ రూపాయో, ఒకప్పావలాయో వస్తుంది. దానితోనే మీరు సరిపెట్టుకోవలసి వుంటుంది."

"మరి ఏమి చేయాలండీ?" అన్నాను.

"ప్రస్తుతానికి యీ ఆలోచనను విరమించండి." అన్నాడు అధికారి.

అప్పుడు నేనన్నాను—"దీని కోసం నా దగ్గర మరో ప్రణాళిక వుందండీ! అయితే దానిని మీరు అంగీకరిస్తేనే అమలు పరచగలను. ప్రతి విద్యార్థి క్లాసు పుస్తకాలు కొనుక్కోవలసి వుంటుంది గదా! నాలుగో తరగతి వాచకమూ, గైడ్, చరిత్ర అందరూ కొంటూనే వున్నారు.''

"అవును, నిజమే."

"నా క్లాసు విద్యార్థుల చేత క్లాసు పుస్తకాలు కొనిపించకుండా ఆ డబ్బుతో చదువదగిన మంచి పుస్తకాలు కొంటే వాటితో ఓ చిన్న గ్రంథాలయం స్థాపించుకోవచ్చు."

"బాగానే వుంది మీ ఆలోచన! కాని క్లాసు పుస్తకాలు లేకుండా



ఏమి బోధిస్తారు?"

"ఆ సంగతి ఆలోచించే వుంచాను. బోధనా పద్ధతిలో కూడా నేను తీసికొని రాబోయే మార్పు మీద నాకు పూర్తిగా విశ్వాసం వుంది. నేను మీకు అమలు జరిపి చూపిస్తాను. ఈ విషయంలో మిమ్మల్ని సంతృప్తి పరచగలననే హామీ కూడా యివ్వగలను."

"సరే మంచిది, ప్రయోగం మీది, ఫలితం కూడా మీరే చూపించ వలసి వుంటుంది. ఆ విషయం నేను అంగీకరిస్తున్నాను. అయినా మిమ్మల్ని ఒకసారి హెచ్చరించ వలసిన బాధ్యత కూడా నా మీద వుంది. చూడండి! విద్యార్థులను సోమరిపోతులను కానివ్వకండి. ప్రయోగం అమలు పరచడంలో మీకు నా సహకారం పూర్తిగా వుంటుంది. కాని మనసులో కొంచెం ఆందోళన కలుగుతోంది."

నేనన్నాను—"అయ్యా, మీరు నమ్మకంగా వుండండి. ఒకసారి పరీక్షించి చూడండి—ప్రయత్నిస్తే తప్పకుండా మనకు విజయం లభిస్తుంది."

"మంచిదే కాని సంవత్సరం ఆఖరికి మీ గ్రంథాలయం ఏమవుతుంది? ఆ గ్రంథాలు విద్యార్థులకు పంచిపెడతారా?"

"అవునండీ, ఓ రకంగా ఆలోచిస్తే అలాకొన్ని పుస్తకాలు ఆ క్లాసు మొత్తానికి చెందుతాయి. వాటిని ఆ క్లాసు వాళ్ళకు ఒప్పగించవలసిందే. కాని ఆ పుస్తకాలను తిరిగి కోరవద్దనీ, వాటిని ఆ క్లాసు గ్రంథాలయంలో ఉండనివ్వమనీ పిల్లల తల్లిదండ్రులకు నచ్చ జెప్ప గలిగితే గ్రంథాలయం స్థిరపడిపోతుంది. ప్రతి సంవత్సరం అందులోకి కొత్త కొత్త పుస్తకాలు చేరుతూనే వుంటాయి."

"మీరు వెలిబుచ్చుతున్న యీ అభిప్రాయం జనానికి గొంతు దిగుతుందో లేదో తెలియదు కాని మిగిలిన మీ అభిప్రాయాలన్నీ చాలా బాగున్నాయి. ఈ ప్రయోగానికి కూడా తప్పకుండా ఒక అవకాశం ఇచ్చి

చూడండి. అయితే క్లాసు పుస్తకాలు లేకుండా ఎలా బోధిస్తారు?"

"ఆ విషయం నేను ఆలోచించే వుంచాను."

ఉన్నతాధికారి వద్ద సెలవు తీసుకొని నేను నెమ్మదిగా ఇంటికి చేరుకున్నాను.

## 7

మరుసటి రోజు పాఠశాల ప్రారంభమయింది. బహుశా పిల్లలు టోపీలు తీసివేసి వస్తారని అనుకున్నాను. కాని నా భ్రమ తొలిగిపోయింది. అలా టోపీలు లేకుండా రావడానికి తల్లిదండ్రులు అంగీకరించలేదని తెలిసింది. పైగా "టోపీలు లేకుండా ఎలా వెళ్తారు? మీ పంతులు కేమైనా పిచ్చి బట్టిందా ఏమిటీ?" అన్నారట!

నేను వాళ్ళ గోళ్ళు చూశాను. నలుగురైదుగురు మాత్రం గోళ్ళు తీయించుకున్నారు. మిగతా వాళ్లు తీయించుకోలేదు. ఇళ్ళల్లో వుండే రకరకాల ఇబ్బందులే ఇందుకు కారణం. చొక్కాల గుండీలు కుట్టే తీరిక ఎవరికున్నది? పైకా ఒక తల్లి యీ విధంగా కబురు చేసింది - "మాస్టరు గారూ మీరు వచ్చింది చదువు చెప్పడానికి కాబట్టి, చదువే చెప్పండి. ఈ కొత్త కొత్త విద్యలన్నీ ప్రదర్శించి మా ప్రాణాలెందుకు తీస్తారు? పిల్లలకు గోళ్ళు గిల్లుకుంటూ, వాళ్ళ చొక్కాలకు గుండీలు కుట్టుకుంటూ కూర్చొనడానికి మాకేమీ పని పాటలు లేవనుకున్నారా? మీకేం, మీరు చెపుతారు. అలా చెయ్యండి, ఇలా చెయ్యండని. మా పిల్లలెప్పుడూ ఇలాగే వచ్చేవాళ్ళు. ఇకముందు కూడా ఇలాగే వస్తారు. మాకు ఆఖరుకు చావడానిక్కూడా తీరికలేదు. మీ ఒత్తులు ఒత్తడానికి మాకు తీరికెక్కడిది?"

నేను ఆశ్చర్యపోయాను. పాఠశాల తెరవగానే క్లాసు పరిశుభ్రంగా కన్పిస్తుందనుకున్నాను. కాని అందుకు బదులుగా ఇటువంటి సందేశాలు అందుతున్నాయి. అయినా పర్వాలేదు. ఈ విధంగా అయితే నా ప్రయో



గం సఫలం కాదనుకున్నాను. ఓ వైపు తల్లిదండ్రుల సహకారాన్ని పొందవలసి వుంటుంది. మరోవైపు క్లాసులోనే విద్యార్థుల మనస్సులో ఇటువంటి విషయాలపట్ల అభిరుచి కలిగించ వలసి వుంటుంది. అందుకు తగిన ప్రణాళికను రూపొందించు కున్నాను

ఆ రోజు పిల్లలతో సంభాషణ జరపలేదు. వెంటనే కథ ప్రారంభించాను. ప్రారంభించిన కథను పూర్తిచేశాను.

"ఇంకో కథ!" అన్నారు పిల్లలు.

"రేపు కొత్త కథ ప్రారంభిస్తాను!" అన్నాను, "రండి యీ రోజు కొంచెం సేపు ఆడుకుందాం?" అని కూడా ఆహ్వానించాను.

"ఆడుకోవడమా?" పిల్లలు అదో విధంగా నోరు తెరచి నావైపు చూస్తూ ఉండిపోయారు. "అవును ఆడుకుందాం. ఆట ఆడుకుందాం! మీకు ఏయే ఆటలు తెలుసో చెప్పండి!"

"మాకు చాలా ఆటలు తెలుసు. కాని క్లాసులు జరిగే సమయంలో ఆడుకోవటమా!"

"ఎందుకు ఆడుకోగూడదు?"

"ఇది క్లాసులు జరుగుతున్న సమయం. ఈ సమయంలో పిల్లలు ఆడుకోవడం ఎన్నడూ చూడలేదు."

"కాని మనం ఆడుకుందాం. మీతో పాటు నేను కూడా ఆడతాను రండి, మనం ఆడుకుందాం!"

కొందరు పిల్లలు గీసిన చిత్రాల్లాగా నిలబడే వున్నారు. కొందరూ 'హో,హో', 'హూ,హూ' అనుకుంటూ ఆటలాడటానికి పరుగెత్తారు. మిగతా క్లాసుల్లో మళ్ళీ గందరగోళం వ్యాపించింది. ఇతర క్లాసుల పిల్లలు వాళ్ళ గదుల్లో నుంచి తొంగితొంగి చూస్తున్నారు. నా సహోపాధ్యాయులు కూడా నావైపే చూస్తూ ఉండిపోయారు.

ఇంతలో ప్రధానోపాధ్యాయుడు వచ్చి నన్ను ఆపాడు-"చూడండి,

ఇంత దగ్గరగా ఆటలు ఆడటానికి వీలులేదు. మీరు ఆడుకోవాలనుకుంటే దూరంగా ఆ మైదానం మీదికి వెళ్ళిపొండి. ఇక్కడ మిగిలిన వాళ్ళకు ఇబ్బందిగా వుంటుంది."

నేను పిల్లలను తీసికొని మైదానం మీదికి వెళ్ళాను.

పిల్లలు కళ్ళెంలేని గుర్రాల్లాగా ఎగురుతూ, దుముకుతూ, అరుస్తూ వున్నారు—"ఆటలు! ఆటలు! అవునురా, ఆటలు"

"ఏ ఆట ఆడదాం?" అడిగాను నేను.

ఒకడన్నాడు—"ఖో, ఖో"

మరొకడన్నాడు—"కాదు, కబాడీ."

మూడో వాడన్నాడు—"కాదు, సింహం-బోను ఆట ఆడదాం."

నాలుగోవాడన్నాడు—"అదయితే మేం ఆడము."

అయిదో వాడన్నాడు—"మేము అదే ఆడతాం."

నేను వాళ్ళ వికారపు చేష్టలూ, వికృతపుటలవాట్లూ చూశాను.

"అబ్బాయిలూ, చూడండీ, మనం ఆడుకొనడానికి వచ్చాం. 'అవునూ,' 'కాదూ', 'ఆడతాము', 'ఆడము' అని అల్లరి చేస్తే మాత్రం మళ్ళ క్లాసులోకి వెళ్ళిపోదాం పదండి!" అన్నాను.

పిల్లలన్నారు—"వద్దండీ, మేము ఆడుకుంటాం."

"అయితే రండి, ఈ రోజు ఖో-ఖో ఆడదాం. ఇద్దరు పిల్లలు నాయకులుగా వుండండి. మిగిలిన వాళ్ళను రెండు జట్లుగా చేసికొని రండి!" అన్నాను. పిల్లలు వెళ్ళారు.

జట్లు యేర్పడడానికి చాలా సేపు పట్టింది. నేను నాయకుణ్ణంటే నేను నాయకుణ్ణని గందరగోళం చేస్తున్నారు. చివరకు నేనే జట్లకు నాయకులుగా ఇద్దరి పేర్లు సూచించాను. పిల్లలను రెండు జట్లుగా విభజించాను. అప్పుడు ఆట ఆరంభమయింది.

కాని అది వీధుల్లో పిల్లలు ఆడుకునే ఆటలాగా తయారయింది.



ఎవరూ మాట్లాడకుండా ఆడటమే లేదు. ప్రతివాడూ అనవసరంగా ఏదో ఒకటి మాట్లాడుతూనే వున్నాడు. "ఒరేయ్, రారా, పట్టుకో చూద్దాం!", 'అదిగో చూశావా, పట్టుకున్నాను!', "నీవేం పట్టుకోగలవురా, నీ ముఖం!", "ఒరేయ్ జాగ్రత్తరా!", "వారేవా, చూడరా, వాడు అటు తప్పించుకు పోతాడు." "ఒరేయ్ కనిపెట్టి వుండరా! చూడు, వాడు తప్పించుకుంటాడని నేను చెప్పలేదూ! నీవు పెద్ద మొనగాడిలాగా కబుర్లు చెబుతున్నావు, అటు నుంచి వాడు తప్పించుకు పోయాడు! చూడు, ఓడి పోయాం గదా!"

"ఇది ఆట స్థలమా లేక కూరగాయల మార్కెట్టా? వీళ్లు ఖో-ఖో ఆడుతున్నారా లేక కొంటె కూతలు కూసుకోవడంలో పోటీపడు తున్నారా?" అని అనుకున్నాను.

ఆట అయిపోయింది. గెలిచిన జట్టులో వాడొకడు అన్నాడు-"చూసు కోండి మా తడాకా! మేమే గెలిచాము; అవును మేమే గెలిచాం! చాలా కష్టపడ్డారు. కాని మమ్మల్ని మీరేం చేయగలరురా? జట్టు నాయకుడు గట్టి వాడయితే మాత్రం ఏం లాభం?"

ఓడిపోయిన జట్టులో ఒకడికి కోపం వచ్చింది. వాడు దబాయించాడు—"అవునురా, ఓడిపోయాం. అయితే ఏంచేస్తావేమిటి?"

మొదటివాడన్నాడు–"మీరు ఓడిపోయారు, మేం గెలిచాం! ఇంకా చేసేదేమిటిరా? మిమ్మల్ని ఓడగొట్టాం! మేమే గెలిచాం, గెలిచాం, గెలిచాం!"

ఓడిపోయిన వాడి ముఖం కోపంతో ఎర్రబడింది. వాడన్నాడు—"ఇక నోరు మూస్తావా లేదా? లేకపోతే, ఇదిగో ఈరాయి చూశావుగా!"

గెలిచిన వాడన్నాడు–"చూశాను, చూశాను! మిమ్మల్ని ఉడికిస్తాం, ఉడికిస్తాం, ఉడికిస్తాం! మళ్ళ మళ్ళ ఉడికిస్తాం! వీడు ఓడిపోయాడు, వీడు ఓడిపోయాడు, వీడు ఓడిపోయాడోహో!"

అవతల వాడికి కోపం వచ్చి ఆ రాయి తీసికొని విసిరేశాడు. ఆ రాయి ఉడికించిన వాడికి తగలకుండా మరో విద్యార్థికి తగిలింది. తల పగిలింది. రక్తం కారుతూవుంది. చాలా చెడ్డపని జరిగిందే అనుకున్నాను. అక్కడికి అక్కడే నా జేబు రుమాలు చించి గాయపడినవాడి తలకు కట్టు కట్టాను. పిల్లలందరినీ దగ్గరకు పిలిచి చెప్పాను—"చూడండి అబ్బాయిలూ, రేపటి నుంచి ఆటలు బంద్!"

అందరూ అన్నారు—"మాస్టరుగారూ, మాస్టరుగారూ! ఆడుకుందామండీ! వీళ్ళిద్దరే గదండీ పోట్లాడుకున్నదీ? మా దోషం ఏముందండీ?"

"నేను రెండు షరతులు పెడుతున్నాను. అవి అంగీకరిస్తేనే ఆటలు ఆడిస్తాను."

"అంగీకరిస్తామండీ! తప్పకుండా అంగీకరిస్తామండీ!" అన్నారు అందరూ.

అప్పుడు చెప్పాను—"మొదటి షరతు-ఆటలాడేటప్పుడు అనవసరంగా యెవరూ మాట్లాడకూడదు. మాట్లాడినవాడు వెంటనే ఆటలో నుంచి ప్రక్కకు తప్పుకోవాలి.''

"అలాగేనండీ!" అన్నారు అందరూ.

"రెండవ షరతు—ఆటలో ఓడు గెలుపులను సమానంగానే భావించాలి. అసలు ఓడు గెలుపులంటూ లేవు. ఒకరోజు ఒకరు బలహీనంగా ఉండవచ్చు. మరొక రోజు మరొకరు బలహీనంగా వుండవచ్చు. ఇందులో ఒకరు గెలిచినట్లు, ఒకరు ఓడినట్లు ఏమున్నది? ఆటలంటే ఆటలే! ఎగరడం, దుముకటం, పరుగెత్తడం, ఆడుకోవడం, ఆనందించడం! ఓడిపోయామని ఉడుక్కోవడం, గెలిచామని గేలిచేయడం, రాళ్ళు విసురుకోవడం, తరువాత తలలు పగలగొట్టుకోవడం లాంటివి ఎందుకు? వాటి అవసరం ఏముంది? అలా చేస్తే ఆటల్లో ఆనందం ఏముంది?"

"ఈ షరతు కూడా ఒప్పుకుంటున్నామండీ" అన్నారు అంధరూ.



"మే మందరం ఆడి-పాడి ఆ తరువాత పాఠశాలలోకి వచ్చేశాం. తల పగిలిన విద్యార్థి కూడా మాతోనే వున్నాడు. ఇతర విద్యార్థులూ, ఉపాధ్యాయులూ ఆ విద్యార్థిని చూడటానికి బయటికి వచ్చారు. ఒక కొంటె విద్యార్థి పరిహాసంగా అన్నాడు—''ఏ యే ఆటలు ఆడారు? ఎటువంటి ఆటలు ఆడారు?"

మరొకడన్నాడు—''అరే వీళ్ళు వసంతం ఆడుకున్నారురా!"

గంటకొట్టారు. ప్రధానోపాధ్యాయుడూ, సహోపాధ్యాయులూ నా దగ్గరకు వచ్చారు. ఒక ఉపాధ్యాయుడు అన్నాడు—''ఇవాళ పెద్ద యుద్ధమే చేయించారే!" మరో ఉపాధ్యాయుడు అన్నాడు—''ఏమిటండీ యీ ఆటలూ-పాటలూ? మానేసెయ్యండి! వీళ్ళు భయభక్తులు లేకుండా పెరిగిన జనం! వట్టి పోకిరిమూక! వీళ్ళను పాఠశాలలో నాలుగుగోడల మధ్య బంధించి వుంచాలి. పాఠాలు చదివించాలి. వల్లె వేయించాలి. అలా చేయండి. మీరు వీళ్ళను స్వేచ్ఛగా వదిలేస్తే ఒకరి తల ఒకరు పగలగొట్టుకుంటారు. రోజూ వీధుల్లో ఏం జరుగుతున్నదీ మీకు మాత్రం తెలియదూ?"

ఆ తరువాత ప్రధానోపాధ్యాయుడు అందుకున్నాడు—"ఈ రోజు తప్పకుండా యేదో ఉపద్రవం జరుగుతుందని అనుకుంటూనే వున్నాను. ఇలా జరగడం కూడా ఒకందుకు మంచిదే అయింది. ఈ మహాశయునికి ఒకసారి ఇటువంటి అనుభవం కూడా అవసరమే. లేకపోతే ఈయన సహజంగా విరమించుకొనే వ్యక్తికాదు. ఎక్కడైనా పాఠశాలలో ఆటలు ఆడిస్తారా?"

నేను చెప్పాను—''అయ్యా, ఆటలే అసలైన చదువు. ప్రపంచంలోని గొప్ప గొప్ప శక్తులన్నీ ఆట స్థలం నుంచే ఉద్భవించాయి. ఆటలంటే అర్థం నడత, మంచి నడత."

''అంచేతనే దెబ్బలాడుకున్నారు, తల పగలగొట్టుకున్నారు!''

అన్నాడు ప్రధానోపాధ్యాయుడు.

సంభాషణ జరుగుతూ వుండగానే తల పగిలిన పిల్లవాడి తండ్రి కోపంతో మండి పడుతూ వచ్చాడు. "మాకు ఇటువంటి చదువూ చట్టు బండలూ అక్కర లేదండీ! చూడండి, వాడి తల పగల గొట్టారు. ప్రధానోపాధ్యాయుడు ఎక్కడున్నాడు? వీణ్ణి యెవరండీ రాయి తీసికొని కొట్టిందీ?'' అన్నాడు.

నేను చెప్పాను – ''చూడండి బాబూ, పిల్లలు ఆడుకొనడానికి వెళ్ళారు. అక్కడ పరస్పరం దెబ్బలాడుకున్నారు. అందులో మీ వాడికి దెబ్బతగిలింది.''

పిల్లవాడి తండ్రి అన్నాడు—"వీళ్ళను ఆడుకొనడానికి ఎవరు పంపించారు? పాఠశాలలో పాఠాలు చెపుతారా లేక ఆటలు ఆడిస్తారా? రోజంతా వీధుల్లో ఆడుతూనే వుంటారుగదా! మీరు పిల్లలకు చదువు చెపుతామంటేనే పంపిస్తాను. లేదంటే మాన్పిస్తాను.''

నేను మౌనంగా వింటూ వున్నాను.

ప్రధానోపాధ్యాయుడు అన్నాడు – "చూడండి, బాబూ! నేను చెప్పేది వినండి! వీరు మా బడికి కొత్తగా వచ్చారు. చదువులో కొత్త కొత్త ప్రయోగాలు చేస్తున్నారు. ఈ రోజు ఆటలలో ఒక కొత్త ప్రయోగం చేశారు. దాని ఫలితమే మీవాడి తల పగిలింది."

పిల్లవాడి తండ్రి అన్నాడు–''నాకు మీ ప్రయోగాలు అవసరంలేదు. పిల్లవాడికి బాగా చదువు చెప్పాలను కుంటారా, చెప్పండి, లేదంటారా మాన్పిస్తాను.''

ఆ సమయంలో ఇతర ఉపాధ్యాయులు ముసిముసి నవ్వులు నవ్వుకుంటున్నారు. అటువంటి స్థితిలో ఇక నేను ఏం మాట్లాడేది?

ఇంటికి వెళ్ళాను. భోజనం రుచించలేదు. గదిలోకి వెళ్ళి పడుకున్నాను. ఆలోచిస్తూ వున్నాను–ఇదో ప్రమాదం వచ్చిపడింది! ప్రమాదం వస్తే వచ్చింది కాని వాళ్ళకు ఆటల నియమ నిబంధనలు తెలియజేశాను. ఆటలంటే అర్థం చెప్పాను. ఇంకా చెపుతాను. మిగిలిన ఆటలు కూడా ఆడించవలసిందే. నా అభిప్రాయం ఆటలే నిజమైన చదువు అని.



అలా పడుకొని వుండగానే మరో ఆలోచన తట్టింది. తల్లిదండ్రుల సమావేశం ఒకటి ఎందుకు జరుపకూడదూ? ఆటల ప్రాధాన్యతను గురించి వారికి ఎందుకు వివరించ గూడదూ? పరిశుభ్రత విషయంలోనూ, కట్టుబాట్ల విషయంలోనూ వాళ్ళ సహకారాన్ని అర్థిస్తాను. వాళ్ళు సహకరించకపోతే నేను మాత్రం ఏం చేయగలను? తమ పిల్లల అభివృద్ధి కోసం వాళ్లు యీ మాత్రం కూడా చేయలేరా? ఉపాధ్యాయులమైన మనం తల్లిదండ్రుల సహకారాన్ని ఎందుకు కోరగూడదు? ఆ దోషం మనదే. అయితే రేపే తల్లిదండ్రుల సమావేశం ఎందుకు ఏర్పాటు చేయగూడదూ?

## 8

సమావేశం జరిగింది. కాని దీన్ని సమావేశం అనవచ్చో లేదో! నలభైమంది తల్లిదండ్రుల పేర ఉత్తరాలు పంపించబడ్డాయి. అయితే మొత్తం ఏడుగురు మాత్రమే వచ్చారు. నేను చాలా నిరుత్సాహ పడ్డాను. నేను ఓ మంచి ఉపన్యాసం కూడా తయారు చేసుకొని వున్నాను. కాని ఏం చేయను? అయినా ఉపన్యాసం ప్రారంభించాను. ప్రయత్నించడమే మన కర్తవ్యం అనుకున్నాను. ఉపన్యాసం కూడా ఒక ప్రయోగమైపోయింది.

ఓ గంటసేపు చాలా గంభీరంగా, శక్తివంతంగా ఉపన్యసించాను. వచ్చిన ఏడుగురిలో ఒకరికి ఇంటినుంచి పిలుపు వచ్చింది. ఆయన లేచి వెళ్ళిపోయాడు. మిగిలినవాళ్లు వెళ్ళలేక, ఉండలేక సందిగ్ధ స్థితిలో నా మాటలు వింటూ కూర్చున్నారు. నేను చెప్పిన విషయాలు చాలా ముఖ్యమైనవి. చాలా విలువైనవి. అవి వారికి తెలియజెప్పడం చాలా అవసరం.

నేను వారికి వాస్తవమైన చదువుకూ బూటకపు చదువుకూ గల

తాత్త్విక భేదాన్ని బాగా వివరించి చెప్పాను. ఆటలకూ, శీల నిర్మాణానికీ గల అవినాభావ సంబంధాన్ని వివరించాను. భయంతోనూ, ఒత్తిడితోనూ కాకుండా, హృదయంలో నుంచి స్వయంగా ఉత్పన్న మయ్యేటువంటి యథార్థమైన క్రమశిక్షణ యొక్క మహిమనూ, శక్తినీ తెలియపరచాను. ప్రస్తుతం అమలులోవున్న బోధనా పద్ధతులనూ, క్రమశిక్షణా పద్ధతులనూ ఖండించాను.

కాని నా ఉపన్యాసం బోర్లించిన కుండమీద నీళ్లు పోసిన సామెతగా వుంది. పాపం హరికథ దగ్గర చాపకోసం అన్నట్లు కూర్చున్న ఆ ఇద్దరు కూడా ఇంటికి వెళ్ళడానికి తొందరపడుతున్నారు. ఉపన్యాసం ముగిసీ ముగియకముందే వాళ్లుకూడా వెళ్ళిపోయారు.

ఆఖరికి మా ఉపాధ్యాయులం, మా అధికారి మాత్రమే మిగిలి పోయాం. మా అధికారి నవ్వుతూ అన్నాడు—"లక్ష్మీశంకర్‌గారూ, ఇది గుడ్డివాడికి అద్దం చూపినట్లే వుంది. మీ ఫిలాసఫీని ఇక్కడ అర్థం చేసుకో గల వారెవరు?"

వెనకనుంచి ఉపాధ్యాయుల్లో ఒకరు వినపడీ వినపడనట్లుగా "మూర్ఖుడు, వట్టి మూర్ఖుడు!" అని అంటున్నారు.

అలా అనడం నాకు నచ్చలేదు. అయినా ఓర్పు వహించాను. "నేనింకా కొంచెం చదువుకున్న మూర్ఖుణ్ణే తప్పకుండా!" అని మనసులో అను కున్నాను. సామాన్య ప్రజలముందు ఎలా మాట్లాడాలోకూడా నాకింకా బాగా తెలియదు.

ఉపాధ్యాయులందరూ నవ్వుకుంటూ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

## 9

పది-పదిహేను రోజులు గడిచాయి. నేను గ్రంథాలయం పని ప్రారంభించాను. అనేక కథలు వినిపించాను. పిల్లలు నాలుగో తరగతి



వాళ్ళుకదా! ఇప్పుడు వాళ్ళకు చదవడానికి పుస్తకాలు అవసరమయ్యాయి.

నేను పిల్లలతో చెప్పాను-"రేపు అందరూ నాలుగో తరగతి వాచ కానికీ, చరిత్ర పుస్తకానికీ డబ్బులు తెచ్చుకోండి. ఇక్కడ నుంచే అన్ని ఏర్పాట్లు చేసుకుందాం."

మరుసటి రోజు ఒకడు నాలుగవ తరగతి వాచకమూ, చరిత్ర పుస్తకమూ తెచ్చుకున్నాడు. "ఈ తరగతిలోకి వచ్చిన మొదట్లోనే మా నాన్న యీ పుస్తకాలు కొన్నాడు" అని చెపుతున్నాడు.

రెండోవాడు "ఈ పుస్తకాలు మా అన్నయ్య దగ్గర వున్నాయి. నేను అవి తెచ్చుకున్నాను." అన్నాడు.

మూడోవాడు "మాస్టరుగారూ, నాకు బొంబాయి నుంచి మా మేనత్త మొగుడు యీ పుస్తకాలు పంపిస్తా నన్నాడు. ఇక్కడ కొనుక్కో వలసిన అవసరం లేదు" అన్నాడు.

"చంపేశారు పోండి! ఊహలో గ్రంథాలయం స్థాపించడం సులభమే. కాని నిజానికి ఆ పని చాలా కష్టమైనది!" అనుకున్నాను.

కొంతమంది డబ్బులు కూడా తెచ్చారు. నేను ఆ డబ్బులు తీసు కొని రసీదు యిచ్చి వాళ్ళతో అన్నాను—''చాలా మంచి పని చేశారు.''

రెండోరోజు ''పిల్లలు మా వాచకం ఏదీ? మా చరిత్ర పుస్తకం ఏదీ?'' అంటున్నారు.

నేనన్నాను—''ఇవిగో, మీ డబ్బులతో నేను కొత్త కొత్త కథల పుస్తకాలు తెచ్చాను. కథలు పుస్తకాలు చదువుతుంటే చాలా మజాగా వుంటుందని అంటున్నారుగదా?''

పిల్లలు చాలా సంతోషించారు. మంచి మంచి అట్టలూ, రంగు రంగుల బొమ్మలూ చూసి వాళ్ళంతా వాటిమీద విరుచుకుపడ్డారు.

నేనన్నాను—''ఇప్పుడు మనదగ్గర పదిహేను పుస్తకాలు మాత్రమే వున్నాయి. వీటిని పదిహేను మంది చదవగలరు. మిగిలిన ఇరవైమందీ

నా దగ్గరకు రండి. నేను చదివేది వినండి.'' గందరగోళం లేకుండా చేయడానికి నేను చెప్పాను—''మొదట పదిహేను మంది విద్యార్థులు పుస్తకాలు చదవండి. మిగిలిన వాళ్ళు నా దగ్గర కూర్చోండి!''

పదిహేను మంది పదిహేను పుస్తకాలు తీసికొని వాటిమీద ఆకలిగొన్న సింహాల్లాగా విరుచుకు పడ్డారు. నేను చెప్పాను—''చూడండీ, ఒక పుస్తకం చదవగానే దాన్ని టేబులు మీద పెట్టండి. అక్కడ పడివున్న మరో పుస్తకం తీసుకెళ్ళి చదవండి! ఈ విధంగా ప్రతి ఒక్కడికీ అన్ని పుస్తకాలూ చదవడానికి లభిస్తాయి.''

మిగిలిన వాళ్ళను నా దగ్గర కూర్చొబెట్టుకున్నాను. ఆదర్శపఠనం ప్రారంభించాను. నేను అందంగా, ఆకర్షణీయంగా, హావ భావాలతో పద్ధతి ప్రకారం చదివాను, చదివిస్తున్నాను. భోధిస్తున్నాను. కాని అవతల పదిహేను మంది బిగ్గరగా, గోలగా చదువుతున్నారు. నేను ఆగి వాళ్ళతో అన్నాను. "అబ్బాయిలూ, మనసులో చదువుకోండి! పైకి చదివితే మాకు అంతరాయం కలుగుతోంది." కొంచెం సేపు గొంతు తగ్గించి చదివారు. కాని వాళ్ళకు మౌన పఠనం అలవాటులేదు. మళ్ళీ బిగ్గరగా చదవటం ప్రారంభించారు. నేను వాళ్లను వరండాలోకి తీసికొని వెళ్ళి, విడివిడిగా కూర్చొబెట్టి చదువుకోమని చెప్పాను. నేను క్లాసులోపలే వున్నాను.

ఆదర్శపఠనం బాగా సాగింది. కథ కూడా బాగా నచ్చేదిగావుంది అంచేత అందరూ ఆసక్తితో విన్నారు. గంట కొట్టేవరకూ పుస్తకపఠనం, ఆదర్శపఠనం జరుగుతూనే వున్నాయి. ఆ తరువాత అందరం ఇళ్ళకు వెళ్ళిపోయాం.

## 10

కథలు, ఆటలు, గ్రంథాలయం, ఆదర్శపఠనం, పరిశుభ్రతా, క్రమ శిక్షణ మొదలైన విషయాలు చూస్తూ వుండగానే గబగబా రెండు



మూడు మాసాలు గడిచిపోయాయి.

నేను చేసిన పనిని అంచనా వేసుకొనడానికి కూర్చున్నాను. పూర్తి చేసిన పనిని ఒకసారి పరిశీలించాను. చేయవలసిన పని చాలా వుంది. ఆవగింజలో అరభాగం కూడా కాలేదు. పాఠ్యక్రమంలోని మాతృభాష, గణితం, చరిత్ర, విజ్ఞానశాస్త్రం మొదలైన విషయాలలో ఇంకా ఏమీ పని జరగలేదు. మిగతా క్లాసుల్లో చాలా వరకు పూర్తి చేశారు. సంవత్సరం చివరకు నేను కూడా ఇవన్నీ పూర్తిచేసి చూపించాలి. నా ప్రయోగానికి పెట్టిన షరతు కూడా అదే. సరే ఇదంతా బాగానే వుంది. నేను ఇప్పటికి ఏమేమి చేశానో చూద్దాం. కథలు వినిపించడంలో సఫలత లభించింది. దాని ఫలితంగా పిల్లలు సరయిన కట్టుబాటులో వుంటున్నారు. ఆసక్తి చూపుతున్నారు. పోతే చంపక్‌లాల్‌కూ, రమణ్‌లాల్‌కూ కథలు ఇష్టంగా లేవు. రామజీవన్‌కూ, శంకర్‌లాల్‌కూ కథలు చాలా సరళంగా కన్పిస్తున్నాయి. కథలు చెపుతున్నప్పుడు రాఘవ్, మాధవ్ కళ్లు మలుపుతూ, వ్రేళ్లు చూపిస్తూ, ఇతరులను వెక్కిరిస్తూ వెకిలి చేష్టలు చేస్తున్నారు. వీటికి ఇంకా చికిత్స చేయవలసి వుంది. అయితే ఒకటి మాత్రం నిజం. ఆటలు ఆడించిన కారణంగా పిల్లలు ఇప్పుడు నాతో చనువుగానూ, దాపరికం లేకుండానూ మాట్లాడుతున్నారు. నన్ను తమ వాణ్ణిగా భావిస్తున్నారు. నన్ను చూచి భయపడటం లేదు. ఆటలయిపోయిన తరువాత అందరూ నా ఆదర్శ పఠనాన్ని చాలా శ్రద్ధగా వింటున్నారు. అయితే ఆటల సమయంలో మాత్రం ఇంకా పూర్తిగా క్రమ శిక్షణలో మెలగడం లేదు. అల్లరి కూడా నామ మాత్రంగానే తగ్గింది. శ్రమ మాత్రం చాలా చేస్తున్నాను. కాని పిల్లలు ఇంకా ఒక దారికి రాలేదు.

పఠన మందిరంలో చాలా కొద్ది పుస్తకాలే వున్నాయి. పాఠ్య పుస్తకాలకన్న గ్రంథాలయం ఏర్పాటు చేసుకోవడం ఎక్కువ ప్రయోజన కరమైనదని చెప్పిన మాట ఇంకా పిల్లల తల్లిదండ్రులకు మింగుడు

పడలేదు. ఒక ఉపన్యాసం యిచ్చి తల్లిదండ్రులకు వివరంగా చెప్తే అంతా చక్కబడుతుందని అనుకున్నాను. కాని యీ తల్లి దండ్రులకు కేవలం ''చదువు చెప్పండి, చదువు చెప్పండి'' అనే అలవాటు తప్ప మరో విషయాన్ని గురించి వినడానికి వాళ్ళకు తీరికాలేదు. ఆ విషయం వాళ్ళకు అర్థమూ కాదు. అయినా నేను చింతించడంలేదు. బాగా పూనికతో పని చేస్తే ఇదంతా సాధ్యమవుతుందనే అనుకుంటున్నాను. ఇవాళ కాకపోతే రేపు అవుతుంది. ఇంకా నాకు కావలసినంత సమయం కూడా వుందిగదా!

నేను తరువాత ఆలోచించాను. ఈ ప్రయోగం పెరిగి పెరిగి మహాభారత మయింది! మనకు కల్పనాశక్తి, జ్ఞానమూ, ఆదర్శమూ ఎంత ఎక్కువగా వుంటాయో, అంత ఎక్కువ తహ తహ కూడా వుంటుంది. అనేక సమస్యలు నన్ను ఇబ్బంది పెడుతూ వున్నాయి. పరిశుభ్రత విషయంలో ఇంకా ఏమీ పనిజరగనట్లే అనిపిస్తున్నది. పిల్లల టోపీలు అలాగే మురికి కారుతూ వున్నాయి. ఒకటి రెండు రోజులు మాత్రం మంచి శుభ్రమైన దుస్తులు ధరించి వచ్చారు. కాని తరువాత మళ్ళీ పాత పద్ధతే. గోళ్లు కూడా మరీ పారల్లాగా పెరిగిపోయాయి. ఇవన్నీ చాలా ధైర్యంతో, పట్టుదలతో సాధించాలి. వెంటబడి తరుముతుంటేగాని యీ అలవాట్లు మార్చుకోలేరు. సమాజంలో కొత్త అలవాటును ప్రవేశపెట్టాలి. అందు కోసం ఎన్ని సార్లయినా ప్రయత్నించాలి. అప్పుడే ఆ పని నెరవేరుతుంది.

ఇటు పిల్లలను గురించిన చింతతో పాటు అటు ఉన్నతాధికారి కూడా కొంచెం తొందర పెట్టుతున్నాడు. ఆయనకూ పై అధికారులు వున్నారు. పైగా ఆయనను విమర్శించే విరోధులు కూడా వున్నారు. ఆయన కీర్తి పొందాలనీ కోరుకుంటున్నాడు. ఫలితం కూడా త్వరగా సాధించాలని పట్టుబట్టుతున్నాడు. అయితే నాకు సహాయ పడటానికి ఆయనకు వున్న శక్తి కూడా పరిమితమైనదే!

నా సహోపాధ్యాయులకు నా మీద కొంచెం కూడా విశ్వాసం లేదు.



వాళ్ళు నన్ను వట్టి మూర్ఖునిగానే భావిస్తున్నారు. బహుశా నేను మూర్ఖుణ్ణి కూడా నేమో! ఓ రకంగా అనుభవం లేనివాణ్ణే గదా! కాని వాళ్ళ ప్రమాణాలకూ, వాళ్ళ ఆదర్శాలకూ, వాళ్ళ బోధనా పద్ధతులకూ ఓ నమస్కారం! వాటిని చూస్తుంటేనే నాకు వణుకు పుట్టుకొస్తుంది. అంత కన్న నేను చేస్తున్నది అనేక రెట్లు ఉత్తమమైనదనే చెప్పాలి. నా విద్యార్థులు నన్ను చూచి పారిపోరు. వాళ్ళు నన్ను ఎంతో ప్రేమిస్తున్నారు. వాళ్ళు నన్ను గౌరవిస్తున్నారు కూడా. నా ఆదేశాలను శిరసావహిస్తున్నారు. నా సహోపాధ్యాయులను చూడగానే వారి విద్యార్థులు పరుగుతీస్తారు. అయితే చాటుకు వెళ్ళి వాళ్ళను ఎగతాళి చేస్తుంటారు. వెక్కిరిస్తుంటారు. అలా చేయడం నా కళ్ళారా చూశాను. వాళ్ళ ఎదుట ప్రేమతో నిలబడ గలిగిన వాడుగానీ, నవ్వుతూ మాట్లాడ గలిగిన వాడుగానీ ఒక్కడు లేడు. వాళ్ళు క్లాసులో నోరు మూసికొని కదలకుండా కూర్చుంటారు. కాని బయటకు రాగానే వాళ్లు చేసే గందర గోళం ఇంతా అంతా కాదు. నా విద్యార్థులకు నేను తగినంత స్వేచ్ఛనిచ్చాను. వాళ్లు క్లాసులో కొద్దీగొప్పా గోల చేస్తూనే వుంటారు. అయితే బయట కూడా అంతకన్న మించి గోల చేయరు. అయినా నేను పిల్లలను చెడగొడుతున్నాననీ, వాళ్ళను ఉద్దండులుగా తయారు చేస్తున్నాననీ కేవలం కథలు మాత్రమే చెపుతున్నాననీ చదువు బొత్తిగా చెప్పననీ, ఆట లాడించి వాళ్ళను పోకిరి పిల్లలుగా తయారు చేస్తున్నాననీ- నా సహోపాధ్యాయులు నా మీద ఆరోపిస్తూ వుంటారు. ఆరోపించనివ్వండి! అదేదో చూస్తాను. నా అభిప్రాయంలో ఆటలూ, పాటలూ, కథలూ, గాథలే సగం విద్యను బోధిస్తాయి.

అయినప్పటికీ నేను చేయబోయే పని చాలా కఠినమైనదనే విషయం నేనెన్నడూ మరచిపోగూడదు. అలా భావించే నా పని చేసుకుంటూ పోవాలి.

గడియారం పన్నెండు కొట్టింది. నా ఆలోచనకు అంతరాయం

కలిగింది. రేపటి సంగతి రేపు చూసుకోవచ్చు ననుకుంటూ నిద్ర పోయాను.

రెండవ భాగం

# ప్రయోగం పురోగతి

మూడవనెల ప్రారంభమయింది. రోజూ జరిపే నా కార్యక్రమం గురించి డైరీలో వ్రాసుకుంటే బాగుంటుందనుకున్నాను. అలాగే చేశాను. దానితో వారానికి ఎంతపని జరిగేది కూడా తెలిసిపోతున్నది. దానికి తోడుగా ఒక్కొక్క నెలకు సంబంధించిన కార్యక్రమమంతా వ్రాసి పెట్టుకున్నాను. డైరీ ఉపయోగం బాగా అర్థమైపోయింది. నా యీ డైరీ 'లాగ్-బుక్'- లాంటిదికాదు. కేవలం దిక్కులు సూచించే ఒక పట్టీలాంటిది.

కథ రోజూ వినిపిస్తూనే వున్నాను. ఆటలు ఆడిస్తూనే వున్నాను. మధ్యమధ్య సంభాషణ, ఆదర్శ పఠనం, విద్యార్థుల శారీరక పరీక్ష కూడా జరుపుతూ వున్నాను. పఠన మందిరం కూడా నత్త నడకతోనైనా ముందుకు సాగిపోతూనేవుంది.

## 2

నేను పాఠ్యక్రమం నుంచి ఒక్కొక్కటే తీసుకోవడం ప్రారంభించాను. ఒకరోజు ఉదయం డిక్టేషన్ వ్రాయమన్నాను. విద్యార్థులు నావైపు వింతగా చూశారు. నేను డిక్టేషన్ వ్రాయిస్తాననీ, పాఠం చెబుతాననీ, పాఠం అడుగు తాననీ, దేశపటం చూపించి ప్రశ్నలు అడుగుతా

నని ఇంకా ఇటువంటి పనులు చేయించే ఉపాధ్యాయుడననీ వాళ్లు ఎన్నడూ అనుకోలేదు. వాస్తవంగా ఇప్పటివరకూ అటువంటి ఉపాధ్యాయునిగా కన్పించలేదు. వాళ్లూ అటువంటి వాణ్ణని అనుకోలేదు కూడా.

"వ్రాయండి" అన్నాను నేను.

కానీ వాళ్ళదగ్గర పలకలు లేవు, బలపాలు లేవు. ఇతర పుస్తకాలేవీ లేవు. ఇంతవరకు వాటి అవసరంకూడా కలగలేదు. అంచేత వాళ్లు వట్టి చేతులతోనే క్లాసుకు వస్తూ వుండేవాళ్ళు. నేను ప్రక్క క్లాసులోనుంచి పలకలూ, బలపాలూ తెప్పించాను. డిక్టేషన్ వ్రాయించడానికి కూర్చోబెట్టాను.

అనేక మంది విద్యార్థులు అసంతోషంగా వున్నట్లు కన్పించారు. ఒకడు అన్నాడు- "మాస్టరుగారూ, కథ చెప్పండి!" మరొకడన్నాడు- "పుస్తకంలో పాఠాలేవీ జరగలేదుగదా, డిక్టేషన్ ఎందులోనుంచి వ్రాయిస్తారు?" మరో ఇద్దరు అన్నారు- "ముందు మమ్మల్ని కొంచెంసేపు చదువుకో నివ్వండి. తప్పులు లేకుండా వుంటాయి."

నేను మనసులో అనుకున్నాను-"వీళ్ళందరూ పూర్తిగా పాత పద్ధతులకు అలవాటు పడిపోయారు. డిక్టేషన్ అనగానే వాళ్లు దాని పాత ఉద్దేశ్యాన్నే గ్రహించారు. అంచేత ఆ పేరెత్తగానే హడలిపోయారు. డిక్టేషన్ వ్రాయడం వాళ్ళకు ఇష్టంలేదు. వ్రాయడం కోసం ముందుగా కొంత తయారయి వుండాలని వాళ్ళు భావిస్తున్నారు.

నేను గ్రంథాలయం పుస్తకాలలో ఒకటి తీసి వాళ్ళచేత వ్రాయించడం ప్రారంభించాను. ఒక వాక్యం పూర్తిగా చెప్పాను. అయితే వాళ్ళు పూర్తి వాక్యం వినిపించుకోలేదు. నాలుగయిదు శబ్దాలు వినీ వినడంతోనే ఒకటీ రెండూ వ్రాసి "ఏం చెప్పారు మాస్టరుగారూ, ఏం చెప్పారండీ? మళ్ళి చెప్పండి." అంటూ అందరూ అడగటం ప్రారంభించారు.

నేనన్నాను-"డిక్టేషన్ ఎలా వ్రాయాలో నేను మీకుచెబుతాను.



వినండి! నేను వాక్యం పూర్తిగా చెప్పే వరకూ నావైపే చూస్తూ ఉండండి! చెప్పింది శ్రద్ధగా వినండి. అర్థం చేసుకోండి. అప్పుడు వ్రాయండి. మళ్ళి వినడానికి నా వైపు చూస్తూ వుండండి!" నేను యీవిధంగా వ్రాయించడం ప్రారంభించాను. కాని వాళ్ళ పాత అలవాటు ఒక్కసారిగా వదులుతుందా? అయితే రానురాను అందరికీ యీ కొత్త పద్ధతి అలవాటయింది. తరువాత ఎవ్వరూ మాటమాటకూ, మాటి మాటికీ అడగవలసిన అవసరం లేకుండా పోయింది. నేను కూడా ఒకసారి మాత్రమే చెప్పే వాణ్ణి. మళ్ళి రెండోసారి చెప్పేవాణ్ణే కాదు.

డిక్టేషన్ వ్రాశారు. పలకలు క్రిందపెట్టారు. నేను చూశాను. అక్షరదోషాలు అనేకం వున్నాయి. సంయుక్తాక్షరాలు కూడా సరీగా వ్రాయలేదు. అక్షరాలు అందంగానూ, ఒక వరుసలోనూ లేవు.

నేను ఎవరి తప్పులూ ఎంచలేదు. వరుసగా అన్ని పలకలూ చూశాను. తిరిగి ఇచ్చి వేశాను. అందరూ అంటున్నారు-"మాకెన్ని తప్పులండీ? నాకెన్ని తప్పులండీ? మమ్మల్ని పైకి వేయండి, వాళ్ళను క్రిందికి దించండి."

ఇంతలో ఒక పిల్లవాడు అన్నాడు-"ఇక లక్ష్మిశంకర్‌గారు కూడా మనకు పాఠాలు చెపుతారు, పాఠాలు అప్పగించుకుంటారు. మార్కులు వేస్తారు. ఇటువంటివన్నీ ఉంటాయి."

నేనన్నాను-"నేను అటువంటివేమీ చేయను. సరే బాగానేవుంది. మొత్తం మీద మీరు వ్రాయడమంటూ నేర్చుకున్నారు. రేపు మళ్లీ వ్రాయండి. అలా వ్రాస్తూవ్రాస్తూ పోతే మీరు చాలా బాగా వ్రాయగలుగుతారు. రోజూ వ్రాస్తూవుంటే వ్రాయడం ఎందుకురాదు? తప్పులు లెక్కబెట్టి మాత్రం చేసేదేముంది?"

ఒకడన్నాడు-"కాని మార్కులు ఇవ్వడం, పైకివేయడం, క్రిందికి దించడం ఇవన్నీనో?''

నేనన్నాను-"నేను చెప్పిన కథలు వినేటప్పుడు పైకీ క్రిందికీ వస్తున్నారా?"

"లేదండీ!"

"మంచి బట్టలు వేసుకున్నవాళ్ళూ, మురికి బట్ట లేసుకున్నవాళ్ళూ పైకీ క్రిందికీ వస్తున్నారా?"

"లేదండీ"

"మరి ఆటలు ఆడుతున్నారుగా? వాటికి మార్కులు ఇస్తున్నారా?"

"లేదు"

"మీలో ఒకరు ఎత్తుగానూ, ఒకరు పొట్టిగానూ వున్నారు. దానిని బట్టి మిమ్మల్ని ఎవరైనా పైకి లాగుతున్నారా, క్రిందికి దించుతున్నారా?"

"లేదు"

"మీలో ఒకరు లావుగానూ, ఒకరు సన్నగానూ వున్నారు. దీనిని బట్టి ఎగుడు దిగుడులేమన్నా వస్తున్నాయా?"

"లేదండీ!"

"మీలో కొందరు భాగ్యవంతులున్నారు. కొందరు బీదవాళ్ళు వున్నారు. దానిని బట్టి పాఠశాలలో మీకు మార్కులు లభిస్తున్నాయా? దానిని బట్టి పైకి వేయడం, క్రిందికి దించడం లాంటివి జరుగుతున్నాయా?"

"లేదండీ!"

"అయితే ఇప్పుడు అర్థమయింది కదూ! మన క్లాసులో పైకి పోవడం, క్రిందికి దిగడం అనే సమస్యేలేదు. పద్యం వచ్చిన వాడు పాడతాడు. రానివాడు చదువుకుంటాడు. చదువుకోవాలి. ఆటలు చూస్తూ చూస్తూ నేర్చుకోవాలి. ఆట నేర్చిన వాడు ఆడాలి, ఆనందించాలి. డిక్టేషన్ విషయంలో అక్షరాలు అందంగా వ్రాసే వాణ్ణి చూస్తూ మిగిలిన వాళ్లు



కూడా తమ అక్షరాలను అందంగా దిద్దుకోవాలి. నేను ఎవరినైనా ఏదైనా ప్రశ్న అడిగితే ఆతడికి జవాబు తెలియక పోతే, తెలిసినవాడు అతడికి చెప్పాలి. లేకపోతే నేను ఎటూ చెపుతాను. అంతే"

అందరూ విప్పారిన కళ్ళతో నావైపు చూస్తూ వున్నారు. ఇదంతా వాళ్ళకు కొంచెం వింతగానే వుంది.

ఆఖరుకు నేను చెప్పాను-"మన క్లాసు విచిత్రమైన క్లాసు. ఇందులో అంతా కొత్తదనం. ఇందులో పని అంతా కొత్త పద్ధతిలోనే జరుగుతుంది. ఇది మన క్లాసు గదా!"

మన క్లాసు అనే మాటను రెండు మూడు సార్లు ఒత్తి ఒత్తి పలికాను. పిల్లల మీద దాని ప్రభావం పడింది. వాళ్ళు కూడా అంటున్నారు- "ఇది మన క్లాసు! మన క్లాసు విచిత్రమైన క్లాసు! ఇందులో అంతా కొత్తదనం!"

డిక్టేషన్ వ్రాయించే విషయంలో ఒక వారం లోపల నేను ముఖ్యమైన మార్పులన్నీ చేశాను.

ప్రతిరోజూ ఇంటి దగ్గర ఏదో ఒక పుస్తకంలో నుంచి నాలుగు పంక్తులు సరీగా చూచి వ్రాసుకు రమ్మని నేను విద్యార్థులతో చెప్పాను స్వయంగా నేను కూడా వాళ్ళచేత ప్రతిరోజూ పదినిమిషాలు వాక్యాలు వ్రాయించడం ప్రారంభించాను. ఒకరి కొకరు డిక్టేషన్ చెప్పి వ్రాయించడం, ఒకరి తప్పులు ఒకరు దిద్దుకోవడం మొదలైన వాటికి వాళ్ళకు రోజూ పదిహేను నిమిషాల సమయాన్ని ప్రత్యేకించాను.

సంయుక్తాక్షరాలు సరిగా వ్రాయించడం నేర్పడం కోసం నాలుగవ తరగతి వాచకంలో వున్న సంయుక్తాక్షరాల నన్నిటినీ ఏరి ఒక చిన్న పుస్తకంలోకి ఎక్కించాను. అది వాళ్ళకిచ్చాను. ఆ పుస్తకం అందరూ ఒకరి తరువాత ఒకరు చదువుకొనడానికీ, వాటిని పలకల మీద వ్రాసుకొనడానికీ ఉపయోగపడుతూ వుంది.

నాలుగవ తరగతి వాచకంలో వుండే కఠినమైన శబ్దాలతో ఒక పట్టీ తయారు చేయడం ప్రారంభించాను. దాని ఉపయోగాన్ని గురించి కూడా ఆలోచించాను.

ఇప్పుడు మా పని చక్కగా సాగిపోతూ వుంది.

## 3

ఒకరోజు ప్రక్క క్లాసులో నుంచి హఠాత్తుగా "అమ్మో, బాబోయ్! చచ్చాను బాబోయ్! చంపేశాడు బాబోయ్!'' అంటూ కేకలు వినిపించాయి.

మా చెవులు అటే వున్నాయి. నేను కథ చెపుతూ వున్నాను. పిల్లల మనస్సు కూడా అటేవుంది. నేను కథ ఆపివేశాను. ఒక విద్యార్థిని వెళ్ళి ఎవరు ఏడుస్తున్నదీ, ఎందుకు ఏడుస్తున్నదీ, అసలు విషయ మేమిటో తెలిసికొని రమ్మన్నాను.

ఒక తెలివైన పిల్లవాడు వెళ్ళి చూసి వచ్చి చెప్పాడు—"అయ్యా, ఆ క్లాసులోని జీవన్‌లాల్‌ను మాస్టరుగారు చితగ్గొట్టారు.''

"ఎందుకు?'' అన్నాను నేను.

"అతడు భూగోళశాస్త్రంలోని పాఠం అప్పగించలేదట!''

నేను మళ్ళి అడిగాను—"అయితే కొట్టవలసిన అవసరం ఏం వచ్చింది?''

నా విద్యార్థి ఒకడు అన్నాడు—"ఎవడైనా పాఠం కంఠస్థం చేసికొని రాకపోతే మరేం జరుగుతుంది?''

నేనన్నాను—"కాని ఎవడికైనా ఎన్నిసార్లు చదివినా జ్ఞాపకం ఉండక పోతేనో?"

మరొకడన్నాడు—"జ్ఞాపకం ఉంచుకోవలసిందే, పాఠం వల్లించ వలసిందే! లేకపోతే మాస్టరు ఏం చేస్తారు? శిక్ష విధిస్తారు గదా!"

నేనన్నాను– "ఒక్కొక్కడికి ఎంత రుబ్బినా పాఠం జ్ఞాపకం



వుండదు. మరి అప్పుడు ఏంచేయాలి?"

మూడోవాడన్నాడు–"అయినా మాస్టర్లు తప్పకుండా కొడతారు. మరేం చేయగలరు? పాఠం జ్ఞాపకం ఉంచుకొనకపోతే కొడతారు, బాదు తారు, దండిస్తారు."

నేనన్నాను, "మంచిదే, ఆ విధంగా మీలో ఎవరెవరు దెబ్బలు తినడానికి సిద్ధంగా వున్నారో చెప్పండి!"

అందరూ అన్నారు, "లేదండీ, దెబ్బలు తినడానికి ఎవరు సిద్ధంగా ఉంటారు?"

నేను అడిగాను-"నేను మీకు పాఠాలు యిస్తాననుకోండి! దాన్ని మీరు కంఠస్థం చేసుకురాలేక పోతే నేను మిమ్మల్ని కొట్టాలా వద్దా?"

"మేము పాఠం కంఠస్థం చేసికొనే వస్తాము"!

"మీరు దాన్ని బాగా రుబ్బుతారు. అప్పటికీ మీకు జ్ఞాపకం ఉండ దనుకోండి, అప్పుడో?"

"అప్పుడేముంది? అప్పుడు కూడా దండించకుండా ఉండటమే మంచిది. కొడితే ఒంటికి దెబ్బ తగులుతుందిగదా! మాకు జ్ఞాపకం ఉండక పోతే మళ్ళి చదివించండి. మేము మళ్ళి రుబ్బుతాం."

నేనన్నాను-"సరే మంచిది. ఇక మనం కథను ప్రారంభించు దామా?"

కాని పిల్లల మనసు యీరోజు ఆ జీవన్‌లాల్ మీదే లగ్నమై వుంది. వాళ్ళంటున్నారు- "చూసుకోండి, తరువాత జీవన్ ఉపాధ్యాయుణ్ణి బూతులు కుస్తాడో లేదో! గోడల మీద ఆయన బొమ్మలు గీస్తాడు. ఉపాధ్యాయుని పేరు మీద బండ బూతులు వ్రాస్తాడు. ఇటువంటి పనుల్లో వాడు ఆరితేరిన వాడు."

నేను అన్నాను-"జీవన్ అలా చేయగూడదు. ఉపాధ్యాయుని విషయంలో అలా చేయడం మంచిది గాదు. అది తగిన పనికాదు."

అందరూ అన్నారు-"కాని ఉపాధ్యాయులు కూడా వాణ్ణి చాలా ఎక్కువగానే కొడుతూ వుంటారు."

నేనన్నాను—"అయితే మరి దీనికేమైనా ఉపాయం ఉందా?"

పిల్లలు అన్నారు—"అవును, వాణ్ణి కొట్టకుండా వుండటమే."

నేనన్నాను-"మరి పాఠం యేమవుతుంది?"

"పాఠం కంఠస్థం చేసికొని రాని వాణ్ణి పాఠశాల నుంచి వెళ్ళ గొట్టవచ్చు. వ్యర్థంగా కొట్టినందువలన లాభం ఏమిటి! కొడితేనే విద్యవస్తే మరి రోజూ పిల్లలు దెబ్బలు తింటూనే వున్నారు గదా! వాళ్ళకు విద్య రావడం లేదే?" అన్నారు పిల్లలు.

ఒకడన్నాడు-"అయ్యా, జీవన్‌కు పాఠం మీద మనసే వుండదు. వాడికి కుందేళ్ళను పట్టుకోవడమంటే మహా సరదా. పశువులు మేపడంలో కూడా వాడు హుషారుగానే వుంటాడు."

మరొకడన్నాడు—"అయ్యవారూ, జీవన్ పాఠశాలలోనే దెబ్బలు తింటాడు. కాని బయట మాత్రం వాడే పిల్లలందరినీ చితక బాదుతాడు. మా కందరికీ వాడంటే హడలే!"

నేనడిగాను-"అతడు ఏ కులం వాడు?"

పిల్లలు చెప్పారు-"అయ్యా, అతడు సాలె కులానికి చెందినవాడు. అతని తండ్రి గవర్నమెంట్ ఉద్యోగం చేస్తున్నాడు. వీణ్ణి తన బలవం తం మీద చదివిస్తున్నాడు. ఇంటి దగ్గర చదువు చెప్పడానికి ప్రయివేటు మాస్టరును కూడా పెట్టాడు.

నేనన్నాను-"సరే, ఇక వాడి సంగతి వదిలేయండి. మనం మన కథను పూర్తి చేసుకుందాం."

కథ పూర్తి అయ్యే సరికి గంట కూడా మ్రోగింది. నేను దండించ డాన్ని గురించీ, దాని ఫలితాన్ని గురించీ ఆలోచించుకుంటూ ఇంటికి చేరాను. నేను మాత్రం ఎవరినీ దండించేదే లేదు. అంచేత నేను నిశ్చింతగా



వున్నాను.

ఇదే విధంగా మరికొన్ని రోజులు గడిచిపోయాయి.

## 4

ఒకరోజు నేను ఉన్నతాధికారిని కలిశాను. "అయ్యా, మీరు నేను కోరినట్లుగా ఒక ఆదేశం జారీ చేయండి!"

"పాఠశాలకు వచ్చే పిల్లలు శుభ్రమైన దుస్తులు ధరించి రావాలి. తలమీద మురికి టోపీ ధరించరాదు. తలమీద జుట్టువుంటే దువ్వుకొని రావాలి. పిల్లలు ప్రతివారం గోళ్ళు తీయించుకోవాలి. జుట్టు పెరిగితే కత్తెర వేయించుకోవాలి. గుండీలు లేని చొక్కాలతో రాకూడదు. ప్రతి విద్యార్థి స్నానం చేసి పాఠశాలకు రావాలి. కనీసం ముఖమూ, కాళ్లూ- చేతూలూ కడుక్కొని రావాలి."

ఉన్నతాధికారి ప్రశాంతంగా విన్నాడు. ఆయనన్నాడు-"ఎందు కండీ? మీరు నచ్చజెప్పినా తలిదండ్రులు వినిపించుకొనడం లేదా?"

నేనన్నాను-"నేను ఎంతగా నచ్చ జెప్పినా నా మాట వాళ్ళకు మ్రింగుడు పడటం లేదు. సంపన్నులైన తల్లిదండ్రులు కూడా అర్థం చేసుకోవడంలేదు, 'చిన్నతనంలో మేము కూడా యిలాగే మురికి కారుతూ బడికి వెళ్ళే వాళ్ళం, ప్రతిరోజూ ఇవన్నీ ఎవరు చేస్తారు? మీ పని చదువు చెప్పడం, ఆ చదువేదో చెప్పరాదండీ! ఇదంతా మేము చూసుకుంటాం' అంటున్నారు. ఇప్పటికి జరిగిన సంస్కరణ చాలా తక్కువనే చెప్పాలి. నిజంగా ఇటువంటి విద్యార్థులకు బోధించాలంటే నా మనస్సు అంగీక రించడంలేదు."

అధికారి అన్నాడు-"మీరు నిజం చెపుతున్నారు. మన సమాజం కూడా అలాగే వుంది. ఈ సమాజంలో మార్పు తీసికొని రావడమంటే అసంభవాన్ని సంభవం చేయడమే! అయితే యీ శాఖ నా చేతిలోకి

వచ్చిన దగ్గర నుంచి తల్లిదండ్రుల మీద మన ప్రభావం కొంచెం పడినట్లు కన్పిస్తున్నది."

"నేను కోరినట్లుగా ఆదేశాన్ని జారీ చేయకూడదా?" అన్నాను.

"బ్రదర్, అటువంటి ఆదేశాన్ని నేను జారీ చేయలేను. అది నా అధికార పరిధికి మించిన విషయం."

"మీ అధికార పరిధికి మించినదా? మరి మీరు ఇంత ఉన్నతాధికారిగా ఎందుకు ఉన్నట్లు?"

"బ్రదర్, ఇది ఒక చిన్న సంస్థానం. ఇక్కడే కాదు. ఇతర చోట్ల కూడా అధికారుల చేతుల్లో ఇటువంటి అధికారాలు ఉండవు."

"మరయితే?" అన్నాను.

అధికారి చెప్పాడు—"మీరు ప్రభుత్వాన్ని ఊపి చూడండి. అటువంటి ఆదేశం అక్కడ నుంచి జారీ కావలసిందే. అయినా ప్రజలు యీ ఆదేశాలను ఎక్కడ పాటిస్తున్నారు? ఎప్పుడు పాటిస్తున్నారు? వాళ్ళు మన ఆదేశాలను అనుసరించక పోయినా మనం వాళ్ళను చేయ గలిగిందేమీ లేదు."

"ఆదేశాలను అనుసరించని వారి పిల్లలను పాఠశాల నుంచి బయటికి పంపించలేరా?"

"అది వీలుకాదు. అలా చేస్తే ప్రజలలో పెద్ద గందర గోళం వ్యాపిస్తుంది."

నేనన్నాను—"అయ్యా, చేయాలని మనసుంటే ఏమయినా చేయవచ్చును. కాని అధికారం లేని శక్తి సామర్థ్యాల వలన ప్రయోజనం ఏముంది? నిజం చెప్పాలంటే ఈనాటి సమాజంలో మన ఉపాధ్యాయులకు గల హోదా ఏపాటిది?"

అధికారి అన్నాడు—"అది వాస్తవమే ననుకోండి! ప్రస్తుతం ఎలా కొనసాగుతున్నదో అలాగే కానివ్వండి!"



"అలా జరగడానికి వీల్లేదు. ఆఖరుకు పాఠశాల పరిధిలో చేయగల ప్రయత్నాలన్నీ చేసి తీరుతాను. పిల్లలకే అటువంటి అలవాట్లు అలవరుస్తాను. అంతేకాదు, సమయం దొరికినప్పుడు సమాజంతో కూడా పోరాడతాను. ప్రజాందోళనను ప్రారంభిస్తాను. ప్రజలు ఎంత నిర్లక్ష్యంగా వున్నా నిజం చెప్పాలంటే మన విద్యాలయాలలో వున్న యీ మురికి వాతావరణం అనేక రోగాలకు పుట్టినిల్లు అనడంలో సందేహం లేదు. మనం దీనిని రూపు మాపవలసిందే."

అధికారి అన్నాడు—"నిజమే, మీ యిష్టం వచ్చినట్లు చేయండి. ప్రయోగం జరపడానికి రానే వచ్చారు. కాని నాలుగవ నెల కూడా పూర్తి కావచ్చింది. కాలం గబగబా గడిచిపోతూ వుంది. ఆ విషయం జ్ఞాపకం ఉంచుకోండి!"

నమస్కారం చేసి నేను బయటికి వచ్చాను. నెమ్మదిగా ఇల్లు చేరుకున్నాను. నేను నా సొంత డబ్బుతో (ఏమైనా కొనడానికి కంటిన్ జెన్సీలో యేముంది?) మంచి మంచి చీపుళ్లు రెండు కొన్నాను. ఓ చిన్న అద్దం తెచ్చాను. ఒక దువ్వెన తెచ్చాను. ఒక ఖద్దరు టవలు తెచ్చాను. ఓ చిన్న కత్తెరకూడా కొన్నాను. పాఠశాల ఆవరణలో ఒక నీటి పంపు వుండడం సంతోషించ దగిన విషయమే! ఆ రోజు క్లాసుకు నేను ఈ యేర్పాట్లన్నీ చేసి వుంచాను.

మరుసటి రోజు నేను పిల్లలనందరినీ ఒక వరుసలో నిలబెట్టాను. ఇప్పుడు వాళ్ళు నాకు బాగా దగ్గరి వాళ్ళయ్యారు. నన్ను ప్రేమిస్తున్నారు. నేను ఏది చేసినా వాళ్ళ ప్రయోజనం కోసం చేస్తాననే నమ్మకం వాళ్ళకు యేర్పడింది.

నేను అద్దంలో అందరికీ వాళ్ళ ముఖాలు చూపించి చెప్పాను—"చూడండి, మీరు మీ ముఖంగాని, కాళ్ళు-చేతులు గానీ, ముక్కుగానీ మురికిగా వున్నాయనుకుంటే పంపు దగ్గరకు వెళ్ళి వాటిని కడుక్కోండి.

కాళ్లూ-చేతులూ శుభ్రంగా కడుక్కోండి. తల వెంట్రుకలను కూడా తడుపుకోండి."

ఇంకేముంది, అందరూ 'హా-హో' అంటూ ఒక్కసారిగా పరుగు తీశారు. ఒకరిమీదొకరు పడుతూ, ఒకరినొకరు తోసుకుంటూ ముఖాలూ–ముక్కులూ, కాళ్ళూ-చేతులూ కడుక్కుంటూ వున్నారు.

నేను ఆలోచించాను-"వీళ్ళకు క్రమంగా నడవడం, క్రమంగా పనిచేయడం నేర్పవలసి వుంటుంది. ఈరకంగా గడిబిడి పని సమాజమంతా చేస్తూనేవుంది. ఈ మొరటుతనం నుంచి మనం వీళ్ళను తప్పించాలి."

వెంటనే నేను అక్కడ ఒక గీత గీసి చెప్పాను-"చూడండీ, మీరందరూ ఈ గీత మీద నిలబడండి. ఒక్కొక్కరే వరుసగా పంపు దగ్గరకు వెళ్ళండి."

నేను రెండు చేతుల్లో రెండు ఖద్దరు గుడ్డముక్కలను తీసికొని నిలబడ్డాను. పిల్లలు ఇరువైపులా వచ్చి కాళ్లూ-చేతులూ, ముక్కూ-ముఖమూ, తల తుడుచుకున్నారు.

పాఠశాల ఆవరణలో ఈరకమైన పని మొట్ట మొదటిసారిగా జరుగుతూ వుంది. అంచేత ఇవాళ ఇక్కడ జరుగుతున్న పనిని దారిన పోయే వాళ్ళంతా విస్తుబోయి చూస్తున్నారు.

ముక్కూ-ముఖమూ, కాళ్లూ-చేతులూ కడుక్కున్న తరువాత మేము క్లాసులోకి వెళ్లాము. అక్కడ వాళ్ళకు దువ్వెన యిచ్చి చెప్పాను-"చూడండీ, ఇప్పుడు మీరందరూ తలలు దువ్వుకోండి." వాళ్ళ టోపీలు అంతకు ముందే నేను ఒక మూల పెట్టించాను. పిల్లలందరూ ఇప్పుడు అందంగానూ, ఆరోగ్యంగానూ, శుభ్రంగానూ కన్పిస్తున్నారు. నేను సుద్ద ముక్కతో ఒక వలయం గీశాను. అందరినీ ఆ గీత మీద కూర్చోబెట్టాను. నేను కూడా అక్కడే కూర్చున్నాను. అప్పుడు వాళ్ళతో అన్నాను-



"ఇప్పుడు మీ చేతులు ఎంత శుభ్రంగా వున్నాయో చూసుకోండి. మీ ముఖాలు ఎంతో అందంగా కన్పిస్తున్నాయి. మీకు ఇలా వుండటం ఇష్టంగా వుందా లేదా?"

"ఇష్టమేనండీ" అన్నారు అందరూ.

నేనన్నాను-"అయితే చూడండి, రోజూ పాఠశాలకు వచ్చీ రావడంతోనే ముందుగా యీ పని చేస్తూ వుండండి. ఆ తరువాతనే మరో పని చేయవచ్చు."

ఆ రోజు నాకెంతో ముచ్చటగా వుంది. నా మనసు ఎంతో సంతోషంగా వుంది. నేనన్నాను-"రండి, ఈరోజు మనం ఒక పాట పాడుకుందాం. మొదటి పాట నేను పాడుతూ పాడించాను. అది ఒక ప్రార్థన-గీతం. ఇవాళ అప్రయత్నంగానే నా నోటి నుంచి ప్రార్థన - గీతం ధ్వనించింది.

ఆరోజు గోళ్ల పని మిగిలి పోయింది దుస్తుల పనీ, గుండీల పనీ ఇంకా వుండనే వుంది. అయినా ప్రస్తుతానికి వాటి ఆలోచన వదిలిపెట్టి నేను ఆరోజు చేయవలసిన మరో కార్యక్రమాన్ని ప్రారంభించాను.

## 5

నేను ఆలోచించాను, కథలు వినిపించడంద్వారా చరిత్ర బోధనకు పునాది వేశాను. ఇప్పుడు జానపద గేయాలు పాడటం ద్వారా పద్య పాఠాల బోధనకు పునాది వేయాలి. నేను లోతుగా ఆలోచించిన తరువాత మొదటి ఆరు మాసాలలో అన్నిటికీ పునాది వేయాలని నిశ్చయించుకున్నాను. ఆ తరువాత ఆరు మాసాలలో ఆ పునాది మీద నా ప్రణాళిక ప్రకారం బోధనారీతి భవనాన్ని నిర్మించ వలసివుంది.

విద్యార్థులకు యీ రకమయిన నూతన విషయమేదయినా లభించినప్పుడు వినోదమూ, ఆనందమూ, సంతోషమూ కలుగుతున్నాయి. నేను

జానపద గేయాలు ప్రారంభిస్తూ చెప్పాను-"చూడండీ, నేను మీచేత పాటలు పాడిస్తాను. మీరందరూ పాడండి."

నేను పాడాను—

"విన్నావటే సకియ విన్నావటే
మదిలోన కన్నయ్య వున్నాడటే
చూచావటే సకియ చూచావటే
కన్నయ్య నా మనసు దోచాడటే!"

కాని నాతోపాటు ఎవరూ పాడలేక పోయారు.

నాకు ఆశ్చర్యంవేసింది. నాలుగవ తరగతి పిల్లలు ఈ మాత్రం కూడా పాడలేక పోయారు. అయితే వాళ్ళకు పాడే అలవాటు లేదు గదా! నేను మరోగేయం ప్రారంభించాను—

"అదిగదిగో అదిగదిగో నా నెమలీ,
అందాలు చిందించు నా నెమలీ,
ముత్యాలు మేస్తుంది నా నెమలీ,
నృత్యాలు చేస్తుంది నా నెమలీ!"

ఈసారి కొంచెం కొంచెం పాడారు.

అయితే 25-30 మంది పిల్లలు ఒక్కసారి పాడటం ప్రారంభించారు. వాళ్ళ కోలాహలంతో క్లాసంతా మారుమ్రోగి పోయింది.

ప్రక్క క్లాసు ఉపాధ్యాయుడు వచ్చి గోలపెట్టాడు-"ఏమండీ, ఈ గోల ఆపించరూ! మీ గోలలో మా గోల వినిపించడమేలేదు!"

మరో ఉపాధ్యాయుడు వచ్చి అన్నాడు-"ఈ మహానుభావుడు రోజూ ఏదో ఒక కొత్త ప్రహసనం ప్రదర్శిస్తూనే వుంటాడు. ఈయన మనల్ని మన విద్యార్థులకు చదువు చెప్పుకోనిస్తాడా లేదా? ఈయనకేం? ఈయన ప్రయోగం సఫలమైతే అధికారి మనల్నే హెచ్చరిస్తాడు- 'చూడండీ, అలా చేయండి, ఇలా చేయండీ' అంటాడు. ఈయన ప్రయోగం విఫలమైతే



ఇక్కడనుంచి ఈయన జండా పీకెస్తాడు."

ఇంతలో ప్రధానోపాధ్యాయుడు వచ్చాడు. ఆయనన్నాడు-"అయ్యా, లక్ష్మీశంకర్‌గారూ! ఇదేమయినా బాల్వాడీ అనుకున్నారా? మౌఖిక పాఠంగా కవితాగానం చేయిస్తున్నారు? చూడండయ్యా! ఇవీ ఈయనగారి కొత్త ప్రయోగాలు! ఈ పాటలు అందరికీ తెలుసులేవయ్యా!" అని వెళ్ళిపోయాడు.

ఆయన వెళ్ళిపోయిన తరువాత నేను ఆలోచించాను. చాలా పెద్ద చిక్కే వచ్చిపడిందే! సరే, కానివ్వండి! సమష్టిగానం ఓ ప్రక్కనబెట్టి, నేను పాడతాను వినండి!' అన్నాను.

నేను 'ముక్కు బోసి గుండయ్యా కమసాలయ్యా, ముక్కుపోగు చేసిపెట్టు కమసాలయ్యా!' అనే పాట పాడాను. నా రాగం గాడిదను కూడా ఆకర్షించే విధంగా వుంది. అయితే అపస్వరం లేనందుకు సంతోషించాలి. ఏదో విధంగా పని నెరవేరింది. మనసులోనే అనుకున్నాను, భగవంతుడు నాకు మరోకంఠం ఇచ్చి ఉన్నట్లయితే ఎంత బాగావుండేది! నా గొంతు బాగుండదు కాని నేను పద్ధతి ప్రకారం, అభినయపూర్వకంగా పాడాను. అభినయాన్ని కొంతవరకు అభ్యసించాను కూడా. అంచేత నా పాట కొంతమంది పిల్లలకు నచ్చింది. కొంతమంది పిల్లలు ఆవలిస్తున్నారు. కొందరు ఒకరినొకరు గిచ్చుకుంటూ, గిల్లుకుంటూ, నవ్వుకుంటూ, వెక్కిరించుకుంటూ వున్నారు. ఆ చంపక్‌లాల్ ఒంటికంటితో నన్ను ఎగతాళి చేస్తున్నాడు. నేను వీళ్ళ చేష్టలు గమనిస్తూనే వున్నాను.అయినా మౌనం వహించాను. వాళ్ళకున్న యీ దురలవాట్లను మార్చ దలచుకున్నాను.

సంగీతంలో అభిరుచి లేని వాళ్ళతో చెప్పాను-"అబ్బాయిలూ, మీరు వేరుగా వెళ్ళికూర్చోండి. మీ పలకలమీద మీకు తోచినది వ్రాసుకోండి. లేకపోతే యేదయినా చిత్రం గీయండి."

నేను మరో పాట పాడాను. పిల్లల అభిరుచి పెరిగి పోయింది.

మరో పాట పాడాను. ఒక పాట వాళ్ళకు చాలా బాగా నచ్చింది. దాన్ని మరోసారి పాడించుకున్నారు. నేను పాడుతున్న కొలదీ వాళ్ళ అభిరుచి పెరుగుతూ వుంది. చివరకు పిల్లలతో చెప్పాను—"చూడండీ! నేను రోజూ మీకు ఇటువంటి పాటలు పాడి వినిపిస్తాను. కాని ఒక షరతు, పాఠశాల ఆవరణలో మీరు ఆ పాటలు పాడకూడదు."

కాని రెండు రోజుల తరువాత పిల్లలు ఆవరణలోనే అక్కడక్కడ 'ముక్కు బోసి గుందయ్యో' అనే పాట గొణుగుతూ వున్నారు. "మీరు పాడ దలచుకుంటే పాఠశాల బయట పాడుకోండి, పాఠశాల ఆవరణలో పాడవద్దు" అని వాళ్ళకు మరోసారి నచ్చజెప్పాను.

ఇక గ్రామంలో ఈ పాటలను గురించి రకరకాల చర్చలు! ఈ పాటలు ఏ జాతివనీ, ఈ మాస్టరు ఏ జాతి వాడనీ, ఈ మాస్టరు పాఠాలు చెప్పడానికి వచ్చాడా, లేక పాటలు నేర్పడానికి వచ్చాడా? అనీ గ్రామస్తులు అక్కడక్కడ చెప్పుకుంటూ వున్నారు.

"మీ మాస్టరు బళ్ళో ఆడవాళ్ళ పాటలు ఎందుకు పాడిస్తున్నాడూ?" అని పిల్లల తల్లులు ప్రశ్నిస్తున్నారట!

వీటిని నేను పట్టించుకోవడం లేదు. ఇవన్నీ వింటూ కూర్చుంటే ఇక్కడ పని జరిగేదెట్లా? నేను పూర్తిగా పనిలో మునిగిపోవాలి. కొత్త కొత్త క్షేత్రాలు యీ రకంగానే రూపొందుతాయి.

నేను ప్రతి రోజూ పిల్లల ముందు కొత్త కొత్త కవితలు గానం చేస్తున్నాను. వాళ్ళకు ఏది ఎక్కువగా నచ్చుతుందో చూస్తున్నాను. అలా చేస్తూ చేస్తూ వుండగా ఆయిదారు పాటలు అనుకోకుండానే పిల్లలకు కంఠస్థమైపోయాయి. అయితే సంగీతం అంటే ఇష్టం లేని పిల్లలు కూడా ఇద్దరు ముగ్గురున్నారు పాటల సమయంలో వాళ్ళు వ్రాసుకుంటూనో చదువుకుంటూనో వుండేవాళ్ళు. నేను కూడా వాళ్ళను గురించి అంతగా పట్టించుకునే వాణ్ణి కాదు.



ఈ సమయంలో నేను మనసులో రాస లీల కార్యక్రమాన్ని కూడా రూపొందించుకొని ఉన్నాను. నేను దానిని ఆరంభించాలని సంకల్పించుకున్నాను.

నా క్లాసులో ప్రస్తుతం ఈ రకమైన కార్యక్రమం కొనసాగుతూ వుంది: వార్తా-కథనం, పుస్తక పఠనం, ఆటలు, శ్రుత లేఖనం (డిక్టేషన్), కవితా శ్రవణం, పరిశుభ్రత, ప్రార్థన.

## 6

ఒకరోజు మా పాఠశాలకు పరమహంసగా పేరు గాంచిన ఒక స్వామీజీ విచ్చేశారు. వారికి తోడుగా మా ప్రధానోపాధ్యాయులు కూడా వున్నారు. ప్రధానోపాధ్యాయుడు ఆయనను పరిచయంచేస్తూ నాతోఅన్నాడు-"వీరు మహాత్ములు! మంచి ధర్మోపదేశకులు. విద్యార్థులంటే వీరికి అపరిమితమైన ప్రేమ. ప్రతి రాష్ట్రంలో పాఠశాలకు వెళ్ళి విద్యార్థులకు ఉపదేశం ఇచ్చే అనుమతి వీరికి లభించింది. ఈ రోజు ఈ మహానుభావులు ఉత్తరం తీసికొని మన పాఠశాలకు వేంచేశారు. ఉపదేశించడానికి వచ్చారు."

నేను వారికి గౌరవ పూర్వకంగా నమస్కారం చేశాను. కుర్చీ ఇచ్చాను. తరువాత చెప్పాను—"స్వామీజీ మీరు మీ కార్యక్రమం ప్రారంభించండి!"

నా విద్యార్థులు ఆ మహాత్ముని బోడితలనూ, ముఖాన్నీ అదే పనిగా చూస్తూవున్నారు. బక్క పల్చగా వున్న ఆయన శరీరము, కాంతివంతంగా వున్న ఆయన ముఖ భంగిమ, చేతిలో కమండలం పిల్లలకు కుతూహలాన్ని కలిగిస్తున్నాయి.

నేను విద్యార్థులతో అన్నాను—"చూడండ అబ్బాయిలూ, స్వామీజీ ఉపదేశిస్తారు. మీరందరూ శ్రద్ధగా వినండి."

పిల్లలు ఇప్పుడు నా ఆదేశాన్ని శిరసావహిస్తున్నారు. వాళ్ళు ప్రశాంతంగా కూర్చున్నారు.

స్వామీజీ ఉపదేశం ప్రారంభించారు—"విద్యార్థులారా, ఈ జగత్తులో ఈశ్వరుడే అందరి కన్న గొప్పవాడు. ఆయన కారణంగానే యీ జగత్తు వుంది. అతడే మనకు ఆది కారణం!"

ఈ విధంగా ఈశ్వరుని మహిమ గురించి చెపుతూ వున్నాడు. నేను మౌనంగా కూర్చొని వున్నాను. నా విద్యార్థులు ప్రశాంతంగా వున్నారు. కాని క్రమంగా వాళ్ళలో అశాంతి బయలు దేరింది. ఒకడు ఆవలిస్తున్నాడు. ఒకడు పలక మీద గీతలు గీస్తున్నాడు. ఒకడు పుస్తకంలో పేజీలు తిరగేస్తున్నాడు. కొందరికళ్ళు కొంచెం ఎరుపెక్కాయి. ఒకడు తిరస్కార భావంతో బయటికి వెళ్ళిపోయాడు. వాడి వెంట ఐడి మరొకడు వెళ్లాడు. కొందరు విద్యార్థులు తమలో తాము ముచ్చట్లు చెప్పుకుంటున్నారు. నేను వాళ్ళకు మౌనంగా వుండమని సౌంజ్ఞ చేశాను. అప్పుడు అందరూ మౌనం వహించారు.

స్వామీజీతో నేను వినయ పూర్వకంగా చెప్పాను "మహారాజ్, సరళంగా వుండే విషయమేదయినా చెప్పండి! విద్యార్థులకు అర్థమవుతుంది!"

స్వామీజీ చాలా సరళ స్వభావులు. ఆ సమయంలో ఆయన వెంటనే హిందూ ధర్మాన్ని గురించీ, ధర్మ గ్రంథాలను గురించీ, ఆ గ్రంథాలలో వుండే ధార్మిక విషయాలను గురించీ చర్చ ప్రారంభించారు. కాని విద్యార్థులకు అందులో కూడా రుచి దొరకలేదు.

నేను మనసులో ఆలోచిస్తూ వున్నాను. ధర్మోపదేశం చేసే పద్ధతి ఇదేనా? జీవితమంతా వ్యయపరచినా బోధపడ నటువంటి అత్యంత నిగూఢమైన ధర్మతత్త్వాన్ని ఈ విధంగా వివరించగలమా ? ఇదేనా ధార్మిక జ్ఞానం? ఇదేనా ధర్మ బోధ? ఇటువంటి ధర్మ జ్ఞానం ఇక్కడ



నిరుపయోగమై పోతున్నది గదా!

నేను ఈ విధంగా ఆలోచిస్తూ వుండగానే స్వామీజీ కొన్ని శ్లోకాలు చదవడం ప్రారంభించారు. విద్యార్థులు మనస్సును అణచుకొని బలవంతంగా వారి మాటలు వింటూ వున్నారు. కాని అర్థం చేసుకోలేక పోతున్నారు. అంచేత ఎక్కువ మంది కేవలం మనో వినోదం కోసం అరుస్తున్నారు.

స్వామీజీ నిజంగానే చాలా గంభీరంగా విషయాలన్నీ చెపుతున్నారు. ఆయన దృష్టిలో ఆయన చేస్తున్న యీ పని పవిత్రమైనదీ, అవసరమైనది. ఆయన తన కర్తవ్యాన్ని బాగానే నిర్వహిస్తున్నాడు. కాని పిల్లల ముందు అదంతా బూడిదలో పోసిన పన్నీరుగా వుంది.

ఇప్పుడు స్వామీజీ శ్లోకాలకు అర్థం చెప్పడం ప్రారంభించారు. పిల్లలు అదికూడా వినవలసి వచ్చింది. తరువాత ఆయన అర్థాన్ని బోర్డు మీద వ్రాశాడు. దానిని వ్రాసుకోమని పిల్లలతో చెప్పాడు. ఆ తరువాత మళ్ళీ అన్నారు—"ఈ శ్లోకాలను మీరు ప్రతిరోజూ ఉదయమే లేచి చదవండి. రాత్రి నిద్రించబోయే ముందు కూడా చదవండి. అలా చేస్తే మీ బుద్ధిబలం పెరుగుతుంది. మీ తేజం వృద్ధి చెందుతుంది."

నా క్లాసులోని ఆ పిల్లలు పదేసి, పన్నెండేసి సంవత్సరాల వాళ్ళు. వాళ్ళకు ధర్మం గురించిగానీ, శ్లోకాలను గురించిగానీ ఏం బట్టింది? అయినా శ్లోకాలు వ్రాశారు. వాటి అర్థాన్ని గూడా వ్రాశారు.

మనసులో నా ఆలోచన కొనసాగుతూనే వుంది, ధర్మబోధకు పాఠశాలలు తప్ప మరోచోటు దొరక లేదా? పూర్వం దేవాలయాల్లో ధర్మ బోధ చేస్తుండేవారు. ఆ ప్రవచనాలు విని ఇళ్ళల్లో తల్లిదండ్రులు ఆ ప్రకారం ఆచరిస్తూ, వ్యవహరిస్తూ వుండేవారు. ఇళ్లల్లో వుండే యీ ఆచార వ్యవహారాలు పిల్లలకు ధర్మ బోధగా పనిచేస్తూ వుండేవి. ఇప్పుడు యీ ధర్మ బోధను పాఠశాల కార్యక్రమంలో ఒక భాగంగా చేశారు ఎందుచేత?

ఇప్పుడు ప్రజలకు ధర్మ ప్రవచనాలు వినే తీరిక లేకనా? లేక పెద్దవాళ్ళు, వృద్ధులూ వాటిని వినీ, వినీ సంతృప్తి చెందారా? లేక మరేదయినా జరిగిందా? నేను యిలా ఆలోచిస్తూ వుండగానే గంట కొట్టారు. నేను ఆలోచిస్తూ, ఆలోచిస్తూ ఇంటికి వెళ్ళడానికి సిద్ధమయ్యాను.

అలసిపోయిన పిల్లలందరూ స్వామీజీకి నమస్కారం చేసి ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు. నేనూ, స్వామీజీ మిగిలిపోయాము. నేనన్నాను—"మహారాజ్, ఈ రోజు భిక్ష మా యింట్లోనే గ్రహించండి."

మేము భోజనానికి కూర్చున్నాము. పిచ్చాపాటీ మాట్లాడు కుంటూ వున్నాము. మాట్లాడుతూ మాట్లాడుతూ మా సంభాషణ ధర్మ బోధ వైపుకు మళ్ళింది. స్వామీజీ అన్నారు—"చూడు, మిత్రమా, ఈనాడు ధర్మం పూర్తిగా కన్పించకుండా పోతోంది. అందుచేత ఆరంభం నుంచీ ధర్మ బోధ చేస్తూ యీ కొత్త తరాన్ని ఆస్తికులుగా తయారు చేయాలి."

నేనన్నాను—"కాని స్వామీజీ, ఈ విద్యార్థులు పసివాళ్ళు. ఎంతో మార్దవంగా వుండే వాళ్ళ మెదడు ఈశ్వరుడు, ఆత్మ, ధర్మం లాంటి కఠిన విషయాలను ఎలా గ్రహించ గలుగుతుంది? ఈ రోజు మీరిచ్చిన ఉపన్యాసంలో వాళ్ళకు కొంచెం కూడా ఆసక్తి లేదు. అభిరుచి లేదు. ఆనందం లేదు. కేవలం మర్యాద కోసం వాళ్లు మౌనంగా కూర్చున్నారు. ఆ విషయం ఉపన్యసించే సమయంలో మీరు అనుభవం చేసుకొనే వుంటారు."

స్వామీజీ అన్నాడు—"నిజం మిత్రమా! పిల్లలకు ఉపదేశాలకన్న ఆట పాటలంటేనే ఇష్టం. కథలూ, గాథలూ బాగా ఇష్టపడతారు. అయితే వాళ్లకు ఇష్టం వున్నా లేకపోయినా ధర్మబోధ తప్పకుండా చేయాలి. ధార్మిక శ్లోకాలు కొన్ని వాళ్ళ చేత కంఠస్థం చేయించాలి."

"కాని స్వామీజీ, చూడండీ! ధర్మం అనేది కేవలం నాలుక మీద ఉండేది కాదు. ధర్మం అనేది ఒక చైతన్యం. అది మనస్సులోనే కలగాలి. అదే ఉచితమైనది. ధర్మం మీద ఆసక్తి వున్నప్పుడే ఆ భావన ఉద్భ



విస్తుంది. దానికి ఒక సమయమంటూ వుంటుంది. స్వామీజీ, ఇదంతా విద్యార్థుల మీద మోయలేని బరువు మోపడమేనని అనిపించడం లేదూ?"

స్వామీజీ కొంచెం ఆలోచనలో పడ్డాడు. నేను మళ్ళీ అన్నాను-"మహారాజ్, ధర్మం ఒక సత్యమైన పదార్థం. అది మనిషి జీవితానికి ఒక నౌక లాటింది. మానవ జీవిత లక్ష్యం సంసార సాగరం నుంచి ఒడ్డు చేరటం. ఇదంతా చాలా కఠిన మైనదనీ, సామాన్య బుద్ధికి అతీతమైనదనీ, అందుకోసం అత్యధికమైన పూర్వప్రయత్నం అవసరమనీ అనిపించేమాట నిజం కాదూ?"

స్వామీజీ అన్నాడు-"అవును, అదినిజమే! కాని....."

నేను మధ్యలోనే అందుకున్నాను-"ధర్మం అంత తేలికైనది కాదు. అది బజారులో దొరికే వస్తువు కాదు. పుస్తకాలలో అచ్చయిన విషయాలన్నీ ధర్మం కాదు. అటువంటి మహత్వపూర్ణమైన విషయాన్ని అత్యంతగూఢంగానూ, గుప్తంగానూ వుంచాలనీ, ఎంతో కఠినమైన పరిశ్రమ చేసిన తరువాతనే అది సాధకునకు లభించాలనీ మీరు అనుభవం చేసుకోవడం లేదూ?"

స్వామీజీ—"అవును అందుకే మన పూర్వీకులు గురువుల ఆశ్రమంలో ఉండవలసి వచ్చేది. ధర్మాన్ని అర్థం చేసుకొనడానికి శరీరాన్ని కఠినమైన శ్రమకు గురిచేయ వలసి వచ్చేది."

నేనన్నాను—"కాని యీనాడు మనం ఇంటింటికీ, బడి-బడికీ బయలు దేరి వచ్చి ధర్మోపదేశం చేసి ప్రజల్లో ధర్మ-ప్రసాదం పంచడానికి బయలుదేరాం!"

స్వామీజీ—"మిత్రమా, ఇది కలియుగం కదా? ఈ రోజుల్లో గురువు వద్దకు శిష్య-భావంతో వెళ్ళే వాళ్లు ఎంత మంది వున్నారు?"

నేనన్నాను—"లేరు, అయితే దాన్ని అలా వుండ నివ్వండి. ఈ రకంగా ధర్మాన్ని అమ్మినందు వలన, లేక బహూకరించి నందు వలన

ఎవరూ ధర్మాత్ములు కాలేరు."

స్వామీజీ—"అయితే ఏం చేయాలో మీరే చెప్పండి?"

నేనన్నాను—"ఇటువంటి చిన్న పిల్లలకు ధర్మోపదేశం చేయకుండా వుండడమే మంచిదని నా అభిప్రాయం. వాళ్లకు యీ వయసులో ఆరోగ్య వంతమైన శరీరం, ఆరోగ్యవంతమైన మనస్సు, నిర్మలమైన బుద్ధి, ఎన్నడూ అలసట లేకుండా పని చేయగల అద్భుతమైన శక్తి అవసరం. వాళ్ళను మరింత బలవంతులుగా చేయవలసిన అవసరం వుంది."

స్వామీజీ అన్నాడు—"నిజం, బలం గలవాడికే ఆత్మ బలం వుంటుంది."

నేనన్నాను—"నా దృఢమైన విశ్వాసాన్ని వివరిస్తాను, వినండి! మనం ఎన్ని నీళ్ళు పోసినా ఋతువులోనే వృక్షం ఫలిస్తుంది. అలాగే ఆయా సమయాల్లోనే మనిషికి యవ్వనం వస్తుంది, వృద్ధాప్యం వస్తుంది. అలాగే దాని సమయం వచ్చినప్పుడు ధర్మజిజ్ఞాస దానంతటదే వృద్ధి చెందుతుంది. అకాలంలో ధర్మ పరిచయం అకాలంలో గృహస్థాశ్రమం స్వీకరించి నట్లే వుంటుంది. అది సామయిక మయిన పని కాదనే అనిపిస్తున్నది. బాల్యం నుంచే ధర్మాన్ని దైనందిన చర్చ నీయాంశం గానూ, శ్లోక-పఠన విషయం గానూ చేస్తే ఆ విషయానికి సంబంధించి వున్న వాస్తవమైన జిజ్ఞాస కూడా మందగించి పోతుంది. ధార్మిక కార్యాలకు కూడా వేరుగా వాటి ప్రాముఖ్యం వాటికి వుంది. అయితే మనిషి అభివృద్ధి ఆగి పోయేటంతగా, మనిషి జడ పదార్థంగా మారిపోయేటంతగా వాటికి ప్రాముఖ్యం ఇవ్వవలసిన అవసరం లేదు"

స్వామీజీ—"మీరు నిజం చెపుతున్నారు. నాక్కూడా కొంచెం అటువంటి విశ్వాసమే వుంది. ఇన్ని రోజుల అనుభవం తరువాత నేనూ అర్థం చేసుకుంటున్నాను. రోజూ యీ రకమైన చర్విత చర్వణంతో కొద్ది కాలంలోనే విద్యార్థి అటువంటి విషయాల పట్ల విముఖుడవుతాడు. విసుగు



జెందుతాడు. ఈ విధంగా కాకుండా మరే దయినా పద్ధతిలో వాళ్ళకు ధర్మబోధ చేయాలనే విషయం కూడా ఇప్పుడు నేను అంగీకరిస్తున్నాను."

నే నన్నాను—"స్వామీజీ, క్షమించండి! ధర్మం మన జీవితంలో ప్రతి ఫలించేటట్లుగా మనం ప్రయత్నించాలి. తల్లి దండ్రులు కూడా ప్రయత్నించాలి. ఉపాధ్యాయులు కూడా ప్రయత్నించాలి. పాఠ్య పుస్తకాలలో ఇతర కథలతో పాటు ధార్మిక పురుషుల ప్రసంగాల కథలు కూడా చేర్చవచ్చు. తగిన సమయంలో పిల్లలకు ఇతర కథల మాదిరి గానే పురాణ కథలనూ, ఉపనిషత్తుల్లోని కథలనూ చెప్పవచ్చు. చారిత్రక పురుషుల కథలు చెప్పినట్లుగానే పిల్లలకు ధర్మాత్ములైన పురుషుల కథలు కూడా వినిపించ వచ్చు. పిల్లలను తొలి సంవత్సరాలలో ఈ మాత్రంగా తయారు చేస్తే చాలు. కర్మకాండ (ధార్మిక కృత్యాలు) ను, శ్లోక పఠనాన్ని, ధర్మ బోధనూ, ధర్మ గ్రంథాల అధ్యయనాన్ని భవిష్యత్తుకు వదలి వేయవచ్చు."

స్వామీజీ అన్నాడు-"అటు వంటి స్థితిలో మీరు నాకు ఎటువంటి కార్యక్రమం చూపించగలరు?"

నేనన్నాను-"పిల్లలకు చదువు చెప్పండి. నా మాదిరిగానే మీరు కూడా వాళ్ళను చదివిస్తూ కూర్చోండి."

స్వామీజీ అన్నాడు-"స్వామినై ఇప్పుడు నేను ఉపాధ్యాయునిగా పని చేసేదా?"

నేను చెప్పాను-"అసలు మీ పని అదే మహారాజ్! మీలాంటి వాళ్లు పిల్లలకు చదువు చెప్పే కార్యక్రమం నిర్వహిస్తే మంచి ఉపాధ్యాయులు లేని కొరత కూడా తీరి పోతుంది. ఈ దిశగా వాస్తవమైన పనిగా జరుగుతూ వుంటుంది."

స్వామీజీ నవ్వుతూ నవ్వుతూ చేతినీ మూతినీ కడుక్కున్నాడు.

ఆ రోజు నుంచి స్వామీజీకీ నాకూ పరిచయం పెరిగి పోయింది.

ప్రస్తుతం ఆయన నా ద్వారా నూతన బోధనా పద్ధతులను అధ్యయనం చేస్తున్నాడు. నేను ఆయన సహాయంతో ధర్మ గ్రంథాలను అధ్యయనం చేస్తున్నాను.

కాలం గబగబా గడచి పోతూవుంది. సంవత్సరాంతానికి అపూర్వమైన సాఫల్యంతో అసాధారణమైన యీ పాఠ్య క్రమాన్ని పూర్తి చేయవలసివుంది. అందులోనే నా ప్రయోగాల ప్రత్యేకత ఇమిడి వుంది.

ఇక నుంచి పిల్లలకు చరిత్ర బోధించడం ప్రారంభించాలనుకున్నాను.

## 7

నేను చరిత్రకు సంబంధించిన పాఠ్య పుస్తకాలు పరిశీలించి చూశాను. కాని వాటితో నాకు సంతృప్తి కలగలేదు. ఒక దానిలో ఘటనలు కూడా తప్పుగా ఉదహరించబడి ఉన్నాయి. మరొక దానిలో పురాతన దృక్పథం కన్పించింది. మూడవది కేవలం వృత్తి దృష్ట్యా వ్రాయబడినది. మరో పుస్తకం శైలిలో దోషాలున్నాయి. బాగా ప్రశంసలందుకున్న పుస్తకాలు చిన్న క్లాసుల విద్యార్థులకు బొత్తిగా పనికి రావు.

నేను ఆలోచించాను. ఈ పాఠ్య పుస్తకాలతో పని జరిగేటట్లు లేదు. అయితే ఏం చేయాలి? కథల ద్వారానే చరిత్ర బోధిస్తే ఎలా వుంటుంది?

విద్యార్థులకు కథల మీద మోజు వుండనే వుంది. కాని ఇంత వరకు వాళ్ళకు మరో రకమైన కథలు చెప్పాను. అవి సగం వాస్తవాన్ని, సగం కల్పననూ జోడించి చెప్పినవి. గోరంతలు కొండంతలు చేసి చెప్పినవి. అవి ఎక్కువగా కాల్పనిక లోకానికి సంబంధించినవి. చరిత్ర కథలలో అటువంటి అంశాలు రావడానికి వీలు లేదు. అయినా ఒక కథ ప్రారంభించాను. నీరసంగా వున్న చారిత్రక ఘటనలను చేర్చి నేను కథ చెప్పడం ప్రారంభించాను. కాని కొంచెం సేపు విన్న తరువాత



పిల్లలు అసంతృప్తిని వెల్లడించారు.

వాళ్ళు అన్నారు—"మాస్టరుగారూ ఇది కథ కాదండీ."

"ఇటు వంటి కథ మేము వినలేమండీ."

"అయ్యో, నిన్న చెప్పినటువంటి కథ చెప్పండి."

"ఆడుకొనడానికి వెళ్ళి పోదాం, పదండీ."

"మేము పాటలు పాడతామండీ!"

ఈసారి నా ప్రయత్నం పూర్తిగా విఫలమయినట్లు భావించాను.

విద్యార్థులు నా చుట్టూ మూగారు. నెమ్మదిగా నా చేయి పట్టుకొని గుంజుతూ నన్ను మైదానం మీదికి తీసికొని వెళ్ళారు.

రాత్రికి నేను ఇంటికి వచ్చి ఆలోచించ నారంభించాను. పూర్తిగా చారిత్రక సత్యం చెపితే రుచించదు. చారిత్రక ఘటనలను ప్రత్యక్షంగా చూసివ్రాస్తున్న వాళ్ళు ఎవరూ లేరు. బహుశా కథ రూపంలోనే చరిత్ర కూడా మనోహరంగా వుండవచ్చు. కథలో కథత్వం తప్పకుండా వుండాలి. అంచేత మౌలిక ఘటనలకు దగ్గర దగ్గరగా సంభవమనిపించే కల్పిత ఘటనలను పేర్చి చరిత్రను బోధిస్తే బాగుండవచ్చు.

మరుసటి రోజు నేను ఒక కథ ప్రారంభించాను.

"ఒక పెద్ద అడవి వుంది. అక్కడ భిల్ల జాతి వాళ్ళ పల్లె వుంది. ఆ భిల్ల జాతివాళ్ళు ఆజానుబాహులు. దృఢకాయులు. మహా బలాఢ్యులు. మంచి విలుకాండ్రు. ఆకాశంలో పోయేపోయే పక్షిని బాణంతో అమాంతంగా పడగొట్ట గలరు. ఆ అడవిలో ఒక గుడిసె వుంది."

విద్యార్థులు వెంటనే ఆకర్షణలో పడిపోయారు. వాళ్ళు కథను ఆస్వాదిస్తున్నారు. నేను వీరుడైన వనరాజు కథ ప్రారంభించాను. మౌలిక ఘటనలను దగ్గర దగ్గర వుండేటట్లు ఆ కథకు కొన్ని రంగులు పులిమాను.

ఆ రోజు కథ సగం మాత్రమే పూర్తి అయింది.

మరుసటి రోజు విద్యార్థులు మరోపని చేయనివ్వలేదు.

"వనరాజు, వనరాజు, వనరాజు కథ చెప్పండి" అని అందరూ గోలపెట్టారు.

నేను వనరాజు కథ పూర్తి చేశాను. తరువాత లోలోపల కొంచెం సందేహిస్తూనే "ఈ కథను రెండోసారి విన దలచుకున్న వాళ్ళు లేచి నిలబడండి" అన్నాను.

ఒకరిద్దరు కాదు, అందరూ లేచి నిలబడ్డారు.

రెండో రోజు కూడా ఆ కథే సాగింది. ఈ క్రమం మూడోరోజూ, నాలుగో రోజూ, అయిదో రోజు కూడా కొనసాగింది. విద్యార్థులెవ్వరూ ఆట పాటల పేరెత్తడమే లేదు. వాళ్ళకున్న యీ ఆసక్తి ఎంత వరకు నిలిచి వుండగలదో నేనూ చూస్తూవున్నాను.

ఒక రోజు ప్రధానోపాధ్యాయునికి నన్ను గురించి ఎవరో చెడుగా చెప్పారట—"అయ్యా, ఈయనగారి ప్రయోగం సఫలమయ్యేదీ-విఫలమయ్యేదీ సంవత్సరాంతానికి గదా తెలిసేది. చివరకు విఫలమయ్యాక మీరు మాత్రం చేసేదేముంటుంది? 'అరెరే, ఏమీ పని జరగలేదే' అంటారు. అప్పటికి విద్యార్థులు ఒక విద్యా సంవత్సరం నష్టపోతారు."

అయితే నిజంగా నాకేమీ వింత అనిపించ లేదు. నా మీద ఫిర్యాదు చేసిన వాళ్ళెవరో కూడా నాకు తెలుసు. నా విద్యార్థులకు ప్రతిరోజూ కథలు వినే అవకాశం లభిస్తూ వుంది. వాళ్ళు నన్ను చూచి ఎంతో సంబర పడుతున్నారు. ఇతర ఉపాధ్యాయుల విద్యార్థులు క్లాసుల్లో తమ అసంతృప్తిని వెల్లడిస్తున్నారు. వాళ్లూ కథలు వినాలని ఉవ్విళ్లూరుతున్నారు. చదువులో శ్రద్ధ చూపడం లేదు. అల్లరి చేస్తున్నారు. ఈ కారణంగా నా సహోపాధ్యాయులు నన్ను ద్వేషిస్తున్నారు.

నేను అంటూ వుండే వాణ్ణి-"మిత్రులారా, మీరు మీ దారినే పోండి. నేను నా ప్రయోగం చేసుకుంటాను. నాకు ధైర్యం వుంది. సాహసం



వుంది. పిల్లల కేదయినా నష్టం కలిగిస్తున్నానా అనే చింత నాకూ వుంది. వాళ్ళు నష్టపడకుండా ఉండడానికే ప్రయత్నిస్తున్నాను. చాలా శ్రమ పడుతున్నాను. కాని నాకు నాదైన పద్ధతి ఒకటి వుంది. మీకు మీ పద్ధతి వుంది. అంతగా మీరు కోరితే నేను నా క్లాసును ఇక్కడ నుంచి దూరంగా తీసికొని పోగలను."

ఒక రోజు మా ప్రధానోపాధ్యాయుడు నా క్లాసు చూడటానికి వచ్చాడు. సహజంగా ఆయన సజ్జనుడే. కాని కాలమంతా కథ తోనే జరిగి పోతూ వుండడం చూచి ఆయన కూడా విసుక్కున్నాడు. నాతో అన్నాడు- "అయ్యా, వీళ్ళు యీ విధంగా చరిత్ర ఎలా నేర్చుకుంటారు? కథ చెప్పినంతసేపూ బాగానే వుంటుంది. తరువాత ఈ చెవితో విన్నది ఆ చెవిలో గుండా విడిచిపెడతారు. ఈ రకంగా వాళ్ళు ఏం చదువుతారు? ఏం వల్లిస్తారు?"

నాకు కూడా ఆయన చెప్పిన మాట ఉచితంగా ఉన్నదనే అనిపించింది. నేను ఆలోచించాను. ఆఖరుకు కథలోని ముఖ్య వస్తువు విద్యార్థులకు జ్ఞాపకం ఉండి తీరవలసిందే. లేకపోతే చరిత్ర పరీక్షలో తప్పుతారు. నాకు యీ పరీక్షా బంధనం ఉండనేవుంది.

ఆ మర్నాడే నేను ఒక ప్రయోగం చేశాను. క్లాసులో వనరాజు కథ మూడో సారి నడుస్తూ వుంది. నేను దానిలో కొన్ని మార్పులు చేసి చెప్పడం ప్రారంభించాను. అయితే విద్యార్థులు వెంటనే పట్టేశారు. వాళ్లు అన్నారు-"అయ్యా మళ్లీ మీరు ఇలా చెపుతున్నారేమిటి? మొదట్లో వేయి గుర్రాలని చెప్పారు. ఇప్పుడు యాభై గుర్రాలని చెపుతున్నారేమిటీ? మొదటిసారి చెప్పినప్పుడు గుడిసె నదీ తీరాన వుందని చెప్పారు కదా!"

నేను మనసులో అనుకున్నాను, వీళ్లు కథను అర్థం చేసుకున్నారు. బాగా జీర్ణం చేసుకున్నారు. ఇంకూ ధైర్యం పెరిగి పోయింది. 'ఇక వీళ్లు దాన్ని మరచిపోరు' అనుకున్నాను.

కాని నేను కొంత కల్పనను మిశ్రితం చేసి చెప్పిన చరిత్ర పరీక్షించే వాళ్ళకు ఎలా పనికి వస్తుంది. అంచేత మళ్ళీ ఈ కథలను పరీక్షకుని దుర్భిణిలోకి తీసికొని రావాలి.

నేను చెప్పిన కథల నన్నిటినీ వ్రాసి వుంచాను. వాటిని విద్యార్థులకు యిచ్చి చదవమని చెప్పాను. కథలలో సంక్షిప్త పరచడానికి వీలైన భాగాలను కుదించాను. దేశ, కాలాలను సరీగానే ఉదహరించాను. కథ చెప్పే శైలిలోనూ, వ్రాసే శైలిలోనూ సహజమైన భేదం వుంటుంది. ఈ భేదాన్ని అర్థం చేసుకొని ఆ పద్ధతిలోనే కథలను వ్రాశాను. నేను వ్రాసి వుంచిన కథలు విద్యార్థులు చదువు తున్నప్పుడు కూడా వారికి ఆనందాన్ని కలిగించ గలిగాయి. వాళ్లు వాటిని ఒకటికి రెండు సార్లు చదువుతూ పోయారు.

చరిత్ర విషయంలో ప్రశ్నలు వేస్తే విద్యార్థులు సరయిన జవాబులు చెప్పగలరో లేదో నని నేనింకా సందేహిస్తూనే ఉన్నాను. ప్రశ్నలు వేయడానికి సాహసించ లేక పోతున్నాను.

ఒకరోజు నేను ఒక కథను సూత్ర రూపంలో వ్రాశాను. ఒక్కొక్క వాక్యంలో ఒక్కొక్క ఘటనను ఇమిడ్చాను కథ యొక్క ఆ రూపురేఖను విద్యార్థులకు చదవడానికి ఇచ్చాను.

దాన్ని విద్యార్థులు చదువుతూవుంటే వాళ్ళకు తాము లోగడ చదివిన కథ గుర్తుకు వస్తూ వుంది. తరువాత ఒకరోజు నేను ధైర్యంచేసి కథలోని ఘటనలను ప్రశ్నోత్తరాల రూపంలో విద్యార్థులను ప్రశ్నించడం ప్రారంభించాను. నాకు అమితమైన ఆశ్చర్యం కలిగింది. విద్యార్థులు తడబడకుండా, తడుముకోకుండా గబ గబా నా ప్రశ్నలకు సరయిన సమాధానాలు చెప్పారు. ఇప్పుడు వాళ్ళు కేవలం పరీక్షలో ఉత్తీర్ణులు కావడమే కాకుండా, తరువాత కూడా వాళ్ళకు యీ చరిత్ర పాఠాలు జ్ఞాపకం వుండగలవనే విశ్వాసం నాకు కలిగింది.



కొన్ని రోజుల తరువాత నా ప్రయోగ ఫలితాన్ని చూపించాలనే ఉద్దేశ్యంతో ఉన్నతాధికారిని నా క్లాసుకు ఆహ్వానించాను. చరిత్ర పాఠాలలో విద్యార్థులను పరీక్షించమని ఆయనను కోరాను. పరీక్షించిన తరువాత ఆయన చాలా సంతృప్తి చెందాడు. చాలా సంతోషించాడు. "ఇతర క్లాసుల్లో కూడా చరిత్రను ఈ విధంగానే బోధించాలి." అన్నాడు.

ఆయన అభిప్రాయంతో నాకూ బాగా ధైర్యం వచ్చింది.

కాని, చేయవలసింది ఇంకా చాలా మిగిలేవుంది. నాలుగు మాసాలు గడిచి పోయాయి. అయినా నాకు లభిస్తున్న సఫలత నా ఉత్సాహాన్ని ఇనుమడింప జేస్తూ వుంది.

# ఆరు మాసాలకు

ప్రతి సంవత్సరం జరుగుతున్న సంప్రదాయం ప్రకారం ఈ సంవత్సరం కూడా మా పాఠశాల చాలా ముందుగానే కావలసిన యేర్పాట్లు చూసుకోవడం ప్రారంభించింది. డైరెక్టరు గారు రాబోతున్నారు. ఆయన వచ్చినప్పుడల్లా మా పాఠశాలను తప్పకుండా దర్శిస్తాడు. ఆ రోజు పాఠశాలలో ఒక సభ జరుగుతుంది. విద్యార్థులు తమ చిలుక పలుకులు వినిపిస్తారు. కవితలు చదువుతారు. డ్రిల్లు చేస్తారు. మంచి పని చేసే విద్యార్థులకు డైరెక్టరుగారు బహుమతులిస్తారు. మిగిలిన వాళ్ళ కూ్కడా ఏదో ఒకటి ఇస్తుంటారు. ఆ రోజు పాఠశాలలో అందరికీ మిఠాయి పంచి పెడతారు.

ప్రధానోపాధ్యాయుడు అన్ని క్లాసుల్లోని విద్యార్థులను ఒకచోట సమావేశ పరిచాడు. ఆయన దృష్టిలో బాగా పాడగల రనుకున్న వాళ్ళనూ, బాగా మాట్లాడ గలరనుకున్న వాళ్ళనూ, మర్యాదగా ప్రవర్తించ గలరనుకున్న వాళ్ళనూ ఏరుతున్నాడు. నాకూ్కడా అటువంటి సూచన పంపించ బడింది. కాని నా క్లాసు పిల్లలు ఆ సమావేశంలో లేరు. ప్రధానోపాధ్యాయుడు కారణం అడిగాడు—"అయ్యా నా క్లాసు పిల్లలు ఈ కార్యక్రమంలో పాల్గొనరు" అని చెప్పాను.

"ఎందువలన?"



"ఇదంతా కేవలం డైరెక్టరు గార్ని సంతోష పరచడానికీ, ఆయన ప్రశంసలను పొందడానికీ చేస్తున్నదే గదండీ?"

"అవును, ఇది పూర్వం నుంచీ వస్తున్న సంప్రదాయం. మన ఉన్నతాధికారి గారి అభిప్రాయం కూడా ఇదే."

"అవునండీ, కావచ్చు. కాని నా మనస్సు దీనికి అంగీకరించడం లేదు. నేను అందులో పాల్గొన లేను. నా క్లాసు పిల్లలు కూడా పాల్గొనరు."

"అయితే మీరు నాకు సహకరించడం లేదని, పైగా నా కార్యక్రమానికి అడ్డుతగులు తున్నారనీ నేను ఉన్నతాధికారికి తెలియజేయవలసి వుంటుంది."

"అయ్యా, మీరు తప్పకుండా ఆయనకు వ్రాయండి. నేను ఆయనకు నచ్చ జెప్పడానికి ప్రయత్నిస్తాను."

"సరే మంచిది, అలాగే వ్రాస్తాను."

ఆ గాభరాలో, ఆవేశంలో ప్రధానోపాధ్యాయుడు ఉన్నతాధికారికి నా మీద ఫిర్యాదు వ్రాసి పంపించాడు.

సభా సంరంభం కోసం పాఠశాలలోని ఇతర క్లాసుల పిల్లలను ఏరుకున్నారు. శ్యామసుందర్, భీమశంకర్ సంస్కృత శ్లోకాలు చదవడానికీ, దేవీసింహ్, ఖేమ్‌చంద్ కవితలు గానం చేయడానికీ, చంపక్, రమణీక్, నేమీచంద్, సర్జన్‌లాల్ సంవాదాలు పలకడానికీ, మంచి విగ్రహ పుష్టిగల పది పదిహేను మంది విద్యార్థులను డ్రిల్లు చేయడానికి నిశ్చయించారు.

నేను మనసులో అనుకున్నాను—'ఓ ప్రధానోపాధ్యాయ మహాశయా, శాభాష్! ఓ ప్రాథమిక పాఠశాలా, శాభాష్! ఓ ప్రస్తుత విద్యావిధానమా, శాభాష్!.... ఈ నిశ్చయించ బడిన వాళ్ళల్లో యెవ్వరూ తమకిచ్చిన విషయంతో సంబంధం వున్న వాళ్ళు కాదు. శ్యామసుందర్, భీమశంకర్ కంఠాలు కొంచెం మధురంగా ఉంటాయి. బ్రాహ్మణుల పిల్లలు.

ఇంట్లో సంస్కృత వాతావరణం వుంది. అంచేత వాళ్ళను శ్లోకాలు చదవడానికి ఎన్నిక చేశారు. కాని ఎంతగా రుబ్బినా వాళ్ళకు ఆ శ్లోకాలు జ్ఞాపకం వుండవు. వల్లించలేక వాళ్ళు సతమతం అవుతున్నారు. ఈ స్థితిలో అంతకన్న ఏం జరుగుతుంది? నేను మనసులో విచారిస్తూ ఇంటికి చేరాను. భోజనం చేస్తూ ఉండగా ఉన్నతాధికారి దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. 'మీతో కొంచెం పని ఉంది, కార్యాలయానికి వచ్చి కలుసుకోండి!' అని వ్రాశారు. ఆ పని యేమిటో నాకు తెలిసే వుంది. నేను కార్యాలయానికి వెళ్ళగానే ఆయన కోపంతో ఉండటం చూశాను. మీసాలు లేని ఆయన పెదవులు అదురుతున్నాయి. చాలా కోపంగా వున్నట్లు కన్పిస్తున్నాడు. నన్ను చూడగానే 'కూర్చోండి!', అని చెప్పి ఆ విషయం ఎత్తాడు—"మీ క్లాసు పిల్లలు సభా కార్యక్రమంలో ఎందుకు పాల్గొనరు? అందులో కొందరు అందమైన వాళ్ళూ, చురుకైన వాళ్ళూ ఉన్నట్లుంది!"

నా మనసు శాంతంగా వున్నా మెదడు వేడెక్కింది. నేనన్నాను-"అందమైన వాళ్ళూ, చురుకైన వాళ్ళూ ఇతరులను ఆహ్లాద పరచడానికేనా వున్నదీ? ఇతరుల ముందు నాట్యం చేసీ, ఆడీ, పాడీ కృత్రిమ ప్రశంసలను సంపాదించడానికేనా వున్నదీ?"

తీవ్రంగా వున్న నా సమాధానం విని ఆయన కొంచెం శాంతించి అన్నాడు—"బ్రదర్, మనకు సభ కొత్తదేమీ కాదు. అనేక సంవత్సరాల నుంచి ఈ రివాజు కొనసాగుతూ వస్తున్నది. డైరెక్టరు వచ్చినప్పుడల్లా అలా జరుగుతూనే వుంటుంది."

"అయ్యా, క్షమించండి!" నేను కొంచెం ఉద్రేకంగానే అన్నాను—"అది రివాజుగా వస్తే రావచ్చుగానీ నా దృష్టిలో అది సరయిన పద్ధతి కాదు. మనం దానిని ఖండించాలి. ఇది కేవలం ఆడంబరం కోసం చేసే ఆర్భాటం. అంతా మోసం. డైరెక్టరు గారిని కూడా మోసగించడమే!"

"మోసమా? ఇందులో మోసమేముందీ?"



"అయ్యా, మనం ఆయన సమక్షంలో ప్రదర్శించేదంతా ఏమిటి? విద్యార్థులను తిట్టీ, కొట్టీ, రుబ్బించి తయారు చేసిన సరుకే గదా? అది మన బోధనకు నిజమైన ఫలితం కాదు. సహజమైన పరిణామం కాదు. అనేక రోజులు రిహార్సల్ సాగుతుంది. తీవ్రంగా వల్లె వేయిస్తాం. ఇంత శ్రమ పడిన తరువాత వాళ్లు వాటిని చిలక పలుకుల్లాగా సభలో ఒప్పజెప్పుతారు. అది కూడా వెనుక నుంచి సహాయం అందితేనే. ఇలా చేయడంతో పిల్లల కాలమూ, శక్తీ రెండూ వ్యర్థమై పోతున్నాయి. వాళ్ళ చదువు వెనుక బడుతున్నది. ఏయే పనులకు ఏయే విద్యార్థులను ఎంచుకొన్నారో వాళ్లు ఆయా పనులకు అర్హులు కారు. ఆయా పనులలో నిపుణులు కారు. వాళ్ళను చావబాది విద్వాంసులను చేసినట్లుగా వుంటుంది.

"కాని ఇందులో మోసం ఏముంది?"

"మోసం ఏముంది అంటారా? మన పిల్లలు తెలివిగల వాళ్ళనీ, మన పాఠశాల అందమైనదనీ, మన కార్యక్రమం ఆదర్శవంతమైనదనీ డైరెక్టరు గారు భావించేటట్లు చేయడం మోసం కాక మరేమిటంటారు? వాస్తవంగా మనం ఏమిటో, ఏమి కాదో మనకు బాగా తెలుసు."

అధికారి కొంచెం సేపు మౌనం వహించాడు. కూర్చొని ఆలోచిస్తూ వున్నాడు. నేను మళ్ళీ అన్నాను—"అయ్యా, మనం ఎటూ దగా చేస్తూనే వున్నాము. పైగా పిల్లలను కూడా ఆ దారినే తీసుకు పోతున్నాము. మన డైరెక్టరుగారు మనల్ని చూచి సంతోషిస్తున్నట్లుగా అభినయిస్తారు. బహుమతులు ప్రదానం చేస్తూ అంటారు-'ఈ విద్యార్థులు తెలివి తేటలనూ, యోగ్యతనూ, అభిరుచినీ ప్రదర్శించారు. అందుకు నేను చాలా సంతోషిస్తున్నాను. నిజంగా వీళ్ళల్లో కొందరు విద్యార్థులు భవిష్యత్తులో మంచి పండితులుగానూ, ఉత్తమ పౌరులుగానూ, నిజమైన మనుషులుగానూ తయారు కాగలరనే విశ్వాసం కలిగిస్తున్నారు. వీళ్ళను ప్రోత్సహించడానికే యీ బహుమతులు ఏర్పాటు చేశారు. ఈ పద్ధతిని నేను హృదయ

పూర్వకంగా ఆహ్వానిస్తున్నాను. ఈ రోజు ఈ విద్యార్థులకు ఈ బహుమతులు ఇస్తుంటే నాకు ఎంతో ఆనందం కలుగుతుంది.'—అయితే యీ మాటలు ఆయన హృదయంలో నుంచి వస్తున్నవే నంటారా? ఈ కార్యక్రమమంతా కేవలం ఆయన ముఖస్తుతి కోసం ఏర్పాటు చేయబడిందనే విషయం ఆయనకు మాత్రం తెలియదంటారా? మన యీ బహుమతులు పొందిన పిల్లల చేత రుబ్బించ కుండా వుంటే, ప్రత్యేక శ్రమతో వీళ్ళను తయారు చేయకుండా వుంటే, వీళ్లు ఎంతటి పండితులో, ఎటువంటి పౌరులో, ఎంత మంచి మనుషులో మీకూ, మాకూ, వీళ్ళ తల్లిదండ్రులకూ బాగా తెలిసిన విషయమే గదా?"

అధికారి అన్నాడు—"బ్రదర్, మీరు గొప్ప విద్యావేత్తలే గాని అనుభవజ్ఞులు కారు. మీకు యింకా వ్యావహారిక అనుభవం కలుగ లేదు. మీ దృష్టిలో అన్ని విషయాలూ సిద్ధాంత మయంగా వుంటాయి. కాని మేము అన్ని వైపులా చూడవలసి వుంటుంది."

నేనన్నాను—"అయ్యా, నిజమే. అయినా నేను మాత్రం యీ కార్యక్రమంలో పాల్గొనలేను. ఈ మోసం, ఈ దగా నేను సహించ లేను."

"అయితే మీరు ఏం చేస్తారు?"

"అయ్యా, నా క్లాసును మాత్రం మీరు యీ దగాకూ, మోసానికీ దూరంగా ఉండనివ్వండి."

"కాని దీని వలన చాలా ఇబ్బంది వచ్చి పడుతుంది. ఇతర ఉపాధ్యాయులూ, అధికారులూ నన్ను గురించి ఏమంటారో తెలుసు గదా! నా ఇబ్బందులు ఎంతగానో పెరిగిపోతాయి చూశారా! పైగా యోగ్యులైన మీ క్లాసు పిల్లలను చూచి డైరెక్టరు గారు ఎంతో ఆనందిస్తారని నేను ఆశించాను. కాని మీరేమో........"

నేనన్నాను—"అయ్యా, నన్ను మాత్రం దీనికి దూరంగానే ఉంచండి. నేను డైరెక్టరు గారి వినోదం కోసం ఏదో ఒకటి చేస్తాను.



పిల్లల సమయం వ్యర్థం కాకుండా, వాళ్ళ శక్తి దుర్వినియోగం కాకుండా, దగా, మోసం, ఆడంబరం, ఆర్భాటం లేకుండా వుండే ఏర్పాటు చేస్తాను. అయితే మీరు వారిని నా క్లాసులోకి తీసికొని రావాలి. నా కార్యక్రమం చూచి మీరూ, డైరెక్టరు గారూ ఇరువురూ సంతృప్తి చెందగలరనే నేను విశ్వసిస్తున్నాను."

ఆయన కొంచెం సేపు ఆలోచించి ఓ చిరునవ్వు నవ్వాడు. అప్పుడు నాతో అన్నాడు—"సరే మంచిది, అయితే మీరు ఒక పని చేయండి. నేను మీ ప్రధానోపాధ్యాయునికి ఓ లెటరు వ్రాస్తాను. ఆయన మిమ్మల్ని తన కార్యక్రమంలో పాల్గొనే పని లేకుండా వదిలేస్తాడు. కాని చూడండీ, ఆయనను మీరు వేధించకండి. పాపం ఆయన పురాతన భావాలు కలవాడు. మీరేమో నూతనోత్సాహంతో వున్న నవ యువకులు. నేను ఉభయులనూ సంబాళించుకోవాలి. ఈ పని ఎంత కష్టమైనదో మీకు తెలియనిది కాదు."

నేను మనసులో అధికారిని ప్రశంసించుకుంటూ అన్నాను—"సరే మంచిదండీ, మరి నాకు సెలవిస్తారా?"

* * * *

ఈ రోజు పాఠశాలలో ఎంతో ఉత్సాహంతో ఏర్పాటులు జరుగుతున్నాయి. ఉన్నతాధికారి గారు వస్తారు! డైరెక్టరు గారు వస్తారు!

చిన్న, పెద్ద ఆఫీసర్లు, గ్రామస్తులు, పిన్నలూ-పెద్దలూ, పిల్లల తల్లి దండ్రులూ, విద్యార్థులూ, ఉపాధ్యాయులూ అందరూ వచ్చేశారు. నా సహోపాధ్యాయుల స్థితి విచిత్రంగా వుంది. వాళ్ళ గుండెలు దడదడ లాడుతున్నాయి. ముఖాలలో అసంతృప్తి వెల్లడవుతూ వుంది. అయినా వాళ్ళ బిగువుతో నిక్కుగా నిలబడటానికి ప్రయత్నిస్తున్నారు. తమ తమ పనులు చేస్తూ వున్నారు. ప్రధానోపాధ్యాయుడు మా పాఠశాలలోని అల్లరి పిల్లల నందరినీ ఓ ప్రక్కకు పిలిచాడు. వాళ్ళను భయ పెడుతూ

చెప్పాడు—"ఒరేయ్ సోమరిపోతులూ చూడండి! ఏ మాత్రమయినా అల్లరి చేశారా రేపు మీ వీపులు పగిలాయను కోండి. మిమ్మల్ని దూది ఏకినట్లు ఏకుతాను తెలిసిందా?"

కర తాళాలతో, మేళ తాళాలతో స్వాగతమిస్తుండగా డైరెక్టరు గారు వచ్చేశారు. సభ ప్రారంభమయింది. ప్రధానోపాధ్యాయుడు పాఠశాల వార్షిక నివేదిక బిగ్గరగా చదివి వినిపించాడు. వినేవాళ్ళకు తాను వణకడం లేదనే విశ్వాసం కలిగించడానికి ప్రయత్నిస్తున్నట్లుగా చదివాడు. మాటి మాటికి నిట్టనిలువుగా నిలబడి నిక్కుతూ చదివాడు. వివరాలు పూర్తిగా చదివే లోపల ఆయన చొక్కా చెమటతో తడిసేపోయింది. ఆయన గొంతు కూడా గరగర లాడింది. నివేదిక పూర్తయ్యాక 'రెసిటేషన్స్' అంటే పద్య పఠనం, పిల్లల సంవాదాలు ప్రారంభమయ్యాయి. పిల్లలు గ్రామోఫోన్‌లాగా పద్యాలు చదువుతున్నారు. వారి వదనాలలో హావ భావాలేవీ కన్పించడం లేదు. వాళ్లు కాళ్ళూ, చేతులూ కదిలిస్తూ అరుస్తున్నట్లే చదువుతున్నారు. కాని విచారం ఏమిటంటే సెలెక్టు చేసిన పద్యాలు సరళమైనవీ, అందమైనవీ, మంచి మంచి కవులు వ్రాసినవే అయినా విద్యార్థులకు మాత్రం అవి అర్థం కానంత కఠినంగా వున్నాయి. పాపం వాటి అర్థం తెలియకుండానే చదివేస్తున్నారు. పైగా అభినయం కూడా వెలగ బెడుతున్నారు. తమ రసికత్వాన్ని వెల్లడిస్తున్నారు. పిల్లల సంభాషణల పరిస్థితి కూడా ఇలాగే వుంది. సంవాదాలెప్పుడూ ఉపదేశాలతో నిండివుంటాయి. పెద్దల నోటవస్తుంటే అందంగా ఉండే ఉపదేశాలు పిల్లల నోటబడి వికారంగా తయారయ్యాయి. ఉపదేశాల ప్రహసనాలు చాలా అసభ్యంగానూ, సిగ్గుచేటుగానూ ఉన్నాయి. నా ఒక్కడికే అలా అనిపించడం కాదు, స్వయంగా డైరెక్టరు గారు కూడా అలాగే భావిస్తున్నట్లు నేను గమనించాను. ఆయన అందుకే ముసిముసి నవ్వులు నవ్వుతున్నారు. నా సహోపాధ్యాయులు తటస్థ భావంతో చూడటానికి



ప్రయత్నిస్తే వాళ్లకూ అలాగే అనిపిస్తుంది.

సభా కార్యక్రమం పూర్తిఅయింది. డైరెక్టరుగారు కృతజ్ఞతను వెల్లడించారు. తమ ఆనందాన్ని తెలియజేశారు. బహుమతులు పంచి పెట్టారు. ప్రధానోపాధ్యాయుడూ, ఉన్నతాధికారీ, తదితరులూ ఆరోజు కార్యక్రమానికి సంతృప్తి పడినట్లుగానే కన్పిస్తున్నారు. డైరెక్టరుగారు మర్యాద సూచకంగా "మీ పాఠశాల కార్యక్రమం నాకు చాలాసంతోషాన్ని కలిగించింది" అన్నారు.

ఇంతలో ఉన్నతాధికారి డైరెక్టరుగారికి విన్నవించారు—"అయ్యా, ఈయన నాలుగవ తరగతి ఉపాధ్యాయుడు. మీకు తన కార్యక్రమాన్ని చూపించాలని కోరుతున్నాడు. ఆ తెరచాటున ఆయనేదో ఏర్పాటు చేశాడు."

డైరెక్టరుగారు చాలా ఔదార్యం ప్రదర్శించారు. వెంటనే చూడటానికి అంగీకారం తెలిపారు. నేను తెర లోపలికి వెళ్ళాను. మూడవ గంటకొట్టి తెర ప్రక్కకు లాగేశాము. మధ్యలో నేను, నాకు సమీపంగా నా విద్యార్థులూ. రోజూ మా క్లాసులో పాడుతున్న ప్రార్థనా గీతమే ప్రార్థన రూపంలో పాడుతూ వున్నాము. క్లాసు గది అంతా ప్రశాంతంగా వుంది. హఠాత్తుగా యీ నాటక ప్రదర్శన యేమిటా అని అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు.

ప్రార్థన తరువాత విద్యార్థులు 'కోర్టుకు వెళ్తాను' అనే పేరుగల నాటకం ప్రారంభించారు. ఒక పిల్లవాడు ఎలుకగా వున్నాడు. నడుముకు ఒక తాడు కట్టుకొని దానిని తోకగా అమర్చుకున్నాడు. తలకు ఓ నల్లటి గుడ్డ కప్పుకున్నాడు. నాలుగు కాళ్ళమీద నడుస్తూ అతడు 'చూం, చూం' అంటున్నాడు. ఒక పిల్లవాడు దర్జీగా, రెండో కుర్రవాడు రంగులు అద్దకం వేసేవాడుగా, మూడో కుర్రాడు ముత్యాల వానిగా, నాలుగోవాడు మృదంగం వాయించే వానిగా, అయిదోవాడు రాజుగా, ఆరోవాడు రాజుగారి సిపాయిగా మారారు. నేను ఆరోవాణ్ణి. రాజుగారి సిపాయిని.

పాత్రధారులందరూ నిత్యం ధరించే సాదా దుస్తులే ధరించి వున్నారు.

రాజు ఠీవిగా టేబులు మీద కూర్చున్నాడు. తలమీద వంకరటోపీ ధరించి వున్నాడు. సిపాయి అంటే నేను మీసాలు దువ్వి వాటిని నిలబెట్టాను. తల పాగ వంకరగా చుట్టుకున్నాను. ఒక చేతిలో కర్రవుంది. మృదంగం వాని దగ్గర మృదంగం వుంది. మిగిలినవాళ్లు వట్టి చేతులతోనే ఉన్నారు.

మా వేదిక చాలా సాదాగా వుంది. తెర గుడ్డమీద కార్యక్రమ మంతా వ్రాసి వుంది. క్లాసు గది శుభ్రంగా ఊడ్చివుంది. నేలమీద ఒక విద్యార్థి ఇంటినుంచి తెచ్చిన దుప్పటి పరచాము. వేదికను అలంకరించడానికి తగిన వస్తువులేవీ పాఠశాలలో లేవు. అయినా రావి కొమ్మలూ, వేప కొమ్మలూ తెచ్చి అక్కడక్కడ వుంచాము. కొమ్మలతో, ఆకులతో గోడలను అలంకరించాము. నేలమీద రంగు రంగుల సుద్ద ముక్కలతో పిల్లలు తమకు తోచిన చిత్రాలు గీశారు. ఎలుక నాటకం ప్రారంభ మయింది. సమాప్తమయ్యింది. పిన్నలూ పెద్దలూ అందరూ ప్రశాంతంగా చూస్తూవున్నారు. విద్యార్థులు చాలా ఆసక్తితో, ఉత్సాహంతో చూస్తూ వున్నారు. పెద్దలుకూడా చాలా ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయారు.

"ఏమిటిది? ఏమిటీ నూతనత్వం? ఏమిటీ నాటక ప్రదర్శన?"

పిల్లలు నాటకాన్ని అందంగా ప్రదర్శించారు. పొరపాట్లు కూడా చేయ లేదు. ప్రాంప్టర్‌ను కూడా పెట్టలేదు. ఎవరయినా కొంచెం పొరపాటు పడబోతే అక్కడికక్కడే నేను దాన్ని సవరించేవాణ్ణి.

రెండవ నాటకంగా 'ముసలమ్మ', మూడవ నాటకంగా 'కుందేలు' ప్రదర్శించాము.

అక్కడ వున్నదల్లా ఒక టేతెర. సీన్ గానీ, సీనరీ గానీ పేరుక్కూడా లేదు. పిల్లలు ఒక్కొక్కప్పుడు తలకు గుడ్డ చుట్టుకునేవాళ్లు. ఒక్కొక్కప్పుడు ఓ కర్ర చేత బుచ్చుకునే వాళ్ళూ. మిగిలిన ఆధారమంతా పిల్లల అభినయమే.

అంతిమ ప్రార్థనతో నాటకాల ప్రదర్శన సమాప్తమయింది. నేను



వేదికమీదికి వచ్చాను. నేను నాటకం మేనేజరు హోదాతో ప్రేక్షకుల ముందు నిలబడ్డాను. వారితో చెప్పాను—"సజ్జనులారా, మా యీ నాట్య ప్రయోగాలను ప్రశాంతంగా చూచినందుకు మేము మీకు మా కృతజ్ఞతాభివందనలు సమర్పించు కుంటున్నాము. ఈ సందర్భంగా మరో విన్నపం చేయదల్చుకున్నాము. అందరూ ఆలకిస్తారని ఆశిస్తున్నాము."

"వీళ్ళు నాలుగవ తరగతి విద్యార్థులు. 'ఈ సందర్భంగా మనం కూడా మన నాటకాలను ఎందుకు ప్రదర్శించ గూడదూ?' అని అడగ్గానే వీళ్లు అందరూ ఎంతో సంతోషంగా అందుకు సిద్ధమయ్యారు. చాలా ఉత్సాహాన్నీ, తత్పరతనూ చూపించారు. వెంటనే నాటకాలను ఎన్నిక చేసుకున్నాము. వీళ్లు చదివిన కథలూ, వినిన కథలే మీ సమక్షంలో ఇప్పుడు నాటకాలుగా అభినయించారు. 'ప్రతివారం మనం ఎటువంటి ఏర్పాటులూ లేకుండా ఎలా నాటకం ప్రదర్శిస్తుంటామో అలాగే ఈసారి కూడా ఎందుకు ప్రదర్శించకూడదూ' అని వాళ్ళతో అన్నాను. మా క్లాసులో దేనినీ కంఠస్తం చేసే పనే లేదు. అలా చేయించేదే లేదు. కథలోని ఇతివృత్తం విద్యార్థులకు బాగా తెలిసే వుంటుంది. కథలో తన కథనమేమిటో ప్రతి పాత్రకూ తెలుసు. కథతో సంబంధం పెట్టుకొనే ప్రసంగానుసారంగా వేదికమీద అందరూ తమ ఇష్టం వచ్చినట్లుగా సంభాషణలు చెపుతారు. ఇందులో ఏ విద్యార్థీ తన పోర్షన్ కంఠస్థం చేయవలసిన అవసరం వుండదు. సీన్, సీనరీ, వేషం ఇవన్నీ నాటకానికి ఉపాంగాలే గాని ప్రధాన అంగాలు కావు. నాటకానికి ప్రధానమైన అంగం అభినయం, భావ ప్రదర్శన. అభినయం మీదా, భావ ప్రదర్శన మీదే మేము ఎక్కువ శ్రద్ధ చూపుతాము. వేష ధారణపై అంతగా శ్రద్ధ చూపించము. అంచేత అభినయం అభివృద్ధి చెందడానికి పూర్తి అవకాశం లభిస్తుంది. ఇప్పుడు ఇక్కడ మీరు చూచిన దానితో మా పద్ధతిని గమనించే వుంటారు. నా విద్యార్థులకు ఇటువంటి కార్యక్రమంలో చాలా ఆనందం కలుగుతుంది. వాళ్ళు దీనిని హృదయ

పూర్వకంగా వాంఛిస్తుంటారు. వాళ్ళను ప్రశంసించ వలసిన అవసరం ఎప్పుడూ రాదు. వాళ్ళకు తమ పనిలో తృప్తి దానంతటదే కలుగుతుంది."

"సజ్జనులారా, ఎంతో ప్రేమతో, ప్రశాంతంగా మీరు యీ నాటక ప్రదర్శనలు చూచినందుకు నేను మళ్ళ తమకు హృదయపూర్వకంగా ధన్యవాదాలు సమర్పించు కుంటున్నాను."

డైరెక్టరుగారి వదనంలో ఆనందం తొణికిసలాడుతూ వుంది. నేను చాలా సేపటి నుంచి ఆ విషయం గమనిస్తూనే ఉన్నాను. ఆయన వెంటనే లేచి ఇలా అన్నారు—

"I cannot but congratulate both the teacher and the taught for the real treat they gave us this afternoon. It was splendid I felt, I was in a new school in my country–England. It was really charming to see little kiddies playing mouse and tailor and king and so forth and so on, all spontaneous and free : All recitation and cramming is a thing of the past. Oh! It is a terrible demon! It is ugly, soul-killing."[1]

ఇలా అని కొంచెంసేపు ఆగి మళ్ళ ప్రారంభించారు—

"I again say, I am very happy to see this. I won't

1. "శ్రీ లక్ష్మీశంకర్, వారి విద్యార్థులూ యీ సాయంత్రం మన మనస్సులకు యదార్థమైన ఆనందాన్ని కలుగజేశారు. అందుకు నేను వారిని అభినందిస్తున్నాను. వారి కార్యక్రమం నిజంగానే అందంగా వుంది. నేను నా మాతృభూమి యైన ఇంగ్లాండులో వున్నానా అనిపించింది. ఈ చిన్న చిన్న పిల్లలు స్వయంస్ఫూర్తితో ఎలుకగా, దర్జీగా, రాజుగా అభినయించిన దృశ్యం అద్భుతంగా ఉందనడంలో సందేహం లేదు. 'రెసిటేషన్', అతిగా వల్లించి చెప్పే సంభాషణల కాలం గతించి పోయింది. ఇవి నిజంగా క్ర్రూరమైనవీ, అసభ్యమైనవీ, ఆత్మను చంపేసేవీ."



give them prizes. The genuine pleasure they felt while acting, is a greater and better reward than anything else. I am very glad indeed, very, very glad."[1]

సమావేశం ముగిసింది. అందరూ తమ తమ ఇళ్ళకు వెళ్ళి పోయారు.

ఉన్నతాధికారిగారి సంతోషానికి మేరలేదు. ఆయన నన్ను డైరెక్టరు గారికి పరిచయం చేశాడు. నా ప్రయోగాన్ని గురించి కూడా ఆయనకు వివరించాడు. డైరెక్టరుగారు నాకు షేక్‌హాండ్ ఇస్తూ అన్నారు—

"Bravo! you are success! Go on with your experiments. This is something! Rest is sham and bosh!"[2]

డైరెక్టరుగారి యీ మాటలు ఉన్నతాధికారి మనసులో ఎంతగా గిలిగింతలు పెట్టివుంటాయో, అవి ఆయనకు ఎంత గర్వాన్ని కలిగించి ఉంటాయో మీరే స్వయంగా ఆలోచించుకోండి. నేనెటూ సంతోషంగానే ఉన్నాననుకోండి!

నేను ఇంటికి వెళ్ళాను. నిజంగా నేనీరోజు యెంతో ఆనందంలో మునిగిపోయాను. డైరెక్టరుగారు షేక్‌హ్యాండ్ ఇవ్వడం, నన్ను ప్రశంసించడం నా ఆనందానికి ఒక కారణమైతే కావచ్చు కాని అసలైన కారణం

1. "నేను మళ్ళ చెపుతున్నాను, ఈనాటి యీ కార్యక్రమం చూసి నాకు చాలా ఆనందం కలిగింది. ఇందుకు నేను బహుమతి ఇవ్వను. నాటకం అభినయిస్తున్న సమయంలో పిల్లలకు కలిగిన యథార్థమైన ఆనందమే వాళ్ళకు నిజమైన బహుమతి. నిజంగా ఈరోజు నేను చాలా సంతోషంగా ఉన్నాను."

2. "శాభాష్! మీరు మీ కార్యక్రమంలో విజయం సాధించారు. ఇలాంటి ప్రయోగాలు వరుసగా చేస్తూ వుండండి. వాస్తవమైన విద్య ఇందులోనే వుంది. మిగతావన్నీ దగా కోరువి, నిరుపయోగమైనవి!"

ఏమిటంటే ఈనాడు నా ప్రయోగాలు గౌరవించ బడ్డాయి. డైరెక్టరుగారు ఒక పొలిటికల్ ఆఫీసరుగదా, ఆయనకు కొత్త పద్ధతిలో నడిచే పాఠశాలకు సంబంధించిన అన్ని విషయాలూ ఏమి తెలుసులే అనుకున్నాను. కాని ఆయన తన కుమారుణ్ణి చదువుకోసం యూరప్‌లో అత్యంత అధునాతన మైన పాఠశాలలో చేర్పించాడని తరువాత తెలిసింది. అంచేతనే ఆయన నవీన విద్యను, నవీన బోధనా పద్ధతులను అంతగా ప్రేమిస్తున్నాడు.

చీకటి పడిన తరువాత నలుగురైదుగురు నా సహోపాధ్యాయులు నన్ను కలిసికొనడానికి వచ్చారు. వాళ్ళు నన్ను 'డైరెక్టరుగారు ఏమి చెప్పారు, ఏమి చెప్పలేదు' అని అడుగుతూ ఉండగానే 'నన్ను తన యింటికి వచ్చి కలుసుకో వలసినదిగా ఉన్నతాధికారి లెటరు పంపించారు. నేను ఆయన ఇంటికి వెళ్ళిపోయాను.

ఉన్నతాధికారి ఈరోజు చాలా సంతోషంగా కన్పిస్తున్నారు. డైరెక్టరుగారు కూడా పాఠశాలలోని కార్యక్రమం చూచి చాలా సంతోషం వెల్లడించారు! వెళ్ళగానే ఆయన నాకు కుర్చీ యిచ్చాడు. ఆయన ఓ పడక కుర్చీలో కూర్చున్నాడు. ఆయన అన్నాడు—"బ్రదర్, మీరు నాకు యీ సంగతి చెప్పండీ! నాటకంలోని సంభాషణలు పిల్లలు వల్లించారా లేదా?"

నేనన్నాను-"అయ్యా, వాళ్ళ కార్యక్రమం చూశాక మీకేమని పించింది? మీ మనసు మీద దాని ప్రభావం ఎలావుంది?"

ఉన్నతాధికారి అన్నాడు-"నేను చాలా సంతోషించాను. నాకెంతో ఆనందం కలిగింది. కాని పిల్లలు ఇదంతా ఎలా జ్ఞాపకం పెట్టుకో గలిగారు? వాళ్లు చాలా బాగా సంభాషణలు చెప్పారు."

నే నన్నాను- "మీరు నిజం చెబుతున్నారు. నేను వాళ్ళకు కథలు వినిపించాను. ఆ కథలు వాళ్ళకు బాగా నచ్చాయి. కథలోని పాత్రల మనో భావాలలో లీనమైపోయారు. ఏ విషయాలను వాళ్ళు వాస్తవంగా తమవిగా స్వీకరించారో వాటినే తమ పద్ధతిలో వెల్లడిస్తున్నారు."



అధికారి అన్నాడు-"కాని వాళ్ళకు అభినయం ఎవరు నేర్పారు?"

నేనన్నాను-"ఎవరు నేర్పుతారు? మేము ప్రతివారం నాటకాన్ని అభినయిస్తూ ఉంటాము. అందులో స్వయంగా నేను కూడా పాల్గొంటూ ఉంటాను. పిల్లలు సరేసరి! నేను నా పాత్ర యొక్క హావ భావాలను వాళ్ళ ముందు ప్రదర్శిస్తూ వుంటాను. పిల్లలు కూడా తమ తమ పాత్రల హావ భావాలను వెల్లడిస్తూ ఉంటారు.

అధికారి అన్నాడు-"కాని అది ఎలా సాధ్యమవుతుందో నాకు మాత్రం అర్థం కావడం లేదు."

నేనన్నాను-"అయ్యా, విద్యార్థుల కళ్ళు ఎప్పుడూ తెరచుకొనే ఉంటాయి. వాళ్ళు తమ నిత్య జీవితంలో దర్జీనీ, వడ్రంగినీ, కమ్మరినీ, కుమ్మరినీ, ఎలుకలనూ, పిల్లులనూ, ఇలాగే ఎందరినో, ఎన్నిటి నోచూస్తూ వుంటారు గదా! వారి మాటలను వింటూ వుంటారు. వాటి చేష్టలను గమనిస్తూ వుంటారు. పోతే కథలలో వాళ్ళకు, వాటికి సంబంధించిన వర్ణనలు కూడా పిల్లలు వింటూ వుంటారు. భగవంతుడు వాళ్ళకు కల్పనా శక్తి నిచ్చాడు. అంచేత అనుభవాన్నీ కల్పననూ సమన్వయ పరచుకొని అభినయిస్తూ ఉంటారు. వాళ్ళకు తోచిన విధంగా చేస్తూ ఉంటారు. వాళ్ళకు వాళ్ళే స్వయం పరీక్షకులుగా తయారవుతారు. అనుభవాన్నీ, కల్పననూ జోడించుకొని వేదిక మీద దానిని ఎలా వ్యక్తం చేయవచ్చునో చూసుకుంటారు."

ఆయనన్నాడు—"ఈ విషయాలు చాలా గంభీరమైనవీ, కఠిన మైనవీ!"

నేనన్నాను—"అవునండీ! పిల్లలకు యీ విషయాలను గురించిన పరిజ్ఞానం వుండదనుకోండి. నేను వాళ్ళ కార్యక్రమాలను విభజించి మీకు వివరిస్తున్నాను."

అధికారి అన్నాడు-"బాగావుంది. **I see.** (నేను అర్థం చేసు

కున్నాను) బ్రదర్, నిజంగా యీ రోజు మీరు అద్భుతమైన నైపుణ్యాన్ని ప్రదర్శించారు. డైరెక్టరుగారు కూడా మెచ్చుకున్నారు, చాలా సంతోషించారు."

నేనన్నాను—"వారు సంతోషించక పోయినా మా నాటక కార్యక్రమం కొనసాగుతూనే వుంటుంది."

అధికారి అన్నాడు—"మీ యీ ప్రయోగాలను గురించి నాతో యెన్నడూ అనలేదు. బహుశా మీ ప్రధానోపాధ్యాయునికీ, ఇతర ఉపాధ్యాయులకు కూడా తెలియదేమో!"

నేనన్నాను—"నిజం. నేను ఎన్నడూ యీ ప్రయోగాలను గురించి వారితో చర్చించ లేదు. ఆయన దృష్టిలో యీ ప్రయోగాలన్నీ పనికి మాలినవి. వాళ్ళందరూ ఆరు నెలల పరీక్షలకు కోర్సు పూర్తి చేయడంలో నిమగ్నమై వున్నారు."

అధికారి అన్నాడు—"వాళ్ళకు పత్తా కూడా తెలియకుండా ఇదంతా ఎలా తయారు చేసుకొచ్చారు?"

నే నన్నాను—"మేము ప్రతి వారం అలా దూరంగా షికారుకు వెళ్ళుతూ ఉంటాము. అక్కడే ఆటల రూపంలో ఇవన్నీ చేస్తూ వుంటాము. నేను ఓ దుప్పటి తీసికొని వెళ్ళేవాణ్ణి. దానినే తెరగా ఉపయోగించుకొనే వాళ్ళం. ఇద్దరు పిల్లలు దాన్ని చెరోవైపు పట్టుకొని నిలబడే వాళ్ళు. దానికి ఇటువైపు చూసే వాళ్ళూ, అటువైపు ఆడే వాళ్ళు! అంతే!"

అధికారి అడిగాడు-"నిజంగానా?"

నేనన్నాను-"అవునండీ!"

అధికారి—"చాలా బాగుంది యీ పద్ధతి. అయితే ఇక ముందు నేను కూడా పాఠశాలల క్లాసుల్లో నాటక కార్యక్రమాన్ని చేర్చుతాను. డైరెక్టరు గారికి ఇది బాగా నచ్చింది. నిజంగా మీ పిల్లలు నాటకాన్ని చాలా చక్కగా అభినయించారు. రెసిటేషన్ గొడవను తీసేస్తే మాత్రం నష్టమేముంది?"



నే నన్నాను-"అయ్యా, నా ఉద్దేశ్యం కూడా అదే. తరువాత మీ యిష్టం. ఏమయినా చేయండి!"

అధికారి అన్నాడు-"అవును, నేను ఇదే చేస్తాను. డైరెక్టరుగారు కూడా **'Be damned cramming'**[1] అన్నారు. **yes, I also remember my days of cramming.**[2] అయితే నేను బాల్యం నుంచీ కొంచెం చురుకైన వాణ్ణిగా వుండడం చేత వల్లె వేయడం నా కంత కష్ట మని పించలేదను కోండి. మిగిలిన విద్యార్థులు మాత్రం పాపం వల్లె వేసి, వేసి, రుబ్బి, రుబ్బి చచ్చిపోయే వాళ్ళనుకోండి! **Be damned cramming.**"

నేను లోలోపల చిరునవ్వు నవ్వు కున్నాను. నేను ఆలోచించాను, ఈ రోజు డైరెక్టరు గారి రాక నాకు చాలా బాగా ఉపయోగ పడింది. నా ప్రయోగాలలో ఈ రోజు అనుభవం చాలా ప్రాముఖ్యం గలదీ, విలువైనది. ఆలోచిస్తూ ఇంటికి వెళ్ళాను. ఆ తరువాత నిద్రపోయాను.

## 2

ఆరు మాసాల పరీక్షలు దగ్గర కొచ్చాయి. ఇతర క్లాసుల్లో వెనుకటి పాఠాల పునశ్చరణం జరుగుతూ వుంది. చరిత్ర, భూగోళం, గణితం, భాష మొదలైన విషయాలను వల్లె వేయించడం జరుగుతూ వుంది. వాళ్ళ ఆరు మాసాల అభ్యాసం ఒకసారి పూర్తి అయిపోయింది. నా బండి మాత్రం ఇంకా కొన్ని కోసుల దూరంలో వుంది. పరీక్షల దృష్టితో ఆలోచిస్తే నేను చాలా వెనుకబడే వున్నాను. అయినా నేను కూడా నా క్లాసు విద్యార్థుల చేత పరీక్ష ఇప్పించవలసి వుంది.

నాకు పునశ్చరణతో కాలం గడప వలసిన పని లేదు. ఆ కాలం

1. అతిగా వల్లించడం పూర్తిగా నశించి పోవాలి!
2. అవును, నేను వల్లించిన రోజులు కూడా ఇప్పటికీ నాకు జ్ఞాపకం వున్నాయి.

నాకు మిగులుతుంది. నా బోధన చివరిదాకా కొనసాగుతూనే వుంటుంది. నా క్లాసులో బోధించబడిన విషయాలను విద్యార్థులే స్వయంగా పునశ్చరణం చేసుకుంటారు. విద్యార్థులు తాము చదివిన విషయాలను స్వయంగా పునశ్చరణం చేసుకొనే ప్రణాళికలు తయారు చేశాను. ఉదాహరణకు అంత్యాక్షరి మొదలైన ఆటల్లో పద్యాలను అనేకసార్లు పునశ్చరణం చేసుకుంటారు.

అయితే ఇంత వరకు నేను భూగోళం, విజ్ఞాన శాస్త్రం, వ్యాకరణం ముట్టుకో లేదు. ఇప్పుడు వ్యాకరణం ప్రారంభించుదా మనుకుంటున్నాను. వ్యాకరణం కఠినమైన విషయంగా భావించబడుతూ వుంది. పైగా యీ విషయంలో విద్యార్థులకు సహజంగానే అభిరుచి వుండదు. నాలుగవ తరగతి విద్యార్థులకు భాషలోని పద విభజనలో, పద పరిచయంలో ఆనందం ఏమి వుంటుంది? ఇందులో వాళ్ళకు ఆనందం కలిగించే రసాత్మకనమై తత్వం ఏముంది? వాళ్ళ జీవితానికి ఉపయోగ కరమైన జ్ఞానాన్ని కలుగ చేసే వస్తు వేమున్నది? 'ఆహా! ఎంత ఆనందంగా వుంది యీ ఘటన' అని విద్యార్థులు భావించే ఘటనా స్థలాలు అందులో ఏమి వున్నాయి? అయితే వ్యాకరణం మాత్రం చాలా ఉపయోగకరమైనదే. అది భాషలో అభిరుచి కలిగి వుండే పై క్లాసుల విద్యార్థులకు ఉపయోగకరంగా ఉంటుందని నా అభిప్రాయం. ప్రాథమిక పాఠశాలలో మాత్రం వ్యాకరణాన్ని తొలగించ వలసిందే. నేర్చుకొనడానికి కఠినంగా వున్న విషయాన్ని, నేర్చుకుంటూ, నేర్చుకుంటూ విద్యార్థులు విసుగుజెందే విషయాన్ని ఎందుకు బోధించాలి? ఇటువంటి నీరసమైన, నిరుపయోగమైన విషయాన్నే బోధిస్తూ కూర్చోడానికి, జ్ఞానానికి సంబంధించిన ఇతర విషయాలు (బోధించడానికి) లేక పోయాయా?

కాని నాకు మాత్రం యీ ప్రయోగం అనివార్య మైనది. నా షరతు ప్రకారం కనీసం పరీక్షల నాటి కయినా నేను యీ విషయం కూడా



విద్యార్థులకు బాగా నేర్పడం అవసరం. తాత్వికమైన ఆలోచన కారణంగా ఆచరణలో యీ విషయాన్ని నా ప్రయోగాలకు దూరంగా ఉంచడం ఉచితమైన పని కాదు. ఇప్పటి నాలుగవ తరగతిలో కూడా ఈ విషయం (వ్యాకరణం) ఎంత బాగా నేర్పవచ్చునో నేను రుజువు చేయ వలసివుంది.

నేను వ్యాకరణం కోర్సు చదివాను. దాని పద్ధతి ప్రకారం నేను పోదలచుకోలేదు. నామ వాచకాలు, సర్వనామాలు, క్రియా పదాలు మొదలైన వాటి నిర్వచనాలను వల్లె వేయిస్తే కోర్సు ఎంత త్వరగా పూర్తి అవుతుందో అంత త్వరగా వాళ్ళకు అర్థం మాత్రం కాదు. బాల్యంలో నాకు వ్యాకరణం బోధించినప్పుడు కూడా అర్థమయ్యేది కాదు. కేవలం వల్లెవేసి గుర్తుపెట్టుకొనే వాణ్ణి. నేను వ్యాకరణం బాగా అర్థం చేసుకొన్నానని ఉపాధ్యాయులు భ్రమ పడేవాళ్ళు. ప్రస్తుతం అమలులో వున్న విధానానికి నేను ఒక నమస్కారం పెట్టడమే ఉచితమనుకున్నాను. ఇప్పుడు వ్యాకరణం ఏ పద్ధతితో బోధించాలీ అనే ప్రశ్న ఉదయిస్తుంది. ఆ పద్ధతిని గురించి నేను ఆలోచించాను. ప్రణాళికను కూడా తయారు చేసుకొన్నాను. దాని ప్రకారం పనిచేస్తున్నాను. నిజంగా ఆ పద్ధతి విద్యార్థులకు చాలా ఆనందాన్ని కలిగించింది. వాళ్ళకు అది కూడా ఒక మంచి ఆట అయిపోయింది. రెండు మాసాలలో వాళ్ల నామవాచకం, సర్వనామం, విశేషణం, క్రియాపదాలు, అవ్యయాలు గుర్తించి, వాక్యాల నుంచి వాటిని వేరుచేసి చూపించడం నేర్చుకున్నారు. ఏకవచనం, బహు వచనం, స్త్రీలింగ, పుంలింగ భేదం కూడా అర్థం చేసుకున్నారు. కర్త, కర్మలను బోధపరచడానికి తగిన ప్రణాళికను గురించి ఆలోచిస్తూ వున్నాను. మధ్యలో ఒకరోజు నా క్లాసులో వ్యాకరణం ఆట జరుగుతూ ఉండగా అకస్మాత్తుగా డెప్యూటీ డైరెక్టరు గారు వచ్చారు. ఆయన నా పని చూసి ఆశ్చర్యపోయాడు. ఆయన అన్నాడు—"ఏమిటండీ, పిల్లల నింకా అట్టముక్కలతోనే ఆడిస్తున్నారు? ఆరుమాసాల పరీక్షలు దగ్గరకు

వస్తున్నాయి. కొంచెం చురుకుగా పనిచేయాలి. చూడండి, మనం పరాజితులం కాకూడదు. మీరు మీ ప్రయోగాలలో సఫలీకృతులు కావాలి. విజయం సాధించి చూపించాలి. జ్ఞాపకం ఉంచుకొనండి!"

నేను నవ్వుతూ అన్నాను—"అయ్యా, ఆ విషయం ఎప్పుడూ నా మనసులో మెదలుతూనే ఉంటుంది. వీళ్ళు వ్యాకరణం ఆటలు ఆడుతున్నారు. మీరు వ్యాకరణంలో నా విద్యార్థులను కొంచెం పరీక్షించి చూడండి!"

ఆయన విద్యార్థులను నాలుగైదు ప్రశ్నలు అడిగి చూశారు. తరువాత నాతో అన్నారు—"ఓహో! ఈ పని చాలా బాగున్నదే! మీరు నాకు యీ ప్రణాళిక అంతా వివరించాలి. మీరు ఇంత ఉత్సాహంతో విద్యార్థులకు అభిరుచి కలిగేటట్లుగా వ్యాకరణం బోధించగలుగుతున్నారు! అయితే అన్ని క్లాసుల్లోనూ ఇదే పద్ధతిలో వ్యాకరణం ఎందుకు బోధించ కూడదు? రేపు సెలవుగదా! మీరు ఒకసారి మా యింటికి రండి! మీరు ఏయే సాధనాలతో ఏమేమి చేశారో నాకు వివరించండి!"

* * * * *

మరుసటి రోజు నేను వ్యాకరణానికి సంబంధించిన సామగ్రి అంతా తీసికొని ఉన్నతాధికారి ఇంటికి వెళ్ళాను. ఆయనకు నా ప్రణాళికను గురించి యీ విధంగా వివరించాను—

"అయ్యా, చూడండి! ఇది నా మొదటి సాధనం. ఈ అట్ట ముక్క మీద ఒకవైపు పురుషవాచక శబ్దాలు, రెండోవైపు స్త్రీ వాచక శబ్దాలు వ్రాసివున్నాయి. పైన పుంలింగం, స్త్రీలింగం అని కూడా వ్రాశాను. చూడండి, యీ అట్టముక్కల మీద నియమ బద్ధంగా వుండే స్త్రీ వాచక శబ్దాలూ ఆ అట్టముక్కల మీద నియమ బద్ధం కాని స్త్రీ వాచక శబ్దాలూ వున్నాయి. ఈ అట్టముక్కలను చదువుకొనడానికి విద్యార్థులకు ఇస్తాను. ఇది నా మొదటి పని. వాళ్ళు వీటిని చదువుతారు. వాళ్ళకు ఎన్ని అట్ట



ముక్కలు ఇస్తానో అన్నీ చదువుతారు. ఈ విధంగా వాళ్ళకు లింగ వాచక శబ్దాల పరిచయం కలుగుతుంది. అట్టముక్కల మీద నేను స్త్రీ వాచక, పురుష వాచక అని వ్రాశాను. దీనితో శబ్దాల లింగ భేదాన్ని గురించిన ఆలోచన వాళ్ళ మనసుల్లో మెదులుతుంది. అయితే ఆరంభంలో దీనితో కేవలం లింగవాచక శబ్దాల పరిచయం మాత్రమే పొందగలుగుతారు."

ఇదంతా అయిన తరువాత ఒకరోజు నేను వాళ్ళను అడిగాను—"అబ్బాయిలూ, చెప్పండి, ఎద్దు ఆడదా మగదా?"

"మగదే." నన్నారు.

"మరి ఆడదాన్ని ఏమంటారు?"

"ఆవు."

"ఎద్దుకు స్త్రీ లింగ శబ్దం ఏమిటి?"

"ఆవు."

నేను అడిగే వాటికి స్త్రీ లింగ శబ్దాలు చెప్పండి అని మళ్ళీ అడిగాను—

"బాలుడు?"

"బాలిక."

"ముసలివాడు?"

"ముసలిది."

"దున్న?"

"గేదె."

"హంస?"

"హంసి."

"పురుషుడు?"

"స్త్రీ."

"భర్త?"

"భార్య."

నా యీ ప్రణాళిక బాగా సఫలమయింది. తొలి పరిచయంతో వాళ్ళ మనసుల్లో ఆలోచన మేల్కొన్నది. ఇప్పుడు శబ్ద పరిచయంతో వాళ్ళ జ్ఞానం కూడా మేల్కొన్నది.

ఉన్నతాధికారి—"సరే బాగానే వుంది. ఇక తరువాత విషయం చెప్పండి."

నేను—"దీని తరువాత నేను 'వచనం' తీసుకున్నాను. ఏకవచనం, బహువచనం. ఇవి కూడా ఆ పద్ధతితోనే నేర్పాను."

ఉన్నతాధికారి—"ఏమిటి మీరనేదీ? దీని కోసం కూడా ఆటలే ఆడిస్తున్నారా?"

నేను—"అవునండీ, ఏకవచనం వాడు బహువచనాన్ని వెతికి తెస్తాడు. దాని సరసన వుంచుతాడు."

ఉన్నతాధికారి—"ఇదీ బాగానే వుంది. అయితే యీ సంగతి చెప్పండి, నామవాచకాలూ, క్రియా పదాలూ మొదలైనవి ఎలా నేర్పారు?"

నేనన్నాను—"అయ్యా, చూడండి. మొదట నేను క్రియా పదాలు తీసుకొన్నాను. విద్యార్థులకు చదవడం వచ్చుగదా! నేను వాళ్ళకు వివరించాను—'నేను బోర్డు మీద ఏ మాట వ్రాస్తే ఆ పని మీరు చేయండి. నేను క్రియను వ్రాస్తాను. మీరు క్రియను చేయండి. నేను ఎవరి వైపు సౌంజ్ఞచేస్తే వాళ్ళే చేయాలి'."

నేను బోర్డు మీద వ్రాశాను- లే, కూర్చో, పరుగెత్తు, నిద్రపో, చదువుకో, రాయి, ఎగురు, దుముకు, ఆడు, పాడు-మొదలైనవి.

ఈ క్రియలన్నీ చేస్తూ వుంటే పిల్లలకు చాలా ఆనందం కలిగింది. వాళ్ళన్నారు—'ఇంకా వ్రాయండి'. నేను అటువంటి శబ్దాలు ఆలోచిస్తూ, వ్రాస్తూ వున్నాను. వాళ్ళు ఆ క్రియలు చేస్తూ వచ్చారు. మరుసటి రోజు



నేను కార్డుమీద 'కొన్ని క్రియా పదాలు'—లే, కూర్చో, పరుగెత్తు, పోట్లాడు, మాట్లాడు-మొదలైనవి వ్రాశాను. అందరూ చదివారు-'కొన్ని క్రియా పదాలు'. మూడో రోజు నేను ఒక అట్టపెట్టె తెచ్చాను. దానిమీద క్రియా పదాలు అని వ్రాశాను. పిల్లలు పెట్టె తెరచారు. అందులో నుంచి క్రియా పదాలు ఎత్తుకున్నారు-పరుగెత్తు, క్రిందపడు, కొట్టు, నెట్టు, ఆడు, పాడు-మొదలైన క్రియాపదాలు చదువుతూ ఆ క్రియను చేస్తూపోయారు. తరువాత నేను 'చూడండీ, ఇప్పుడు మీరు కొన్ని క్రియాపదాలు వ్రాసి తీసికొనిరండి' అని చెప్పాను. వాళ్లు కొన్ని క్రియాపదాలు వ్రాసి చూపించారు.

నేను మరో ఆట ప్రారంభించాను. వాళ్ళతో చెప్పాను-'చూడండీ, నేను ఒకణ్ణి ఏదో పని చేయమని చెపుతాను. అతడు ఆపని చేస్తాడు. మీరు అతడు ఏమి చేస్తున్నదీ చెప్పి నాచేత బోర్డు మీద వ్రాయించాలి.' నేను జగజీవన్‌తో 'పరుగెత్తు' అన్నాను. అతడు పరుగెత్తాడు. నేను అడిగాను-'జగజీవన్ ఏం చేస్తున్నాడు?' ఒకడు చెప్పాడు-'పరుగెత్తుతున్నాడు'. రెండోవాణ్ణి అడిగాను – 'జగజీవన్ ఏం చేస్తున్నాడు?' 'జగజీవన్ పరుగెత్తుతున్నాడు' అని చెప్పాడు. తరువాత నేను కొందరు పిల్లలను 'పరుగెత్తు, దూకు, చదువు, రాయి, అని ఆదేశించాను. వాళ్ళు ఏమి చేస్తున్నదీ బోర్డు మీద వ్రాయమన్నాను. వాళ్లు తప్పులు లేకుండా బాగానే వ్రాశారు. కాని కొద్ది మంది అర్థం చేసుకోలేనివాళ్లూ, వ్రాయలేని వాళ్లూ వున్నారు. ఒకడు అక్కడక్కడ తప్పుగా కూడా వ్రాశాడు.

నేను ఈ విధంగానే మళ్ళీ చెప్పాను—"ఇప్పుడు మీలో ఎవరు ఏ పని చేస్తున్నారో దానిని కూడా వ్రాయండి."

నేను జగజీవన్‌తో 'పరుగెత్తు' అన్నాను. అతడు పరుగెత్తాడు. పిల్లలు 'పరుగెత్తాడు' అని వ్రాశారు. ఇలా ఆటలు సాగుతూవున్నాయి. నేను పిల్లలకు వాళ్ళల్లో వాళ్ళు ఆటలు ఆడుకొనడానికి, అవి వ్రాసుకొన

డానికి స్వేచ్ఛను ఇచ్చేశాను. చాలా ఉత్సాహంతో వాళ్లు రోజంతా ఆడుతూ వుండేవాళ్ళు.

ఆ తరువాత ఒక రోజు నేను వాళ్ళందరినీ కూర్చోబెట్టి అడిగాను— "రాముడు పరుగెత్తుతూ వున్నప్పుడు పరుగెత్తటం అనే క్రియను చేస్తున్నాడు కదా?" వాళ్లు చెప్పారు-'అవునండీ.' "శ్యామ సుందర్ వ్రాస్తున్నప్పుడు ఏ క్రియను చేస్తున్నాడు?" "వ్రాయటం అనే క్రియను చేస్తున్నాడు." ఈ రకంగా వాళ్ళను ప్రశ్నించడం ప్రారంభించాను. శ్యామసుందర్ పరుగెత్తుతున్నప్పుడు ఏ క్రియను చేస్తున్నాడు?" అని అడిగాను. వాళ్ళు సరయిన సమాధానమే చెప్పారు. తరువాత నేను బోర్డు మీద వ్రాశాను—"పరుగెత్తుతున్నాడు-పరుగెత్తు; మాట్లాడుతున్నాడు-మాట్లాడు; నడుస్తున్నాడు—నడువు; మొదలైనవన్నీ క్రియాపదాలు. వీటితో మనం ఏదయినా పని చేయవలసి వుంటుంది.

పిల్లలు దీనిని చదివారు. అర్థం చేసుకున్నారు.

ఉన్నతాధికారి అడిగాడు—"తరువాత మీరు ఏం చేశారు?"

నేను చెప్పాను—"అయ్యా, నేను విద్యార్థులతో 'మీకు జ్ఞాపకం వున్న క్రియా పదాలు వ్రాసుకొని రండి' అన్నాను. పిల్లలంతా వెంటనే ఎక్కడ ఏ క్రియాపదం దొరికితే అక్కడ ఆ పదాన్ని తీసికొని వ్రాసేశారు."

ఉన్నతాధికారి—"తరువాత?"

"తరువాత నేను మరో ఆట ప్రారంభించాను. బోర్డుమీద కొన్ని వాక్యాలు వ్రాశాను-రాముడు పరుగెత్తుతున్నాడు. చంపక్ చదువుతున్నాడు-మొదలైనవి. వీటిలో క్రియాపదాలను ఉండనిచ్చి మిగతా వాటిని చెరపమన్నాను. పిల్లలు ఆ పని సరిగానే చేశారు. అంతే! నేను క్రియా పదాల పాఠాన్ని ఆపివేశాను.

ఉన్నతాధికారి—"ఈ పద్ధతిలో వాళ్ళకు తప్పకుండా జ్ఞాపకం



వుంటుందనే నా అభిప్రాయం. కాని యిలా చేయడంలో వాళ్ళకు సమయం ఎక్కువ తీసుకుంటూ వుందనుకుంటాను. వాళ్లు అనేక ఆటలు ఆడవలసి వస్తున్నది."

నేను—"ఆటలు ఆడటంలోనే పిల్లలకు ఆనందం కలుగుతుంది. మంచి ఫలితమూ, స్థిరమైన ఫలితమూ కలుగుతున్నప్పుడు కాలం కొంచెం ఎక్కువ తీసుకుంటే మాత్రం నష్టం ఏమిటంటారు?"

ఉన్నతాధికారి—"మీరు చెప్పేది నిజమే. సరే నామవాచకాల విషయంలో మీరు ఏం చేశారు?"

నేనన్నాను-"అయ్యా, నామవాచకాల బోధన కూడా నేను యీ విధంగానే ప్రారంభించాను. ముందు నా పద్ధతి ప్రకారం నేను నామవాచకాల అట్టముక్కలు తయారుచేశాను. నామవాచకం, నామవాచకం-నామవాచకం! పిల్లలు చాలా నామవాచక శబ్దాలు చదివేశారు. అనేక సార్లు చదివేశారు. నామవాచకాల పట్టికలో వివిధత్వం కూడా బాగానేవుంది. ఈ వివిధ రకాల పేర్లు ముఖ్యమైన సమూహాలుగా విభజించేటట్లు చేశాను. దీనితో వాటిని చదవడం అందరికీ ఆనందంగానే వుంది. విద్యార్థులకు తెలియకుండానే వాళ్ళకు నేను యీ విషయాలు నేర్పవలసివుంది. ఇప్పుడు వాళ్ళు క్రియాపదాలు, నామ వాచకాల అట్టముక్కల నుంచి నామవాచకాలను వేరు చేయడం ప్రారంభించారు. ఈ విధంగా రెండు వర్గాలను వేరుచేయగల జ్ఞానం స్థిరపడుతూ వుంది. ఒకసారి వాళ్ళందరినీ సమావేశపరచి చెప్పాను—"చూడండి, నేను ఇప్పుడు మిమ్మల్ని ఒకటి కోరతాను. ఏమి కోరేదీ చెప్పను. పేరు కలిగి నటువంటిదీ, ఏదో ఒక పేరుకలిగి వున్నటువంటి ఏ వస్తువైనా సరే కనిపిస్తే దానిని మీరు తీసికొని రండి. ఎత్తుకు రండి. వెళ్ళి నీ పేరేమిటని అడగండి. దానికేదయినా పేరు వుంటే దానిని తీసుకొని రండి."

పిల్లలు వెంటనే అర్థం చేసుకున్నారు. గబగబా పరుగెత్తారు. బోర్డును

అడిగారు-'నీ పేరేమిటి?' 'బోర్డు' అని వాళ్ళే స్వయంగా సమాధానం చెప్పుకున్నారు. 'అయితే పద' అన్నారు. బోర్డును ఎత్తుకొచ్చారు. ఇదే విధంగా టేబులు తెచ్చారు. రాయి, రప్ప, కర్ర, కడవ, దుమ్ము, ధూళి, పలక, బలపం, కాగితం, పెన్సిలు, కలం, సిరాబుడ్డి మొదలైనవాటిని దొరికిన వాటినన్నిటినీ తెచ్చి ఒకచోట పెట్టారు. ఒకడు ప్రక్క క్లాసులోని ఒక విద్యార్థిని కూడా ఎత్తుకొచ్చాడు. నేను అడిగాను—"ఏమిటి ఈ పని చేశావు?" అతడన్నాడు—'అయ్యా వీడికి పేరు వున్నది గదా!' ఒకడన్నాడు-'అయ్యా, సూర్యుణ్ణి ఎలా తెచ్చేది?' మరొకడన్నాడు-'అయ్యా, వేపచెట్టును తీసికొని రాలేముగదా!' వీళ్ళకు నామవాచకమంటే అర్థమయిందని ఇప్పుడు నాకు విశ్వాసం కలిగింది.

క్లాసులో యీ ఆట సాగుతూవుండగానే మధ్యలో నేను నామవాచకాల అట్టముక్కలు గల పెట్టె తెచ్చాను. పైన వ్రాశాను—'పేర్ల పెట్టె'. దానిలో అయిదు వందల పేర్లు ఉన్నాయి. అన్నీ పేర్లే! పిల్లలకు ఇప్పుడు అల వాటయిపోయింది. పెట్టె తెరచి వాళ్ళు గుప్పెడు గుప్పెడు పేర్లు ఎత్తుకు పోయారు. వాటిని చదివేశారు. తరువాత నేను నామవాచకాలూ, క్రియా పదాలూవున్న పెట్టెలను కలిపేశాను. నామవాచకాలనూ, క్రియాపదాలనూ వేరు చేయమని వాళ్ళతో చెప్పాను. వాళ్ళ ఆనందం అంచులు దాటింది. అప్పటికి వాళ్ళు నామవాచకం, క్రియాపదం అంటే ఏమిటో వాళ్ళ మనస్సుల్లో స్థిరపడిన భావాన్ని చక్కగా వ్యక్తం చేయగలుగు తున్నారు. తరువాత నేను మరో ఆట చెప్పాను-క్రియా పదానికి తగిన నామవాచకాన్నీ, నామవాచకానికి తగిన క్రియా పదాన్నీ వెతకండి! ఉదాహరణకు 'గుర్రము' అనే శబ్దానికి 'పరుగెత్తింది', 'పరుగెత్తుతున్నది' అనే క్రియలను వెతకవచ్చు. 'తింటున్నాడు' అనే క్రియకు రామచంద్రుణ్ణో, పూర్ణ చంద్రుణ్ణో వెతకడానికి బయలుదేరవచ్చు. నేను వాళ్ళకు ఇదంతా తెలియ జెప్పాను. వెతికిన శబ్దాలను జతపరచి వుంచడం కూడా నేర్పాను.



విద్యార్థులకు యీ పని చాలా సంతోషాన్ని కలిగించింది.

దీని తరువాత నేను బోర్డు మీద కొన్ని వాక్యాలు వ్రాశాను. విద్యార్థులతో చెప్పాను—"ఈ వాక్యాలలో నుంచి నామవాచకాలనూ, క్రియా పదాలనూ ఏరుకొని పలకల మీద వ్రాయండి. ఈ వాక్యాలలో నామవాచకాలను చూపించండి. వీటిలోనుంచి ఆ నామవాచక పదాలను చెరపండి. వీటిలోనుంచి క్రియా పదాలను చెరపివేయండి."

నేను మళ్లీ అడిగాను-"ఇదేమిటి? దీనిని ఏమంటారు………"

వాళ్లు అన్నిటికీ సరయిన సమాధానాలు చెప్పారు.

ఈ విధంగా వాళ్ళకు నామవాచకాలనూ, క్రియా పదాలనూ విడదీయడం వచ్చేసింది.

ఉన్నతాధికారి అన్నాడు—"ఈ పద్ధతి చాలా బాగున్నది. నిజంగా యీ పద్ధతిలో విద్యార్థులు ఒక్క క్షణం కూడా శ్రమపడవలసిన అవసరం వుండదు. అయితే ఇందులో సాధనాల కోసం కొంత డబ్బు ఖర్చు చేయవలసి వుంటుంది. అద్భుతమైన కల్పనా శక్తి కలిగి వున్నటువంటి మీలాంటి హృదయం కూడా కావలసి వుంటుంది."

నేనన్నాను—"అయితే పిల్లలకు వల్లించే శ్రమ లేకుండా చేయడానికి ఈమాత్రం ఖర్చు అయితే మాత్రం ఏమండీ! అదెంత గొప్ప విషయం? కొద్ది–గొప్పా నా జేబునుంచే ఖర్చు చేశాను. పాత అట్టలు వెతికి తీసి పెట్టెలు తయారు చేశాను. ఇంట్లో చెదురు మదురుగా పడివున్న కాగితాలను తీసికొని చీట్లు తయారు చేశాను.

ఉన్నతాధికారి—"వీటికి ఎంత ఖర్చు అయిందో అంతా మీకు ఇప్పించడానికి ప్రయత్నిస్తాను".

నేనన్నాను—"అయ్యా, ఆ డబ్బు యిప్పించడానికి బదులు మీరు నా యీ విధానాన్ని ఆమోదింపజేస్తే, దీనిని అమలు పరచితే నేను ఖర్చు చేసిన మొత్తం నాకు ముట్టినట్లే."

ఉన్నతాధికారి–"మంచిదే, చూస్తాను. తరువాత మీరు ఏంచేశారో చెప్పండి."

నేను-"అయ్యా, దీని తరువాత నేను విశేషణాలు ప్రారంభించాను. కాని నా సోది మీకు విసుగు కలిగించడంలేదు కదా? అసలే ఇది నీరసంగా వుండే వ్యాకరణం. పైగా సూటిగా చెప్పకుండా డొంక తిరుగుడుగా చెప్పడం నాకు అలవాటు!"

ఉన్నతాధికారి-"లేదులేండి, మీరు చెపుతూ వుండండి. నేను విధానమంతా విపులంగా తెలుసుకో దలచుకున్నాను. వివరంగా తెలిసికోనిదే విషయమంతా బోధపడదుగదా? అయితే కొంచెం ఆగండి, టీ వచ్చింది. త్రాగిన తరువాత ముందుకు సాగి పోదాం."

ఉన్నతాధికారి కొంచెం సన్నసువారం కోరే మనిషి. హైక్లాస్ టీ త్రాగుతారు. నా అభీష్టంకూడా తెలిసిన వాడు. టీ త్రాగడానికి ఇరవై నిమిషాలు పట్టింది. మాకు కొంచెం ఉత్సాహం కూడా కలిగింది. మా సంభాషణ ముందుకు సాగింది.

నేనన్నాను-"అయ్యా, నా విధానం ప్రకారం నేను ముందుగా పిల్లల ఎదుట విశేషణాల చీట్లు వుంచాను. వాళ్ళు ఆ అట్ట ముక్కలను చదువ నారంభించారు. ఇంతలో ఒకడు అడిగాడు-"అయ్యా, యీ విశేషణాలంటే ఏమిటండీ?"

నేనన్నాను-"చూడండీ! ఇవన్నీ విశేషణాలే!" అంతే, "విశేషణాలు!" వాళ్ళు నా మాటను మనసులోనే గొణుక్కుంటూ కొంచెం కొంచెం అర్థం చేసుకుంటున్నారు. తరువాత ఆట ఆరంభమయింది. వాళ్ళు విశేషణాలూ, నామవాచకాలూ, క్రియా పదాలూ కలిసివున్న అట్ట ముక్కలను చదువుతూ వేరు చేస్తున్నారు.

తరువాత నేను వాళ్ళకు ఒక కొత్త ఆట సూచించాను. "చూడండి, అబ్బాయిలూ! నేను కోరిన దానిని మీరు తీసుకొని రండి."



నేనన్నాను--"పెన్సిలు తీసుకొని రండి."

ఒక కుర్రవాడు పెన్సిలు తెచ్చాడు.

"ఎర్ర పెన్సిలు తీసుకొనిరా."

అతడు ఎర్ర పెన్సిలు తెచ్చాడు.

"పసుపు రంగు పెన్సిలు తీసుకొనిరా."

పసుపు రంగు పెన్సిలు తెచ్చాడు.

"పెన్సిలు అక్కడ పెట్టిరా."

పిల్లవాడు అడిగాడు-"ఏ పెన్సిలండీ?"

"ఎర్ర పెన్సిలు" అన్నాను.

తరువాత అడిగాను-"పసుపు పచ్చనిది తీసుకొనిరా. బూడిద రంగు పెన్సిలు తీసుకొనిరా. గులాబీ రంగు పెన్సిలు తీసికొనిరా. పొడవైన పెన్సిలు తీసికొనిరా. చిన్న పెన్సిలు తీసుకొనిరా."

వాళ్లు పెన్సిళ్లు తెస్తూ వున్నారు.

నేను కొత్త పాఠం ప్రారంభించాను—"ఏదో ఒక పెన్సిలు తీసుకో."

ఒకడు పెన్సిలు తీసుకొన్నాడు.

"ఇప్పుడు ఆకుపచ్చ రంగు పెన్సిలు తీసుకో."

అది తీసుకొన్నాడు.

"ఇప్పుడు ఆ పసుపు రంగుది తీసుకో."

పసుపు రంగుది తీసుకున్నాడు.

"ఇప్పుడు పొడవైన పెన్సిలు తీసుకో."

పొడవైనది తీసుకొన్నాడు.

నేను అడిగాను–"నువ్వు ప్రత్యేకంగా ఏ పెన్సిలు తీసుకొన్నావు?"

"ఈ ఆకుపచ్చ రంగు పెన్సిలు తీసుకొన్నాను."

"మళ్ళి ఏది తీసుకొన్నావు?"

"ఈ పసుపుపచ్చ పెన్సిలు తీసుకొన్నాను."

"మళ్ళ ఏది తీసుకొన్నావు?"

"ఈ పొడవైన పెన్సిలు తీసుకొన్నాను.

నేను బోర్డుమీద వ్రాశాను. "ఇవి ప్రత్యేకత గల శబ్దాలు. ఇవి విశేషణాలు. ఇవి ఒక ప్రత్యేకమైన వస్తువును సూచిస్తాయి. ఆ వస్తువుల యొక్క ప్రత్యేకతనూ, ఆధిక్యతనూ తెలియజేస్తాయి."

విద్యార్థులు చదివారు. చదివి ఆలోచించారు.

నేను నామవాచకాలూ, విశేషణాలూ వున్న పెట్టెలను తీసి వాళ్ళకు మరో ఆట చెప్పాను—"నామవాచకానికి విశేషణాన్ని వెతకండి. విశేషణానికి నామవాచకాన్ని వెతకండి."

ఒక పిల్లవాడు 'ఎర్రని' అనే శబ్దాన్ని తీసుకున్నాడు. నామవాచకాల పెట్టెలోనుంచి 'గుర్రం' అనే శబ్దం తీసుకున్నాడు. 'ఎర్రని గుర్రం' అని జతపరచి వుంచాడు. విశేషణాలూ, నామవాచకాలూ గల గుట్టలలోనుంచి ఈవిధంగా శబ్దాల జంటలు ఏర్పడు తున్నాయి. నేను వాళ్ళ కార్యక్రమాన్ని పర్యవేక్షిస్తూ క్లాసులో తిరుగుతూ వున్నాను. అక్కడక్కడ కొన్ని జంటలు తప్పుగా కూడా జతపరచ బడ్డాయి.

మళ్ళ రకరకాలైన నా పద్ధతులతో నేను విద్యార్థులను పరీక్షించి చూశాను. వాళ్ళు విశేషణం అంటే ఏమిటో తెలుసుకున్నారు. అప్పటి కప్పుడు సరియైన నామవాచకానికి సరియైన విశేషణాన్ని వెతికి తీస్తున్నారు.

ఉన్నతాధికారి అన్నాడు—"మిత్రమా, మీరు చాలా కొత్త ఆటలు సృష్టించారు. నామవాచకాలనూ, విశేషణాలనూ, క్రియా పదాలనూ విద్యార్థులకు చక్కని పద్ధతిలో పరిచయం చేశారు. మంచిదే. అయితే ఇప్పుడు వాళ్ళకు వాటి పరిభాషను కూడా నేర్పుతారా లేదా?"

నేనన్నాను—"అయ్యా, పరిభాష నేర్పేశాను గదా? అయితే



వ్యాకరణంలో వున్న పరిభాషలు వుండిపోయాయి. అవి వాళ్ళకు నేర్పను. పరీక్షలో మీరు వాళ్ళను పరిభాషను గురించి అడగకూడదు కూడా. మీరు పద పరిచయం అడగవచ్చు."

ఉన్నతాధికారి అన్నాడు—"అసలు మీ విద్యార్థులను వ్యాకరణం విషయంలో పరీక్షించవలసిన అవసరమే లేదు. వాళ్ళకు ఆ పరీక్షే వుండదు. మీరు ప్రవేశపెట్టిన యీ విధానాన్ని పాఠశాలలోని అన్ని క్లాసుల్లో ప్రవేశపెట్టాలి. పాపం పిల్లలకు వల్లె వేసే భారం తప్పించాలి. వాళ్ళు వల్లెవేయలేక చచ్చిపోతున్నారు."

నేనన్నాను–"అయ్యా, చిన్నతనంలో నేను వ్యాకరణం నేర్చుకొనే టప్పుడు నాకు ఊపిరి ఆడేది కాదనుకోండి. ఉక్కిరి బిక్కిరై పోయే వాణ్ణి. దెబ్బలుకూడా బాగా పడేవి. మేము వ్యాకరణం ప్రశ్నలకు జవాబులు చెప్పలేకపోతే మా ఉపాధ్యాయులు మమ్మల్ని తెగ బాదేవాళ్ళు."

ఉన్నతాధికారి అన్నాడు–"ఇప్పటికీ మన ఉపాధ్యాయులు ఆ విధంగానే బాదుతున్నారు."

నేనన్నాను—"మీరు యీ దండించే పద్ధతిని యెందుకు నిరోధించ కూడదూ?"

ఉన్నతాధికారి అన్నాడు-"మిత్రమా, అది నా చేతిలో వున్న పని కాదు. కొంతమేరకు వున్నదే అనుకోండి. అయినా నా అభిప్రాయం.... అసలు మనం చక్కగా బోధిస్తే యీ కొట్టడం, బాదడం దానంతటదే తగ్గిపోతుందేమో! మీరే చూడండి, వ్యాకరణం నేర్పుతూ వున్నప్పుడు మీకు యెవరినైనా దండించ వలసిన అవసరం కలిగిందా? సరే, అయితే సర్వనామాలను ఎలా నేర్పారో చెప్పండి!"

నేనన్నాను-"ఇంకా ఎలా నేర్పేదేముందండీ? విద్యార్థులకు ఒక చిన్న ఆట నేర్పాను. నేను వాళ్ళకు బోధ పరచాను—'నేను—అంటే ఎవరిని'? వాళ్ళు చెప్పారు—'లక్ష్మిశంకర్‌గారు.' 'అయితే నీవు–అంటే

ఎవరివి?' శ్యామసుందర్ చెప్పాడు–'నేను శ్యామసుందర్‌ను.' నేను అడిగాను-'అతడు-అంటే ఎవరు?' 'రామచంద్రుడు.'"

పై ప్రశ్నలు వేసిన తరువాత నేను బోర్డుమీద వ్రాశాను—

నేను—లక్ష్మీశంకర్.

నీవు—భీమశంకర్.

అతడు—ధనుంజయ్.

మనం—లక్ష్మీశంకర్, భీమశంకర్, శ్యామసుందర్, ధనుంజయ్.

మీరు—రేవారామ్, లక్ష్మణసింహ్, టేకమ్‌సింహ్, దేవీప్రసాద్.

వారు—ఆ మూడో క్లాసు వాళ్ళు-మోహన్‌సింహ్, మూలచంద్, లఖమీచంద్, రూపసింహ్.

పిల్లలు చదివారు. నేను చెప్పాను-"ఈ నేను, నీవు, అతడు సర్వనామాలని పిలువ బడతాయి." ఒకడు ప్రశ్నించాడు—"అయ్యా సర్వనామాలు అంటే ఏమిటి?"

నేను బోర్డు మీద వ్రాశాను—

రాముని చేతిలో పలక వున్నది.

రాముని చేతిలో కలము వున్నది.

రాముడు బ్రాహ్మణుడు.

రాముడు చదువుచున్నాడు.

రాముడు రోజూ త్వరగా వస్తాడు.

లక్ష్మీ శంకర్ మీ ఉపాధ్యాయుడు.

లక్ష్మీ శంకర్ మీకు బోధిస్తాడు.

లక్ష్మీ శంకర్ మిమ్ములను షికారుకు తీసికొని వెళ్ళుతూవుంటాడు.

అందరూ వీటిని చదివారు. తరువాత నేను రెండో వాక్యం నుంచి 'రాముని' తొలగించాను. దానికి బదులు 'అతని' అని వ్రాశాను. 'లక్ష్మీ శంకర్' శబ్దాన్ని చెరిపి 'నేను' అని వ్రాశాను. క్రియా పదంలో కొంచెం



మార్పు చేశాను. పిల్లలు చదివారు. దాని అర్థం తెలుసుకున్నారు.

నేను అడిగాను—"చెప్పండి, సర్వనామం దేనికి బదులుగా వ్రాయాలి?" ఒకడన్నాడు—'రామునికి బదులుగా,' మరొకడన్నాడు—'లక్ష్మీ శంకర్‌కు బదులుగా.'

నేను అడిగాను—"రాముడు, లక్ష్మీశంకర్ అనేవి పేరులా లేక క్రియాపదాలా?"

"పేర్లు."

"అయితే రాముడు, లక్ష్మీ శంకర్ అనే పేర్లకు బదులుగా వాడిన శబ్దాలను ఏమంటారు?"

"సర్వనామాలు."

ఉన్నతాధికారి పకపకా నవ్వుతూ అన్నాడు—"మిత్రమా, మీరు యిప్పుడు పక్కా టీచరుగా కనిపిస్తున్నారు. చాలా విపులంగా, వరుసగా ప్రతి విషయాన్నీ వర్ణిస్తున్నారు."

నేనన్నాను—"అయ్యా, ఇప్పుడు యీ అలవాటు ఎలా పోతుంది? క్లుప్తంగా కుదించడానికి నేను వకీలును కాదుగదా?"

నేను చూశాను, ఉన్నతాధికారి బాగా అలసిపోయాడు. నా మాటలకు ఆయన బాగా ఆనందిస్తూ వున్నాడు. అయినా ఇక నేను మౌనం వహించాను. నేను వెళ్ళడానికి అనుమతి కోరాను. ఆయన ఇచ్చాడు. ఆయన అన్నాడు—"మీ క్లాసు విద్యార్థులు వ్యాకరణం పరీక్ష వ్రాయనవసరం లేదు. వాళ్ళకు వ్యాకరణం పరీక్ష వుండదు. కాని ఇంకా కాలాలూ, విభక్తులూ మిగిలిపోయాయి. అవి బోధించడం అయిపోయిన తరువాత ఒకసారి వచ్చి ఆ విషయాలను వినిపించండి. నేను వచ్చే సంవత్సరం ఈ విషయంలో ఏదయినా చేయాలనుకుంటున్నాను."

నేను కూడా అలసటతో ఇంటికి చేరాను. వెంటనే నిద్రపోయాను.

3

ఆరు మాసాల పరీక్ష రోజులు దగ్గరకు వచ్చేశాయి. ఉన్నతాధికారి స్వయంగా పరీక్షించడానికి రాబోతున్నాడు. ఆయనకు పరీక్షించాలనే ఆసక్తి అధికంగా వుంటుంది.

నేను నా పద్ధతిలో నా క్లాసు విద్యార్థులను పరీక్షకు సిద్ధంచేసి వుంచాను. అన్ని క్లాసుల పరీక్ష అయిపోయిన తరువాత నా క్లాసును పరీక్షిస్తారు. ఆ విధంగా నేను అనుమతి పొందివున్నాను. నా క్లాసు పరీక్షించేటప్పుడు ప్రధానోపాధ్యాయులనూ, మిగిలిన ఉపాధ్యాయులనూ వచ్చి చూడవలసిందిగా ఆహ్వానించాను. నా క్లాసు పరీక్ష జరిగేటప్పుడు ప్రతి క్లాసునుంచి అయిదుగురు, అయిదుగురు విద్యార్థులను పంపించ వలసినదిగా కోరాను.

పరీక్ష రోజు నా మనసు చాలా ప్రశాంతంగా వుంది. నా గుండె దడదడ లాడటం లేదు. నా మనసులో ప్యాస్—ఫెయిల్ అనే సంశయం లేదు. నా అనుభవం ప్రకారం చింతించవలసిన అవసరం కూడా లేదు. నేను విద్యార్థులతో చెప్పే వుంచాను—"మనం ప్రతి రోజూ ఏం చేస్తుంటామో అదే ఈ రోజు కూడా చేయవలసి వుంటుంది. పరీక్షలో మీరందరూ ఉత్తీర్ణులయ్యే వున్నారు. ఈ రోజు మన కార్యక్రమం చూడటానికి అందరినీ ఆహ్వానించాం. అంతే!"

మామూలుగా జరిగే మా నాటకీయ పద్ధతిలోనే నేను ఏర్పాటంతా తెరచాటునే చేసివుంచాను. తెరకు ముందు వైపు అందరినీ కూర్చోబెట్టిన తరువాత నేను తెర తొలగించాను.

వేదిక మీద ఇతర క్లాసుల విద్యార్థులను కొన్ని దళాలుగా కూర్చోబెట్టాను. ప్రతి ఒక్క దళానికి నా క్లాసు విద్యార్థి కథ వినిపిస్తూ వున్నాడు. కథ చెప్పే పని వంతుల వారీగా జరిగింది. ప్రతి విద్యార్థి తాను చెప్పే కథను తానే నిశ్చయించుకున్నాడు. మరచిపోయినప్పుడు



చూడడానికి పుస్తకం దగ్గరే వుంది. అతడు తన పద్ధతిలో తన కథను విద్యార్థులకు వినిపిస్తూ వున్నాడు. వినేవాళ్ళతో పాటు తానుకూడా ఆ కథలోని ఆనందాన్ని అనుభవిస్తూ వున్నాడు. అతడికి కథ చెప్పడం తెలుసు. భావయుక్తంగా, ఆకర్షణీయంగా అతడు తన కథను చెపుతూ వున్నాడు. కథ అర్థం తెలుసుకొని చెపుతున్నాడు. కథలు పూర్తయ్యాయి. ఉపాధ్యాయులందరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటూ వున్నారు. నేను చెప్పాను—"ఇది ఒక పరీక్ష."

ఒక ఉపాధ్యాయుడు మరో ఉపాధ్యాయునితో గుసగుసలాడు తున్నాడు—"ఏ విషయంలో పరీక్ష?"

అది విని నేనన్నాను—"విద్యార్థులకు భాష మీద ఎంత పట్టు వుందో తెలిసికొనడానికి పరీక్ష. వక్తృత్వానికి పరీక్ష, వాళ్ళ అభిరుచికి పరీక్ష, వాళ్ళ జ్ఞాపక శక్తి ఎంత అభివృద్ధి చెందినదో చూడటానికి పరీక్ష, అభినయానికి పరీక్ష."

ఉపాధ్యాయులందరూ రెండో పరీక్ష కోసం ఎదురు చూస్తూ వున్నారు.

మళ్ళీ తెర లేచింది. విద్యార్థులందరూ గోళా కారంగా కూర్చొని వున్నారు. ఎదురుగా బోర్డు మీద వ్రాసివున్నది-'అంత్యాక్షరి ఆట.'

ఒకడు పద్యం చదివాడు. రెండోవాడు మొదటివాడి అంతిమ అక్షరంతో ఆరంభించి మరో పద్యం చదివాడు. ఈ విధంగా వర్తులం అంతా చదవడం పూర్తి అయింది. మళ్ళీ అదే అంత్యాక్షరి ప్రారంభ మయింది.

ఉన్నతాధికారి ప్రశ్నించాడు—''వీళ్ళను ఎదురెదురుగా ఎందుకు కూర్చోబెట్టలేదు. ఇందులో గ్రూపులుగా ఉండడం అవసరం గదా?"

నేను చెప్పాను—"అయ్యా, నేను ఆ సంప్రదాయాన్ని వదిలేశాను. ఆ పద్ధతిలో ఓడు-గెలుపు అనే భావం ఉత్పన్నమౌతుంది. ఓడు-గెలుపుతో

స్పర్థ ఏర్పడుతుంది. స్పర్థతో ఈర్ష్య ఏర్పడుతుంది. కాని యీ పద్ధతిలో ఒక విద్యార్థికి పద్యం గుర్తుకు రానప్పుడు అతని తరువాత వున్నవాడు చదవడం ప్రారంభిస్తాడు. పని జరిగిపోతూ వుంటుంది. ఒకసారి అతనికి గుర్తు రాకపోయినా మరోసారి గుర్తుకు వస్తుంది."

ఉన్నతాధికారి గడ్డం సవరించుకుంటూ చూస్తూ వున్నాడు.

కొంచెం సేపు ఆడటానికే నేను పిల్లలను కూర్చోబెట్టాను. కాని వాళ్ళకు అది ఎంతో ఆనందంగా వుంది. గంట మ్రోగినా వాళ్ళకు లేవ బుద్ధికావడం లేదు. మరో పదినిమిషాలు కొనసాగనిచ్చి తరువాత తెర వేశాను.

నేను తెరముందుకు వచ్చి చెప్పాను—"సజ్జనులారా, ఈ విద్యార్థులకు పాఠ్య పుస్తకంలోని పద్యాలలో ఎన్ని పంక్తులు బాగా జ్ఞాపకం ఉన్నాయో మీరు చూశారు. పద్యం బోధించే క్లాసులో ప్రతిరోజూ నేను వీళ్ళచేత ఇదే ఆట ఆడిస్తాను."

ఉన్నతాధికారి అన్నాడు—"Hear, hear : వినండి ! వినండి!"

మరలా తెరలేచింది. గోళాకారంగా కూర్చున్న విద్యార్థులందరూ పొడుపు కథలు విప్పుతున్నారు. వాళ్ళు ఎంతో ఉత్సాహంగా ఉన్నారు.

ఉన్నతాధికారి అన్నాడు—"ఓహో! ఇవి పొడుపు కథలే! కాని ఇవి పాఠ్యక్రమంలో ఎక్కడున్నాయి?"

నేను చెప్పాను—"అయ్యా, పాఠ్యక్రమంలో భాషా బోధన వుందిగదా! పాఠ్యక్రమం భూమికలో విద్యార్థుల జిజ్ఞాసను పెంచడం, వాళ్ళ భాషా జ్ఞానాన్ని అభివృద్ధి పరచడం అనే ఆశయం వుంది గదండీ! నా విద్యార్థులందరూ యీ ఆటలో తన్మయులైపోతారు. చాలా పొడుపు కథలు వీళ్ళకు గుర్తున్నాయి. నేను వీటికి స్థానం ఇచ్చాను. వచ్చే సంవత్సరం మీరు కూడా యీ పొడుపు కథలకు పాఠ్యక్రమంలో స్థానం కల్పించగలరని ఆశిస్తున్నాను."



దీని తరువాత మేము శబ్దాల ఆట ప్రారంభించాము. ఒక శబ్దం చెప్పిన మీదట దాని చివరి అక్షరంతో ప్రారంభమయ్యే మరో శబ్దం చెప్పబడుతుంది. తరువాత దాని చివరి అక్షరంతో ప్రారంభమయ్యే మరో శబ్దం చెప్పబడుతుంది. మొదట్లో యీ ఆట సులభంగానే కన్పిస్తుంది. ఇందులో శబ్దాన్వేషణ చాలా తమాషాగా వుంటుంది. ఒక విద్యార్థి గ్రామాల పేర్లు సేకరిస్తాడు. ఒకడు నదుల పేర్లు సేకరిస్తాడు. ఒకడు పర్వతాల పేర్లు సేకరిస్తాడు. ఒకరు హిందువుల పేర్లు, ఒకరు ముస్లిముల పేర్లు, ఒకరు జాతుల పేర్లు,ఒకరు బ్రాహ్మణుల పేర్లు ఒకరు, వైశ్యుల పేర్లు ఆటలో చెప్పడం కోసం సేకరిస్తూ వుంటారు. అప్పుడు అందరికీ యీ ఆట అద్భుతంగా కన్పించింది.

నేను నా సహోపాధ్యాయులతో అన్నాను—"ఈ ఆటకు కావలసిన శబ్దాలను సేకరించడం కోసం దేశపటాలనూ, శబ్దకోశాలనూ తిరగేస్తూ వుండమని నేను నా విద్యార్థులతో చెపుతూవుంటాను. ఇందువలన వాళ్ళ నోట్లో అనేక శబ్దాలు ఆడుతూ వుంటాయి. ఇప్పుడు విద్యార్థులు తరచుగా ఆటలాడటానికి బదులు రకరకాల శబ్దాలు, విభిన్న వర్గాల శబ్దాలు సేకరించడంలోనే ఎక్కువ కాలాన్ని గడుపుతున్నారు. ఒకరి కొకరు శబ్దాలను గుర్తుచేసుకుంటూ కూడా వుంటారు. కొందరు శబ్దాలను వ్రాసి పెట్టుకుంటారు కూడా."

ఉన్నతాధికారి అన్నాడు—"మిత్రమా, యీ ఆటలో ఒక గొప్ప తత్వం దాగి ఉన్నట్లుగా కన్పిస్తూవుంది. ఈ రకమైన ఆటలు బౌద్ధిక శక్తినీ, సామాన్య జ్ఞానాన్నీ వృద్ధి చేస్తాయి. అంచేత అన్ని క్లాసుల్లో వీటిని తప్పకుండా ప్రారంభించవలసిందే."

ప్రత్యేకంగా నా వైపు చూస్తూ ఆయన అన్నాడు—"మీరు కూడా మెచ్చుకో దగినవారే! కొత్త కొత్త విషయాలు వెతికి వెతికి బయటకు తీస్తూ వుంటారు."

ఉన్నతాధికారికి వినపడేటట్లుగా ఒక ఉపాధ్యాయుడు మరో ఉపాధ్యాయునితో యీ విధంగా అంటున్నాడు—"అందుకోసమే గదా లక్ష్మీశంకర్ ఇక్కడకు వచ్చింది. ఆయనకు చదువు చెప్పే పనేముంది? ఆయన ఆనందంగా, సరదాగా, హాయిగా కాలక్షేపం చేస్తున్నారు. మనకు చదువు చెప్పి, చెప్పి తల నెరసిపోతున్నది. ఇక్కడ ఈయన గారి కార్యక్రమంలో ఆటలు తప్ప మరొకటి లేనేలేదు."

రెండో ఉపాధ్యాయుడు అన్నాడు—"బ్రదర్, ఇప్పుడు పూర్వపు చదువులు పోయి కొత్త చదువుల కాలం వచ్చింది. ఇప్పుడు గడగడ పాఠం చదవడం, పుస్తకాలకు పుస్తకాలు వల్లించడం, విద్యను అభ్యసించడం లాంటి వేమీ పనికిరావు. ఆ రోజులు గతించాయి. ఇప్పుడు చదువులకు బదులు యీ ఆట పాటలు వచ్చి పడ్డాయి. మున్ముందు ఇంకా ఏమేమి వచ్చిపడతాయో తెలియదు. ఇప్పుడు ఎవడి మనసూ చదువు మీద లేదు. ఆటలు ఆడిస్తేనే అందరికీ మంచివాళ్ళం అయిపోతాం."

నేను విద్యార్థుల కార్యక్రమాలను చూపించే పనిలో మునిగి వున్నాను. ఆ కారణంగా వాళ్ళ సంభాషణను వినలేకపోయాను. తరువాత ఎవరో యీ సంగతి నాతో చెప్పారు. ఏమయినా చెప్పుకోనివ్వండి!

నేను విజిల్ వేశాను. పిల్లలందరూ చేతుల్లో చీపురు కట్టలు పట్టుకొని వరుసగా ఒక పంక్తిలో నిలబడిపోయారు. నేను చీపుళ్ళతోనే వాళ్ళచేత డ్రిల్లు చేయించాను. వాళ్ళను నలువైపూ ఊడ్చి శుభ్రం చేయమని ఆజ్ఞాపించాను. వాళ్లు పాఠశాల అంతటా వ్యాపించి పోయారు. చెత్తా చెదారం యెక్కడ కన్పించినా ఊడ్చి పారేశారు. ప్రోగు చేసిన చెత్తనంతా ఒక తట్టలో నింపుకొని నా ఎదటికి వచ్చారు.

ఉన్నతాధికారి, ఉపాధ్యాయులూ ఆశ్చర్యపోయారు. అలాగే చూస్తూ ఉండిపోయారు. నా క్లాసు విద్యార్థులకు ఇది కూడా ఒక పరీక్షయే.

ఉన్నతాధికారి అడిగాడు—"చీపుళ్ళతో డ్రిల్లు ఎందుకు చేయించారో



నాకు బోధపడలేదే?"

నేను చెప్పాను—"అయ్యా, ఈనాడు మన దేశమంతా మాలిన్యంతో, కాలుష్యంతో మురికిబట్టి వుంది. ఈ మురికి మనజాతికే కళంకం. ఈ మురికి రాజ్యం చేస్తున్నంత కాలం మన దుస్థితి తొలగిపోదు. అంచేత మురికి మీదనే నేను మొదటి పోరాటం ప్రారంభించాను. మనం మన మురికిని పోగొట్టు కొనడానికి నియమ పూర్వకంగా పోరాటం ప్రారంభించవలసి వుంటుంది. అందుకు యీ చీపుళ్ళతో డ్రిల్లు చేయించడం ఒక సంకేతం. ఈ పిల్లలకు మొదటి పాఠమే యీ చీపురు కట్టల డ్రిల్లు. మా గది శుభ్రం చేయబడనంతవరకూ మేము క్లాసులో మరో పని చేయము. ఇప్పుడు ఈ పిల్లలకు కూడా మురికి అంటే గిట్టదు."

సంభాషణ జరుగుతూ వుండగానే పిల్లలు కాళ్ళు, చేతులు, ముఖమూ కడుగుకొని వచ్చారు. నేను రెండో విజిల్ వేశాను.

ఉన్నతాధికారి—"మీరు చేస్తున్న యీ ప్రయోగం అద్భుతంగా వుంది. నాలుగవ క్లాసు బోధనకు సంబంధించిన ప్రయోగం చేస్తూ చేస్తూ ఇంకా ఇటువంటి కొత్త విషయాలు ఏమేమి సాధించారు?"

నేను చెప్పాను—"అయ్యా, నా ప్రయోగంలో ఇటువంటి విషయాలకు ఎన్నిటికో అవకాశం వుంది. అయితే నాలుగవ తరగతి వాళ్ళకు వాళ్ళ పాఠ్య పుస్తకాలు బోధించే ముందు ఒకటవ తరగతి చదువు చెప్పవలసిన పని వుంది గదా?"

అటు పిల్లలందరూ పరుగెత్తుకుంటూ బయటికి వెళ్ళి పోయారు. పాఠశాల చుట్టు ప్రక్కల వున్న చెట్ల మీది కెక్కారు. నేను మళ్ళీ విజిల్ వేశాను. వాళ్లంతా చెట్ల మీది నుంచి దూకుతూ దుముకుతూ క్రిందికి వచ్చేశారు. మళ్ళి విజిల్ వేశాను. మళ్ళి చెట్ల మీది కెక్కారు. మళ్ళి విజిల్ వేశాను. అందరూ దిగి వచ్చారు.

ప్రధానోపాధ్యాయుడు—"మిత్రమా, యీ బోధన కూడా విచిత్రంగానే వుంది. ఈ పని నేర్పకుండా వున్నా చేయగలరు. ఇందులో నేర్ప వలసింది ఏమీ లేదు."

నేనన్నాను—"అయ్యా, ఈ రోజుల్లో నేర్పకపోతే ఇటువంటి విద్యలు కూడా రావు. మనం విద్యార్థులను ఇటువంటి విషయాలు నేర్చుకోనివ్వము కూడా!"

ప్రధానోపాధ్యాయుడు—"కాదు, అది నిజం కాదు."

నేనన్నాను—"మన పాఠశాలలో మిగిలిన క్లాసుల పిల్లలు యిక్కడే నిలబడి వున్నారుగదా, వాళ్ళలో ఎంత మంది యీ విధంగా చెట్లెక్కి దిగగాలరో అడగండి."

ఉన్నతాధికారి వాళ్ళందరినీ చెట్లెక్కి దిగమని చెప్పాడు. అయితే అతి కష్టం మీద ఇద్దరు ముగ్గురు మాత్రమే ఎక్కగలిగారు.

నేనన్నాను—"అయ్యా, వీళ్ళకు నేను యీ పని చేయడానికి ఎంతో శిక్షణ యిచ్చాను. ఈ విషయాలన్నీ నా బోధనలోనూ, నా ప్రయోగంలోనూ వున్న విషయాలే." కొంచెం నవ్వి మళ్ళీ అన్నాను—"అయ్యా, పరీక్షా పత్రంలో ఈ ఆటల పేర్లు కూడా వున్నాయి. వీటికి కూడా మీరు మార్కులు ఇవ్వవలిసి ఉంటుంది."

ఉన్నతాధికారి కూడా నవ్వుతూనే అన్నాడు—" మంచిది! మంచిది! మీరు కూడా నన్ను మార్కులు అడుగుతారా?"

నేను మళ్ళీ విజిల్ వేశాను. పిల్లలు పాఠశాలలోని అల్మైరాలో నుంచి తాళ్లూ బొంగరాలూ తీసుకొని వచ్చారు. తమ తమ బొంగరాలు తిప్పుతూ వున్నారు. వీధిలో కీచులాడుకునే పిల్లల మాదిరిగా కాకుండా, ఎటువంటి అల్లరి లేకుండా, నిశ్శబ్దంగా, బొంగరాల ఆట ఆడుతూ వున్నారు. వాళ్ళు ఏకాగ్రతతో వున్నారు. ఏ రకమైన పరుగులుగానీ, పల్కరింతలుగానీ లేకుండా తమ పని తాము చేసుకుంటున్నారు. ఆట



ఆడటానికి నిశ్చయించబడిన స్థానాలు వున్నాయి. వాళ్ళందరికీ ఒక నాయకుడు వున్నాడు. "బాల్యంలో మన మందరం బొంగరాలు తిప్పిన వాళ్ళమే. మనలో ప్రతి ఒక్కరికీ యీఆట ఆనందం కలిగించడం చూశారుగదా!"

ఉన్నతాధికారి అన్నాడు—"మిత్రమా—మీరు వీళ్ళకు బొంగరాల ఆట ఎప్పుడు నేర్పారు? వీళ్ళు చాలా నిర్మాణయుతంగా, నియమ బద్ధంగా ఆడుతూ వున్నారు!"

నేనన్నాను—"నేర్పడం—నేర్చుకోవడం మొదలైన మా కార్యక్రమం అంతా నది ఒడ్డున జరుగుతూ వుంటుంది. మేము షికారుకు వెళ్ళినప్పుడల్లా అక్కడే ఇటువంటి కార్యక్రమాలు నిర్వహిస్తూ వుంటాము. ఆడుతూ పాడుతూ ఏమేమిటో చేస్తూ వుంటాము."

ఉన్నతాధికారి ఇంగ్లీషులో అన్నాడు—"మీరు నిజం చెపుతున్నారు. పిల్లలకు ఆటల ద్వారా ఎంతో నేర్ప వచ్చుననే విషయం నేను ఇప్పుడే తెలుసుకున్నాను. (ప్రధానోపాధ్యాయుని వైపు చూస్తూ) మీరు ఇప్పుడు పాఠశాలలోని అన్ని క్లాసులలో యీ కార్యక్రమం ప్రారంభించ కూడదూ?"

ప్రధానోపాధ్యాయుడు అన్నాడు-"అయ్యా, మేము ఇవన్నీ చేస్తూ కూర్చుంటే పాఠ్య క్రమం ఎలా పూర్తవుతుందండీ! ఈ మిత్రునకు బాధ్యతయేమున్నది? ఒక సంవత్సరమే గదా! చెప్పిన వరకు చెపుతాడు. పాఠ్య క్రమం పూర్తి కాకపోయినా ఫరవాలేదు. ఇది ప్రయోగం అంటాడు. సాధ్యమైనంత వరకు చేశానంటాడు. మిగిలినది పూర్తికాలేదు అంటాడు. పిల్లలు చేయలేక పోయారంటాడు. 'ప్రయోగంలో ఏ కొంచెం సఫలమయినా అది గొప్ప విషయమనీ, సంతోషించ దగినదీ' అని మీరుకూడా అంటారు. మేము పాఠ్య క్రమానికి బద్ధులమై వుండాలి. అది పూర్తి చేయాలి. లేకపోతే పై నుంచి మీరే

'పోర్షన్ ఎందుకు పూర్తి కాలేదూ? సిలబస్ ఎందుకు పూర్తి చేయలేదూ? ఫలితాలు సంతృప్తిగా ఎందుకు రాలేదు?' అంటూ వ్రాస్తారు గదండీ!"

ఉన్నతాధికారి పైకి చిరునవ్వు నవ్వాడు. కోపాన్ని మనసులోనే దాచుకున్నాడు. మౌనంగా ఉండిపోయాడు.

నేను విజిల్ వేశాను. పిల్లలంతా చొక్కాలు విప్పేశారు. అందరూ సావధానంగా ఒక పంక్తిలో నిల్చున్నారు. సరిగానూ, క్రమంగానూ నిల్చున్నారు. అందరూ చాలా పరిశుభ్రంగా వున్నారు. కాళ్ళూ-చేతులూ, ముఖమూ అన్నీ పరిశుభ్రంగా వున్నాయి. ఎవడి కంటిలోనూ పుసి కూడా కన్పించలేదు. టోపీలన్నీ శుభ్రంగా ఉతికి వున్నాయి.

ఉన్నతాధికారి కొంచెం నవ్వి అన్నాడు-"ఇదంతా అభ్యసింప జేయడానికి ఎంత కాలం పట్టిందండీ? ఇటువంటి శుభ్రత నేర్పడం కోసం ఎంతో శ్రమజేయవలసి వుంటుంది."

నేనన్నాను—"అయ్యా, ఆరు మాసాలనుంచి అలవాటు చేసుకుంటూ వస్తున్నాను. ఆరు మాసాలనుంచి శ్రమపడుతున్నాను. మీకు తెలియని దేమున్నది?"

నేను మరో విజిల్ వేశాను. పిల్లలు చొక్కాలు తొడుక్కుని, ఆనందంగా వరుసలో నిలబడి నమస్కారం చేసి వెళ్ళి పోయారు.

ప్రధానోపాధ్యాయుడు వ్యంగ్యంగా "ఏమిటి, పరీక్ష అయిపోయి నట్లేనా?" అన్నాడు..

నేను చెప్పాను—"లేదండీ, ఇంకావుంది. దయచేసి అందరూ ఆ గదిలోకి రండి."

ప్రధానోపాధ్యాయుడు-"అవునవును, మీరు కొన్నాళ్ళ క్రితం ఎందుకో యీ గదిని అడిగి తీసుకున్నారు కదూ! ఇప్పటివరకూ మాకు యెవరికీ ఆ గదిలో యేముందో చూపించలేదు. ఏమేమిటో సేకరింప



జేస్తున్నారు మీరు!"

నేనన్నాను—"రండి, వచ్చి చూడండి!"

అందరం ఆ గదిలోకి వెళ్ళాం.

ఉన్నతాధికారి అన్నాడు-"ఓహో! ఇది మ్యూజియం లాగా వుందే!"

ప్రధానోపాధ్యాయుడు—"నేనూ అదే అనుకున్నాను. ఆ మధ్య పిల్లలు ఏవేవో తెస్తూవున్నారు. వాటిని దాస్తూ వున్నారు."

నేనన్నాను—"అయ్యా, పిల్లలు చాలా ఉత్సాహంగా యీ పని చేశారు. 'మీరు మీ ఇష్టం వచ్చిన పద్ధతిలో వీటిని అందంగా అలంకరించండి. అమర్చండీ, నేనేమీ సలహా యివ్వనూ' అని చెప్పాను."

ఉన్నతాధికారి—"ఏమిటీ? యీ పేర్పులు, కూర్పులు, యీ అలంకరణ అంతా పిల్లలే చేశారా?"

నేనన్నాను—"అవునండీ!"

ఉన్నతాధికారి—"కాని ఇది ఎలా సాధ్యమయింది? యీ అలంకరణ చాలా కళాత్మకంగా వుంది!"

నేను మౌనం వహించాను. నాకార్యక్రమ ఫలితం ఇప్పుడు స్పష్టంగా తన ప్రత్యేకతను చూపుతూ వుంది."

ఉన్నతాధికారి అన్నాడు—"ఈ వస్తువులన్నీ ఎలా సేకరించారు? ఎక్కడనుంచి సంపాదించారు? విద్యార్థులకు ప్రకృతిని పరిచయం చేయడానికి యివన్నీ చాలా ఉపయోగ కరమైనవి."

ప్రధానోపాధ్యాయుడు అన్నాడు—"అయ్యా, ఈయన పిల్లలను అప్పుడప్పుడు యాత్రలకు తీసికొని పోతూ వుంటాడు. ఇవన్నీ అప్పుడు తెచ్చి వుంటారు!"

ఉన్నతాధికారి అన్నాడు—"చాలా శక్తివంతమైన పని చేశారు. ఈ మ్యూజియంను తొలగించవద్దు. ఇది యీ పాఠశాల మొత్తానికి బాగా

ఉపయోగ పడుతుంది. దీనిని పెంచి మరింత పెద్దదిగా చేయండి. అలా చేయమని ఉపాధ్యాయులందరికీ చెపుతాను".

ప్రధానోపాధ్యాయుడు మనసులో గొణుక్కుంటున్నాడు-'మరి ఇక చదువు చెప్పేదెప్పుడు?'

పిల్లలు మ్యూజియంకు సంబంధించిన పట్టిక ఒకటి తయారు చేశారు. ఉన్నతాధికారి అది చదివి చాలా సంతోషించాడు. ఆయనన్నాడు-"ఈ విద్యార్థులు నిజంగా బహూకరించ దగిన వాళ్లు."

నేనన్నాను-"అయ్యా, ఈ మ్యూజియంను ఏర్పాటు చేసుకోవడంలో కలిగిన ఆనందమే వీళ్ళకు బహుమతి. ఈ మ్యూజియం అంతా వీళ్ళకు యిచ్చిన బహుమతే!"

ఉన్నతాధికారి—"అయినప్పటికీ........ ...."

నేనేమీ మాట్లాడలేదు.

గదిలో ఒక మూల కొన్ని మట్టి బొమ్మలు వున్నాయి.

ఉన్నతాధికారి—"వీటిని ఎవరు తయారు చేశారు?"

నేనన్నాను-"అయ్యా, విద్యార్థులే! ఈ గదిలోని ఏర్పాటంతా వాళ్లు స్వయంగా చేసినదే. ఇందులో నా జోక్యమేమీ లేదు."

ఉన్నతాధికారి-"కాని ఇన్ని బొమ్మలు ఎప్పుడు చేశారు?" ఎక్కడ కాల్చుకొచ్చారు?"

నేను—"అయ్యా, వీళ్ళు నది ఒడ్డుకు ప్రతి వారం షికారుకు వెళ్తూ వుంటారు. అక్కడే తయారు చేస్తూ వుండేవాళ్ళు. అక్కడే ఆవము తయారుచేసి వాటిని అందులో కాల్చి యీ రూపానికి తెచ్చారు".

ఉన్నతాధికారి-"ఆహా! మిత్రమా, మీ మెదడు చాలా అద్భుతమైనదిగా కన్పిస్తున్నది. మీ యీ ప్రయోగాలు కూడా చాలా అద్భుతమైనవి. ఇక్కడ మీకు సాధనాలేవీ దొరక నప్పుడల్లా నది ఒడ్డుకు పరుగెత్తేవాళ్ళు. పొలం మీది మట్టితో అడుసు తయారు చేసుకునేవాళ్ళు,



అంతేగదా? శాభాష్! ఇప్పుడు మీకు ........"

నేను తరువాత మాట్లాడటానికి ఆయనకు అవకాశమివ్వలేదు. నేను మధ్యలోనే అందుకున్నాను-"ఇప్పుడు మీరు యీ గదిలో కొంచెంసేపు విశ్రాంతిగా కూర్చోండి. నేను మా పిల్లల యితర కార్యక్రమాలను కూడా చూపిస్తాను." అందరూ గదిలో కూర్చున్నారు.

ప్రధానోపాధ్యాయుడు ఏదో ఆలోచిస్తూ ఆలోచిస్తూ అన్నాడు-"అయ్యా ఇవన్నీ మేమూ చేయగలం. అయితే పిల్లలకు ఇంకా చదువు చెప్పేదెప్పుడండీ?"

ఇంతలో నేను కొన్ని అట్ట ముక్కలు తెచ్చాను. ఒక అట్ట మీద నేను బోధన ప్రారంభించిన సమయంలో యీ పిల్లలు వ్రాసిన అక్షరాల నమూనాలున్నాయి. రెండో అట్టమీద నిన్న వ్రాసిన అక్షరాల నమూనాలున్నాయి. అట్టమీద 'అక్షర ప్రగతి సూచించు పత్రం' అని వ్రాసి వుంది.

అందరికీ అక్షర ప్రగతి చాలా బాగా వుందనిపించింది.

కాని ఒక ఉపాధ్యాయుడు మరో ఉపాధ్యాయునితో గుసగుసలాడుతున్నాడు-"అరే పో, యివన్నీ బాగా వ్రాయగలిగిన వాళ్ళను కూర్చోబెట్టి నెమ్మదిగా, కుదురుగా వ్రాయించి వుంటాడు."

ఆ ఉపాధ్యాయుని దురభిప్రాయం నాకు చాలా బాధ కలిగించింది. కాని నేను లక్ష్యపెట్టలేదు. నాకు వాళ్ళ యీ అభిప్రాయం తుచ్ఛమైనదిగా కన్పించింది.

ఉన్నతాధికారి-"మిత్రమా, మీరు యీ మార్పును, యీ సంస్కరణను ఏవిధంగా సాధించ గలిగారు?"

నేను-"అయ్యా, రకరకాల ఉపాయాలతో."

ఉన్నతాధికారి-"మీ ఉపాయాలన్నిటినీ పాఠశాలలోని అన్ని క్లాసులలో ప్రవేశపెట్టితే ఎలా వుంటుంది?"

నేను-"తప్పకుండా ప్రవేశపెట్టవచ్చు. తగిన ఫలితాన్ని కూడా మీకు చూపించగలను."

తరువాత నేను మరో పుస్తకం తెచ్చాను. అందులో గత ఆరు మాసాలలో విద్యార్థులు మొత్తం ఎన్ని పుస్తకాలు చదివారో వాటి వివరణ పట్టిక వుంది. పుస్తకంలో ప్రతి పేజీ మీద విద్యార్థి పేరు వ్రాసి వుంది. విద్యార్థి పుస్తకం చదివిన తరువాత స్వయంగా తన చేతులతో యీ పుస్తకంలో ఆ చదివిన పుస్తకం పేరు వ్రాస్తాడు.

దీనిని బట్టి ఆఖరు పేజీలో నేను కొన్ని అంకెలు ఇచ్చాను. ఎంత మంది విద్యార్థులు మొత్తం ఎన్ని పుస్తకాలు చదివిందీ, చదివిన పుస్తకాల సరాసరి, అందరి కన్న ఎక్కువ పుస్తకాలు ఎవరు చదివిందీ, అందరికన్న తక్కువ పుస్తకాలు ఎవరు చదివిందీ వివరంగా అందులో తెలియ పరచాను. ఇక పుస్తకాల దృష్ట్యా ఏ పుస్తకం ఎక్కువగా చదవ బడిందీ, ఏ పుస్తకం తక్కువగా చదవబడిందీ కూడా నోట్‌చేశాను. చదివిన పుస్తకాల వర్గీకరణ చేసి ఏ విషయానికి సంబంధించిన పుస్తకాలు ఎక్కువగా చదివారో, కూడా వివరాలు ఇచ్చాను.

ఉన్నతాధికారి ఆ పట్టిక చూశాడు? ఆయనకు ఆశ్చర్యం వేసింది. ఆయనన్నాడు—"ఇన్ని పుస్తకాలు చదివారా! ఇన్ని విషయాల పుస్తకాలు చదివారా! ఇవన్నీ ఎప్పుడు చదివి వుంటారు?"

"అవునయ్యా, ఇన్ని పుస్తకాలు చదివారు. నా కళ్ళ ఎదుటే చదివారు."

ఉన్నతాధికారి ప్రశ్నించాడు—"హెడ్‌మాస్టరుగారూ, మీ ఏడో క్లాసు విద్యార్థులు యీ ఆరు మాసాలలో ఎన్ని పుస్తకాలు చదివి వుంటారు?"

ప్రధానోపాధ్యాయుడు—"అయ్యా, ఎలా చదవగలరు? వాళ్ళు ఇతర పుస్తకాలు చదువుతూ కూర్చుంటే చరిత్ర, భూగోళం, రేఖా



గణితం మొదలైనవన్నీ ఏమయిపోతాయి? ఇవన్నీ ఎప్పుడు కంఠస్థం చేసుకుంటారు?"

ఉన్నతాధికారి మౌనంగా ఏదో ఆలోచిస్తూవున్నాడు. తరువాత నావైపు చూస్తూ అన్నాడు—"మీ విద్యార్థులను భాషలో పరీక్ష లేకుండానే ప్యాస్ చేయవచ్చు. ఇంకా ఏమేమి మిగిలాయో చెప్పండి."

నేను విద్యార్థుల చేతి వ్రాత పత్రిక ఒకటి ఆయన ముందు వుంచాను.

ఉన్నతాధికారి అన్నాడు—"ఈ వ్యాసాలన్నీ ఈ విద్యార్థులవేనా?"

"అవునండీ!"

"ఒకటి రెండు కవితలు ఉన్నట్లుంది. అవి కూడా?"

"అవునండీ! ఇప్పుడిప్పుడే నా విద్యార్థులు కొందరు కవిత వ్రాయడానికి ప్రయత్నిస్తున్నారు."

"వాళ్ళు వ్రాసిన కవితలను మీరేమైనా సంస్కరించారా?"

"లేదండీ, ఇంత వరకు అలా చేయలేదు. వాళ్ళు వ్రాసింది వ్రాసినట్లు యథాతథంగా పత్రికలో వ్రాయ బడింది."

"విద్యార్థులు స్వయంగా ఆలోచించి వ్రాశారా, ఎక్కడనుంచైనా ఎత్తి వ్రాసుకొచ్చారా, లేక మీరేమైనా వాళ్ళకు మధ్య మధ్య అందిస్తూ ఉంటారా?"

"అటువంటిదేమీ లేదండీ. నేను వాళ్ళతో ఇలా చెపుతుంటాను— 'మీ ఇష్టం వచ్చింది వ్రాయండి, మీకు తోచింది వ్రాయండి. ఏదయినా వ్రాయవచ్చు. ఏది వ్రాసినా అది పత్రికకు ఎక్కించండి.' వాళ్ళకు అందరి వ్యాసాలూ నచ్చినట్లుగానే ఉంటాయి. అన్నీ పత్రికలో వ్రాయిస్తాను నేను."

ఉన్నతాధికారి—"ఈ సంచిక ముఖ్యంగా ఆరు మాసాల పరీక్ష కోసం తయారు చేయించారా?"

నేను—"లేదండీ, గత మూడు మాసాలనుంచి ప్రతినెలా యీ పత్రికను ప్రకటిస్తూనే వున్నాము. ఈ నెల కూడా అలా చేయబడినదే. అయితే పరీక్ష కూడా కలిసి వచ్చింది. కనుక యీ సంచికను మీ ముందు ఉంచాము. అంతే కాని ఇది ప్రత్యేకంగా పరీక్షకోసం తయారు చేసింది కాదు."

ఉన్నతాధికారి సంతోషంగా తల ఊపాడు. తరువాత అన్నాడు—"ఇది చాలా చక్కని పని" మళ్ళీ నా వైపు చూచి అన్నాడు-"మిత్రమా, మీరు చాలా అద్భుతమైన పని చేసి చూపిస్తున్నారు. ఆరు మాసాలలో ఎక్కడ నుంచి ఎక్కడికి ఎదిగిపోయారో చూడండి!"

ప్రధానోపాధ్యాయుడు నెమ్మదిగా అన్నాడు—"గణితమూ, భూగోళమూ, చరిత్ర మొదలైన విషయాలలో పరీక్ష ఎప్పుడండీ? అది చూడటానికి మధ్యాహ్నం తరువాత మేమందరం రావచ్చా?"

బహుశా ప్రధానోపాధ్యాయుడు ఇలా అని నన్ను ఎగతాళి చేయాలని చూస్తున్నాడు. నేను ఇంతవరకు గణితమూ, భూగోళమూ, చరిత్ర మొదలైన విషయాలలో ఏమీ పని చేయలేదని ప్రధానోపాధ్యాయుడికి తెలిసి వుంటుంది. నేనన్నాను—"అయ్యా, భూగోళమూ, గణితమూ నేను యింకా ముట్టుకోనట్లే. పన్నెండో మాసానికి ఆ పని కూడా పూర్తి చేసి చూపిస్తాను. చరిత్ర బోధనలో మాత్రం కొంత పని జరిగింది."

ప్రధానోపాధ్యాయుడు-"ఓహో! అలా చెప్పండి, అయితే అసలైన విషయాలు అలాగే వుండి పోయాయన్న మాట!"

ఉన్నతాధికారి—"హెడ్‌మాస్టరుగారూ, అవి మీ దృష్టితో చూస్తే అలాగే ఉండిపోయాయి. కాని వీరి దృష్టిలో అయితే అలా కాదు. మీ అభిప్రాయంలో చరిత్ర, భూగోళం, గణితం, కొండలూ, బండలూ మొదలైన వాటిల్లోనే చదువంతా ఇమిడి వుంది. ఏమండీ, అంతేగదా!"

ఉన్నతాధికారి బాగా హుషారుగా ఉండడం చూచి ప్రధానోపాధ్యా



యుడు అన్నాడు-"అయ్యా, మీ దృష్టి కూడా అటువంటిదే గదా! మీరు కూడా యీ విషయాలలోనే మమ్మల్ని మంచి ఫలితాలు సాధించాలని కోరుతూ ఉంటారు గదండీ!"

అందరూ నవ్వుకుంటూ లేచారు. నా క్లాసుకు సంబంధించి నంతవరకు ఆరుమాసాల పరీక్ష పూర్తయింది. వెళ్ళేటప్పుడు ఉన్నతాధికారి నాతో అన్నాడు—"మీ పరీక్షా పత్రం ఏదీ?"

నేను చెప్పాను—'అది యింకా తయారు చేయలేదు.'

ఉన్నతాధికారి—"సరే మంచిది. మీ క్లాసుకు పరీక్ష నుంచి మినహాయింపు ఇస్తున్నాను."

# అంతిమ సమావేశం

ఆరు మాసాల పరీక్ష అయిపోయింది. ఒకరోజు మా పాఠశాల ఉపాధ్యాయులూ నేనూ కూర్చొని మాట్లాడుకుంటూ వున్నాము. చంద్రశేఖర్ నాతో అన్నాడు—"నిజం చెపుతున్నాను. నాకు మీరు ఒక విచిత్రమైన మనిషిగా కన్పిస్తున్నారు. మీ ప్రయోగం సఫలమయిందని నేను అంగీకరిస్తున్నాను. ప్రాథమిక పాఠశాల బోధనా పద్ధతిలో కూడా యింత చక్కని మార్పులు చేయవచ్చుననే విషయం మేము విశ్వసించలేక పోయే వాళ్ళం."

భద్రశంకర్ అన్నాడు—"బ్రదర్ వీరు ఇంగ్లీషు చదువుకున్న వారుకదా? ఇంగ్లీషు పుస్తకాలు చదువుతారు. కొత్త కొత్త ప్రయోగాలు చేస్తుంటారు."

చంపక్‌లాల్ అన్నాడు—"వీరు చేస్తున్నారు సరేలే! కాని అందరూ అలా చేయలేరు. వీరికి డబ్బు సంపాదించాలనే చింతలేదు. ఫలితాన్ని గురించిన చింతలేదు. ప్రయోగం విఫలమయినా వారికి పడే శిక్ష ఏమీ లేదు!"

వేణీలాల్ అంటున్నాడు—"బ్రదర్, ఈ ప్రయోగం మనం ఎలా చేయగలం? మనకు సమయం దొరికే దెప్పుడు? ఇన్ని విషయాలు ఆలోచించడానికీ, ఇన్ని ఏర్పాట్లు చేయడానికీ ఎవరికి తీరుతుంది? మనం



చేయదలచుకున్నా ఎలా చేయగలం? ఇంటి దగ్గర ట్యూషన్ చెప్పుకోవాలా? సాయంత్రం పూట రోజూ హెడ్‌మాస్టరు గారి ఇంటికి వెళ్ళి హాజరు వేయించుకోవాలా! ఇంటి దగ్గర పిల్లల్ని సంబాళించుకోవాలా! బంతులకూ బారసాలలకూ వెళ్లాలా! కులవృత్తి మానుకోకుండా చూసుకోవాలా! ఇన్ని పనులు చూసుకున్న తరువాత ఇంకా మనకు తీరిక ఎక్కడుంటుంది? ఓపిక యెక్కడుంటుంది? ఏదయినా చేయాలని వున్నా ఎలా చేయగలం? ఈయన గారంటారూ! ఒంటరిగాడు. పనిపాటలు లేని వాడు. ఈయనే అలా చేయగలడు."

చివరకు నేనన్నాను—"మిత్రులారా! ప్రస్తుతపు ప్రాథమిక విద్యా ప్రణాళిక స్వరూపం మారితే ప్రాథమిక పాఠశాలలో మనం యింత కన్న ఎక్కువ పనే చేయగలం. అయితే బాగా పనిచేసే వాళ్ళు అవసరం. ప్రపంచ స్వరూపం ప్రస్తుతం ఉన్నట్లు పూర్వం ఉండేది కాదు. ప్రపంచ స్వరూపాన్ని మార్చింది మనుషులే గదా! ఆసక్తి వుండాలి. ఆత్మ విశ్వాసం ఉండాలి. ఏకాగ్రత ఉండాలి. ఇంగ్లీషు చదువుకున్న వాళ్ళే మంచిమంచి ప్రయోగాలు చేయగలరనే మాట అర్థం లేనిది. మనిషి ఏమీ చేయదలచుకోనప్పుడే ఇటువంటి వంకలు పెడుతూ వుంటాడు. వాస్తవంగా కావలసినది ఆసక్తి. మనసులో ఏ కార్యాన్నయినా సాధించాలనే తపన ఉండాలి. చంపక్‌లాల్‌గారూ, ఫలితాన్ని గురించి ప్రయోగం చేసే వ్యక్తికి ఉన్నంత చింత మరొకరికి ఎప్పుడూ ఉండదు. మీరు జీతం పెరగాలనే కోరికతో మంచి ఫలితాలు సాధించడానికి ప్రయత్నిస్తారు. నేను ప్రయోగం కోసం ప్రయోగం చేస్తున్నాను. నా ఆశయం సాధించడానికి, నా కార్య రంగం విస్తృతం కావడానికి నేను ప్రయత్నిస్తున్నాను. నా వైఫల్యం నా తరువాత వచ్చే ప్రయోగకర్తలకు అవరోధం కారాదనే చింత నాకూ వుంటుంది. దేవీలాల్ గారూ! మన వృత్తికీ, కుల వృత్తికీ సంబంధం ఏమిటి? బంతులకూ,

బారసాలలకూ, సమావేశాలకు, సమారాధనలకూ వెళ్ళిరావడం కూడా ఒక పనేనా? గప్పాలు కొట్టుకుంటూ తిరగడం కూడా ఒక పనేనా? వాటికి కూడా తీరిక కావాలా? ఇవి కూడా పనులే నంటారా? హెడ్‌మాస్టరు గారింటికి రోజూ వెళ్ళవలసిన అవసరం ఏముంది? మీరు బాగా పని చేసి చూపించండి. ఆయన ఎంతో సంతోషిస్తాడు. ముఖస్తుతితో ఎవరైనా సంతృప్తి పడతారా? పని చేతగాని వ్యక్తులే ముఖస్తుతి చేస్తూ వుంటారు. స్తోత్ర పాఠాలు వల్లిస్తూ వుంటారు. పాఠశాలలో మనం విద్యార్థులకు హృదయ పూర్వకంగా పాఠాలు బోధిస్తూ వుంటే ఏ విద్యార్థికైన ట్యూషన్ అవసరం ఎందుకు వుంటుంది? అటువంటి అవసరాన్ని ఎందుకు కల్పించాలి? మనం యిక్కడ మనస్సు లగ్నం చేసి చదువు చెప్పడం లేదు. అందుకే ట్యూషన్ అవసరమవుతున్నది."

శివశంకర్ మధ్యలోనే అందుకున్నాడు—"మిత్రమా! మరి జీతం తక్కువగా వచ్చేవాళ్ళు ఏం చేయాలి? మీకు కోరినంత జీతం, మాకు ఆ జీతపు రాళ్ళతో జీవనం కూడా గడవడం లేదు."

నేనన్నాను—"మీరు తగినంత జీతం కావాలని కోరండి. మీ కోర్కెను సాధించుకోండి. మీకు హెచ్చు జీతం లభిస్తుంది."

విశ్వనాథ్ అన్నాడు—"అయ్యా హెచ్చు జీతం లభిస్తుందంటారా? ఎక్కువ జీతం రాకపోగా ఉద్యోగం నుంచి ఉద్వాసన తప్పదు!"

నేనన్నాను—"ఉపాధ్యాయులంతా కలసి అధిక వేతనాల కోసం ఆందోళన చేయండి. ఎంత మందిని ఉద్యోగం నుంచి తొలగిస్తారో చూద్దాం! అసలు వాళ్ళు ఉద్యోగం నుంచి తొలగించే దాకా మనం ఎందుకుండాలి? మీరే స్వయంగా ఉద్యోగం నుంచి తప్పుకొనడానికి ఎందుకు సిద్ధంగా ఉండకూడదు? మీరు కొంచెం నిర్భయంగా ఉండడం నేర్చుకోండి. నా సఫలతకు ఒక కారణం నేను నిర్భయంగా ఉండడమే."

భద్ర శంకర్ అన్నాడు—"మరి పొట్ట గడిచేదెలా?"



నేనన్నాను—"పొట్ట గడవడమంటారా? మనలో కొంచెం సాహసం వుండాలి. చేసుకుంటే వృత్తులే లేకపోయాయా? నేను చీపురు పట్టి కసవు ఊడ్చి అయినా కడుపు నింపుకొనడానికి ఇష్టపడతాను. మీ మాదిరిగా అర్ధాకలితో ఉండడం నేను సహించలేను. మీ జీతాలు కూడా ఒక జీతాలేనా?"

విశ్వనాథ్ అన్నాడు—"అయ్యా, ఒకడి ఉద్యోగం ఊడగొట్టారంటే ఆ ఖాళీలో జొరబడటానికి వంద మంది ఎగబడతారు. మీకేమయినా తెలుసా?"

నేనన్నాను-"అలా ఎగబడే వాళ్ళను నిరోధించాలి. మనం వాళ్ళకు చార్జి ఒప్పగించకూడదు. మన స్థానంలో కొత్త వాళ్ళు వచ్చి ఎలా పని చేస్తారో చూద్దాం. కొత్త వాళ్ళను చార్జి తీసుకోనివ్వం. మనం పాఠశాల చుట్టూ ఇరవై నాలుగు గంటలూ తిరగడానికైనా సిద్ధపడదాం. మనం ఎటూ గోతిలో పడివున్నాం. ఇతరులను కూడా ఆ గోతిలో ఎందుకు పడనివ్వాలి? మనం వాళ్ళకు నచ్చజెపుదాం-'అయ్యా, మీరు తిరిగి వెళ్ళిపోండి. మరో వృత్తి ఏదయినా చూసుకోండి! పొట్ట కూడా గడవని యీ వృత్తిలో చేరకండి. ఆకలితో మాడకండి. ఈ పొగడ్తల అగడ్తలో దూకకండి. ఈ బందిఖానాకు దూరంగా వుండండి' అని చెపుదాం."

తరువాత కొన్ని గంటల వరకు రకరకాల చర్చలు జరిగాయి. ఈ రోజు నా సహోపాధ్యాయులలో కొంత నూతనోత్సాహం రావడం చూశాను. నేను ఆలోచించాను, పాతకాలపు బానిసత్వపు పునాదులు కొంచెమైనా సడలినందుకు సంతోషించవలసిందే!

## 2

ఇప్పుడు నేను భూగోళం బోధించాలని ఆలోచిస్తూ వున్నాను. భూగోళానికి సంబంధించిన పాఠ్యపుస్తకం చూశాను. నిరాశను ఓ

ప్రక్కన వుంచేశాను. పాఠ్య క్రమం చూస్తే మనసులో బాధగానే వుంది. పిల్లల చేత నదుల పేర్లు, కొండల పేర్లు వ్యర్థంగా ఎందుకు వల్లె వేయించాలి? నాకు మాత్రం ఇవన్నీ జ్ఞాపకం వున్నాయా? నిన్న స్వయంగా డెప్యూటీ డైరెక్టరు గారే మ్యాప్‌లో ఆస్ట్రేలియాకు దారి వెతుక్కుంటున్నారు. ఎప్పుడో చిన్నతనంలో వల్లించిన భూగోళం ఎవరికి జ్ఞాపకం వుంటుంది? నేను ఆలోచించాను. అసలు యీ భూగోళం బోధించకుండా వుంటేనో! వాస్తవమైన భూగోళ శాస్త్రం అంటే ఏమిటో నేను స్వయంగా ఆఫ్రికాకు వెళ్ళినప్పుడే అర్థమయింది. ఆ తరువాతనే భూగోళం వైపు నా దృష్టి మళ్ళింది. ఇప్పుడు అందులో నాకు అమితమైన అభిరుచి వుంది. భూగోళ శాస్త్రం చాలా ఉపయోగకరమైనదిగా కన్పించింది. అయితే యీ విద్యార్థులకు ఇప్పటినుంచే భూగోళం ఎందుకు బోధించాలి? ప్రస్తుతం వున్న పాఠ్యక్రమం ప్రకారం నేను నడచుకోలేను. ఈ పాఠ్య పుస్తకం చూస్తుంటే నాకు నవ్వు వస్తున్నది. డైరెక్టరు గార్ని ఒకసారి కలుద్దామా! నేను నా విధానం ప్రకారం విద్యార్థులకు భౌగోళిక దృష్టిని కలిగించడానికీ, భూగోళ శాస్త్రంలో అభిరుచి కలిగించడానికి అనుమతి తీసుకోనా!

నేను డెప్యూటీ డైరెక్టరు గారి దగ్గరకు వెళ్ళాను.

ఆయన అడిగారు-"ఇలా ఊడి పడ్డారేమిటి?"

నేనన్నాను-''అయ్యా, పాఠ్యక్రమం నుంచి భూగోళం విషయాన్ని ఎందుకు తొలగించకూడదు."

"అలా వీలులేదు. పాఠ్యక్రమంలో భూగోళం చాలా ప్రాముఖ్యం గల విషయం. చరిత్ర కన్న భూగోళమే ఈనాడు ప్రయోజనకరమైనదిగా కన్పిస్తున్నది. మన ప్రయోగంలో విషయాలను మినహాయించే సమస్య లేదు. వున్న విషయాలను బాగా బోధించే విషయమే వుంది. అయితే మీరు ఏ విధానంతో నైనా బోధించండి. ఇతర ఉపాధ్యాయులకు భూగోళం



కూడా సరళమైన విషయమేననీ, సులభంగా బోధించవచ్చుననీ విశ్వాసం కలిగించండి. నా దృష్టిలో మీ ప్రయోగంలోని గొప్పదనం ఇందులోనే వుంది."

డైరెక్టరుగారు చాలా నేర్పుతో నా నోరు మూయించారు. అయినా నేను చెప్పాను-"అయ్యా, ఈ పాఠ్య క్రమాన్ని, ఈ పాఠ్య పుస్తకాన్ని నేను స్వీకరించలేను. నేను నా విధానం తోనే భూగోళం బోధిస్తాను. అందుచేత మీకు నిరాశ కలగదనే ఆశిస్తున్నాను."

ఉన్నతాధికారి అన్నాడు-''నేను కోరేది కూడ అదే."

కొంచెం సేపు ఆగి ఆయన మరో ప్రశ్న అడిగాడు—''లక్ష్మీ శంకర్ గారూ, ఈ పరీక్షలను గురించి మీ అభిప్రాయం ఏమిటి? మీ ఆలోచన ఎలా వుంది? నూతన బోధనా పద్ధతులను సమర్థించే వాళ్ళంతా పరీక్షలను వ్యతిరేకిస్తున్నారు. వాస్తవంగా పరీక్షలలోని దుర్గుణాలు కూడా చాలా భయంకరమైనవే! కాని మనం విద్యాశాఖను నిర్వహించాలి. మనం పరీక్షలను ఎలా తీసివేయగలం? మనకు ఫలితాల అవసరం కూడా వుంది. మనం పరీక్షలు తీసివేస్తే ఉపాధ్యాయులు హృదయపూర్వకంగా బోధించడం మానివేస్తారేమో! శిక్షణ పొందిన ఉపాధ్యాయుడు బోధిస్తున్నప్పటికీ అతనికి బోధించడం తెలుసునో లేదో పరీక్షలు లేకపోతే మనకు ఎలా తెలుస్తుంది? విద్యార్థి ప్రగతిని తెలుసుకొనడానికి ఏదో ఒక విధానమంటూ ఉండాలి గదా? ఇటువంటి కఠినమైన సమస్యను గురించి మీ అభిప్రాయం ఏమిటి?"

నేను చెప్పాను—"అయ్యా, మీ సమస్య యదార్థమైనదే. విద్యార్థి మనస్సు చదువులో లగ్నం కానంత కాలం, ఉపాధ్యాయుడు హృదయ పూర్వకంగా బోధించనంత కాలం పరీక్షల అవసరం ఉంటుంది. విద్యార్థి హృదయ పూర్వకమైన అభిలాషతో వచ్చి నప్పుడు, ఉపాధ్యాయుడు హృదయపూర్వకంగా బోధించడానికి సిద్ధపడినప్పుడు మాత్రమే పరీక్ష

లను తీసివేయవచ్చు. కిరాయికోసం తురాయి తగిలించుకునే ప్రస్తుతపు పద్ధతి వున్నంత కాలం పరీక్షల అవసరం పూర్తిగా వుంటుంది."

డైరెక్టరుగారు—"అయితే బ్రదర్, ఈ విషయంలో నేను కొన్ని మార్పులు చేయదలుచుకున్నాను."

నేనన్నాను—"ప్రస్తుతం మీరు ఆరుమాసాల పరీక్షలూ, వార్షిక పరీక్షలూ జరుపుతున్నారు. దీనికి బదులుగా మాసిక పరీక్షలు నిర్వహించడం ప్రారంభించండి. విద్యార్థిని పరీక్షల కొలబద్దతోనే కొలవ దలుచుకున్నప్పుడు పరీక్షలు తరచుగా జరిపితే విద్యార్థికి పరీక్షలకు సంబంధించిన అనుభవం కలుగుతుంది. పరీక్షలంటే ఉన్న భయం తొలిగిపోతుంది. అతి పరిచయంతో భయాన్ని భరించ గలడు. పరీక్ష తెలివిగల విద్యార్థుల ప్రగతినీ, ప్రతిభనూ కొలిచేదిగా కాకుండా వెనుకబడిన విద్యార్థులను మేల్కొల్పేదిగానూ, వారి బలహీనతను సరీగా అంచనా వేసేదిగానూ ఉండాలి. దృక్పథంలో ఇది గొప్ప మార్పు అనే చెప్పవచ్చు. తాము అధ్యయనం చేసిన విషయాలు తమకు బాగా తెలిసినవనే విశ్వాసం గల విద్యార్థులను పరీక్షల నుంచి మినహాయించ వచ్చు. విద్యార్థి స్వయంగా, స్వేచ్ఛగా తన బలహీనతను పరీక్షింప జేసుకొనడానికి రావాలి. అలా రాని విద్యార్థి తన బలహీనతను తొలగించుకొనే అవకాశాన్ని కోల్పోతాడని చెప్పాలి. పరీక్ష ద్వారా పరీక్షించ దగిన విషయాలలోనే పరీక్ష జరపాలి. మిగిలిన విషయాలను పరీక్షల నుంచి మినహాయించాలి. పరీక్షల సమయంలో విద్యార్థి పాఠ్య పుస్తకాలను చూసి కూడా సమాధానాలు వ్రాసే అవకాశం కల్పించాలి. జ్ఞాపకం రాని విషయాన్ని పాఠ్య పుస్తకంలో చూసుకోమని చెప్పాలి. తరువాత సమాధానం వ్రాయమని చెప్పాలి. జవాబుగా చెప్ప లేని వాళ్ళు పుస్తకం చూచి వివరించమని చెప్పాలి. జవాబులు వ్రాసేటప్పుడు విద్యార్థి పాఠ్యపుస్తకాన్ని ఏ విధంగా ఉపయోగించుకో గలుగుతున్నాడనేదే అతనికి పరీక్ష. ఇంతే కాకుండా మనం విద్యార్థులను మూడు



తరగతులుగా విభజించ వచ్చు-పై తరగతికి పంపించడానికి అర్హులైన వాళ్లు, అర్హత లేని వాళ్ళు, కొంత కాలం శ్రమపడి బలహీనతను తొలగించుకొని పై తరగతికి అర్హత సంపాదించుకో గలవాళ్ళు. ఉత్తీర్ణతలో ప్రథమ శ్రేణి, ద్వితీయ శ్రేణి అనే రివాజును రూపుమాపాలి."

డైరెక్టరుగారు మధ్యలోనే మాటకు అడ్డం వచ్చి అన్నారు—"మిత్రమా, వచ్చే సంవత్సరం మిమ్మల్ని నా సహాయకునిగా నియమించుకోవలసిన అవసరం వుంది."

నేను చిరునవ్వు నవ్వుతూ చెప్పాను—"పరీక్షలను ఉపాధ్యాయుల ద్వారానే జరిపించాలి. వాళ్ళకే తమ విద్యార్థుల శక్తి సామర్థ్యాలు ఎక్కువగా తెలిసివుంటాయి. విద్యార్థుల బలహీనతలు కూడా వాళ్ళకు పరిచయమై వుంటాయి. పై తరగతులకు అర్హులా కాదా అనే విషయం కూడా వాళ్ళే నిర్ణయించగలరు. పోతే విద్యార్థులను పరీక్షించడానికి కాకుండా, పరీక్షకులను పరీక్షించడానికీ, పరీక్షకులకు పరీక్షించే శక్తి సామర్థ్యాలు వున్నవో లేవో తెలుసుకొనడానికీ ఒక సహాయకుని అవసరం మాత్రం వుంటుంది"

డైరెక్టరు—''మీరు మరో అద్భుతమైన విషయాన్ని సూచించారు."

నేనన్నాను—''అవునండీ, యథార్థం అంతే!"

పరీక్షలను గురించి ఇంకా చెప్పవలసిన విషయాలు కొన్ని వున్నాయి. కాని ఆయనకు భోజనం వేళ అయింది. ఆయన లేచి నిలబడ్డాడు. ఆఖరుకు ఆయన నవ్వుతూ, నవ్వుతూ అన్నాడు—''సరే మంచిది, ఈ విషయాన్ని గురించి మరోసారి కూడా చర్చించుదాం. ముందు ఒకసారి మీరు ఉపాధ్యాయులందరినీ సమావేశ పరచి యీ విషయాన్ని గురించి ఒక ఉపన్యాసం యివ్వండి."

నేను ఆయనకు నమస్కరించి మనసులో యిలా ఆలోచించుకుంటూ బయలు దేరాను—"ఉపన్యాసం విని మారే ఉపాధ్యాయులు ఎక్కడున్నారు? పరీక్షల వ్యామోహం నుంచి వాళ్ళను తప్పించడం చాలా కష్టం. అది

ఒక్క డైరెక్టరు గారి ఆజ్ఞాపత్రం ద్వారానే సాధ్యం కాగలదు. కాని పాపం వాళ్ళు........."

3

నాలుగవ తరగతి పిల్లలకు భూగోళం పేరు తెలిసినదే. విషయం కూడా కొంచెం తెలుసుకునే వున్నారు. నేను మ్యాప్‌లు తెప్పించాను. కాతియావాడ్, గుజరాత్, బొంబాయి ప్రాంతాల మ్యాప్‌లు గోడకు తగిలించాను. అవి చూచి పిల్లలు ఆశ్చర్యపోయారు. ఇంతవరకు నేను వాళ్ళకు భూగోళం బోధించలేదు. వాళ్లు తమ నోట్‌బుక్స్‌లో నుంచి కాగితాలు చించుకొని, వాటిని గొట్టాలుగా చుట్టి వ్రేళ్ళకు తగిలించు కొంటున్నారు. నేను చూస్తూ వున్నాను.

నేను అన్నాను-"ఆ గొట్టాలు ఎందుకు తయారు చేశారు?"

పిల్లలు చెప్పారు-"అయ్యా, మ్యాప్‌లు వల్లించడానికి."

నాకు ఆశ్చర్యం వేసింది-"మ్యాప్‌లు కూడా వల్లిస్తారా? భూగోళ శాస్త్ర బోధన విచిత్రమైన పనే చేసింది." కొంచెం సేపు వినోదం కోసం నేను పిల్లలతో అన్నాను-"సరే, భావనగర్ చూపించండి."

ఒక విద్యార్థి బొంబాయి ప్రాంతపు మ్యాప్ మీద నలువైపులా దృష్టి పోనిచ్చాడు. బొంబాయి చదివాడు, అహమదాబాద్ చదివాడు, హైదరాబాద్ చదివాడు. క్రిందికి దిగి పూనా చదివాడు. మరలా ఇటు వైపు వచ్చి పోర్‌బందర్ చదివాడు. వెనుక నిలబడివున్న ఇద్దరు ముగ్గురు పిల్లలు భావనగర్‌ను వెతికే వుంచారు. వారి వ్రేళ్ళకు తగిలించుకున్న గొట్టాలు భావనగర్‌ను చూపించడానికి తొందరపడుతూ వున్నాయి. చివరకు ఒకడు అడగకుండానే భావనగర్‌ను చూపించాడు.

నేను ప్రశ్నించాను-"భావనగర్ యేదిక్కున వుంది?"

పిల్లలు పైకి, క్రిందికి, కుడివైపుకు, ఎడమవైపుకు చూచి



మనసులో ఏదో లెక్కగా లెక్కించుకొని చెప్పారు-"అయ్యా, ఉత్తరంగా వుంది."

మరో కుర్రాడు అన్నాడు-"ఉత్తరం పైన వుంది, దీనిని తూర్పు అంటారు."

నేను నవ్వుతూ అన్నాను-"పైన ఆకాశం వుంది. అక్కడ ఉత్తరం ఎక్కడ వున్నది?"

పిల్లలందరూ అన్నారు-"కాదండీ, పైన ఉత్తరం, క్రింద దక్షిణం."

మరో కుర్రాడు అన్నాడు—"అయ్యా, ఉత్తర-దక్షిణాలు పొడవు, తూర్పు-పడమరలు వెడల్పు."

మరొకడు అన్నాడు-"అయ్యా, సూర్యుడు ఉదయించే దిక్కు తూర్పు."

నేనన్నాను-"ఈ మ్యాప్‌లో సూర్యుడు ఎక్కడున్నాడో చూపించు?"

అందరూ ఆలోచనలో పడ్డారు.

నేను అడిగాను-"శత్రుంజయ్ నదిని చూపించండి."

పిల్లలు కాగితపు గొట్టంతో నదిని చూపించారు.

నేను అడిగాను-"ఇది ఎందులో కలుస్తుంది?"

మ్యాప్‌లో చూచి పిల్లలు చెప్పారు-"ఖంభాత్ అఖాతంలో."

నేను అడిగాను-"ఇటు అరేబియా సముద్రంలో ఎందుకు కలవదు?"

ఒక పిల్లవాడు అన్నాడు-"అయ్యా, అది దాని ఇష్టం. అది ఖంభాత్ అఖాతంలోనే కలిసి పోవలసి వుంటుంది."

నేను అడిగాను-"ఈ నది దిగువకు పోయి ఎందుకు కలుస్తున్నది?"

ఆ పిల్లవాడు అన్నాడు-"అయ్యా, అటువైపుకే ప్రవహిస్తున్నది.

చూడండి, దక్షిణం ఇటు క్రిందివైపునే వుంది?"

నాకు ఆశ్చర్యం వేసింది. గత సంవత్సరం చదివిన భూగోళం వాళ్ళు మరచిపోలేదు. బాగా వల్లె వేశారని చెప్పడానికి ఇదొక ఉదాహరణగా వుంది. ఈసంవత్సరం కూడా నేను ఆ విధంగానే బోధిస్తే అది భూగోళ శాస్త్రపు బోధన అనిపించుకుంటుందా? నేను పిల్లలతో చెప్పాను—"మ్యాప్‌లు మడిచేసెయ్యండి. ఒక నెల తరువాత నేను భూగోళం ప్రారంభిస్తాను. ఇంకా కొన్ని రోజులపాటు మీరు చిత్రాలు గీస్తూ వుండండి."

పిల్లలు నావైపు చూస్తూ ఉండిపోయారు. చిత్రాలు గీయడం యీ పాఠశాలకు కొత్త విషయమే. పాఠ్యక్రమంలో దానికి స్థానం కూడా లేదు. పాఠశాలలో అటువంటి సృజనాత్మక ప్రవృత్తికి స్థానమే లేదు. అయితే నేను అటువంటి సృజనాత్మక ప్రవృత్తినొక దానిని ప్రోత్సహించ దలచుకున్నాను.

మరుసటి రోజు నేను పిల్లలతో చెప్పాను—''చూడండీ, మీరు చిత్రాలు గీయండి. మీ యిష్టం వచ్చినట్లు గీయండి, చూచి అయినా సరే గీయండి, ఒక చిత్రానికి నకలుగానైనా గీయండి, గుర్తు తెచ్చుకొని గీయండి. ఏ విధంగా గీసినా సరే. మనుషులను గీయండి, పశువులను గీయండి, పక్షులను గీయండి, గాలి పటాలను గీయండి, ఇళ్ళను గీయండి, చెట్లను గీయండి, పుష్పాలను గీయండి, ఆకాశాన్ని గీయండి, అనేక వస్తువులను గీయండి, మ్యాప్‌లు గీయండి, మీకు యిష్టమైనది గీయండి!"

అంతే, పలకల మీద బలపాలతో చిత్రాలు గీస్తూ వున్నారు. వంకరగానో, టింకరగానో ఏదో విధంగా చిత్రాలు తయారవుతూ ఉన్నాయి. ఉదయం పూటంతా చిత్రాలతోనే గడిచిపోయింది గంట మ్రోగింది. అప్పుడు అందరూ తలెత్తి చూశారు. క్లాసు టైమ్ అయిపోయింది.

నేను పిల్లలతో చెప్పాను—"మీ తల్లి దండ్రులెవరైనా పెన్సిళ్లూ, కాగితాలూ కొని పెడితే వాళ్ళందరూ కాగితాల మీదా, నోట్‌బుక్స్ మీదా చిత్రాలు గీయండి. మిగిలిన వాళ్ళందరూ పలకల మీదే గీయండి."



రెండు మూడు రోజులు యీ విధంగానే గడిచి పోయాయి. ఈ లోపల అనేక చిత్రాలు తయారయ్యాయి. కాని వాటిని చిత్రకారులైన వాళ్ళు యెవరూ కన్నెత్తి కూడా చూడరు. అయినా ఆ చిత్రాలు 'విద్యార్థుల కల్పనా శక్తికీ, సృజనాత్మక శక్తికీ ప్రతిబింబాలు.

నేను ఆలోచించాను—ఈ చిత్రాలను ప్రోగుచేసి ఉంచాలి. కొంచెం శ్రమ తీసికొని ప్రధానోపాధ్యాయుణ్ణి కలిశాను. ఒక మూల పడి వున్న పనికిరాని చిత్తు కాగితాల నన్నింటినీ బయటికి తీయించాను. ఆయన దగ్గర నుంచి రెండు డజన్లు రంగు పెన్సిళ్ళు తీసుకున్నాను. ప్రధానోపాధ్యాయుడు నవ్వుతూ అన్నాడు—''చదువును ఓ మూలకు నెట్టేసి చిత్రాలు గీసే యీ కొత్త పద్ధతిని ప్రవేశపెట్టి నట్లున్నారే!"

ప్రతి విద్యార్థిచేత చిత్రంలోని విషయాన్ని బట్టి ఒక్కొక్క పుస్తకం తయారు చేయించాను. ఆ పద్ధతిలోనే అందులో చిత్రాలు గీయమన్నాను. చిత్రాలకు తగిన వాతావరణం కల్పించడానికి వేప మండలూ, రావి ఆకులూ, తులసి మొక్కలూ రకరకాల పుష్పాలూ తెప్పించి వుంచాను. వర్తకుల దుకాణాల నుంచి రకరకాల పువ్వులద్దిన గుడ్డ ముక్కలు తెప్పించాను. మిత్రుల యిళ్ళ దగ్గర నుంచి నాలుగైదు మంచి చిత్రపటాలు తెప్పించి క్లాసులో గోడలకు తగిలించాను. సిరాబుడ్డి, కలం, చిన్న డబ్బీలు, అట్ట పెట్టెలు మొదలైన వస్తువులు అక్కడక్కడ అమర్చి పెట్టాను. బ్లాక్‌బోర్డు మీద పెద్ద పెద్ద అక్షరాలలో వ్రాశాను-''చిత్రాలు గీయండి, చిత్రాలు గీయండి, చిత్రాలు గీయండి! స్వయంగా గీయండి, మీరు చిత్రాలు గీయగలరు. గీస్తూ గీస్తూ వుంటే రోజు రోజుకూ మంచి మంచి చిత్రాలు గీయగలరు, చిత్రాలు గీయండి!"

పిల్లలు చిత్రాలు గీయడానికి ఎగబడ్డారు. కొందరు గుడ్డ ముక్కల

మీద ప్రింట్ చేసి వున్న లతలను, పుష్పాలను చిత్రీకరించారు. కొందరు నగిషీలు చెక్కారు. కొందరు పుష్పాలను గీశారు. రకరకాల పుష్పాలను వాటి అసలు రంగులు పులిమారు. చిత్రాలు బొత్తిగా గీయలేని ఒకరిద్దరు మిగిలిన వాళ్ళు ఎలా గీస్తున్నారో చూస్తూ కూర్చున్నారు.

ఒక పక్షం రోజులు గడిచాక నేను హైస్కూలు నుంచి ఒక చిత్ర కళోపాధ్యాయుణ్ణి తీసికొని వచ్చాను. నేను ఆయనతో అన్నాను—"మీరు చిత్రాలు గీయడం నేర్ప నవసరంలేదు. బోర్డు మీద మీ యిష్టం వచ్చిన చిత్రాలు గీస్తూ వుండండి. కాని కొంచెం నెమ్మదిగా, వివరంగా గీస్తూ ఉండండి. చెట్టును చూస్తూ చెట్టను గీయండి. కుర్చీని చూస్తూ కుర్చీని గీయండి." చిత్ర కళోపాధ్యాయుడు ఆ విధంగానే చేశాడు. విద్యార్థులు తన్మయత్వంతో చూస్తూ వున్నారు. మరుసటి రోజు చిత్రాలు గీసే పని మరింత జోరుగా సాగింది. విద్యార్థులు చిత్రకళను ప్రత్యేకంగా అభ్య సించారా అనిపిస్తున్నది. ఆ తరువాత నేను వాళ్ళు గీసిన చిత్రాల క్రింద వాళ్ళ పేర్లు, తారీఖు వ్రాయించాను.

కొద్ది రోజులు గడచిన తరువాత ఆ చిత్రకారుణ్ణి మళ్ళీ పిలిపించాను. రకరకాల చిత్రాలకు రంగులు ఎలా వేయాలో వివరించమని కోరాను. చిత్రకారుడు అయిదారు చిత్రాలకు వివరంగా రంగు పెన్సిలుతో రంగులు పులిమాడు. విద్యార్థులకు రంగులు వేసే పద్ధతిని చూపించిన తరువాత కొత్త కొత్త ఉపాయాలను కనిపెడుతున్నారు.

కొన్నాళ్ళ తరువాత నేను నా మిత్రుడైన ఒక సర్వేయర్‌ను పిలిపించాను. పాఠశాలను చూచి దాని ప్లాను గీయమన్నాను. నేను నా మిత్రుడూ పాఠశాలను కొలుస్తూ దాని ప్లాను తయారు చేస్తున్నాము. పిల్లలు మావెంట తిరుగుతూ ప్లాను తయారు చేయడం చూస్తూ వున్నారు. వాళ్ళ కళ్ళ ముందే మేము కాగితం మీద పాఠశాల భవనం మ్యాప్‌ను గీసి చూపించాము. నేను పిలలను నాలుగైదు రోజులు సర్వేయరు గారి



ఆఫీసుకూ్కడా పంపించాను. అక్కడ వాళ్ళకు ప్లానులు గీసే వాళ్లు గ్రామాలూ, వీధులూ, పొలాలూ, గట్లూ, గుట్టలూ, మొదలైన వాటి ప్లానులు ఎలా తయారు చేస్తారో వివరించారు. ఒకసారి ఇద్దరు పిల్లలను సర్వేబృందంతో పాటు గ్రామ పొలిమేరలకు తీసికొని వెళ్ళాను. వాళ్ళకు సర్వే చేయడం ప్రత్యక్షంగా చూపించాను. ఈవిధంగా ఇప్పుడు పిల్లలు పాఠశాల, పాఠశాలలోని గదులూ, తమఇళ్ళూ, వీధులూ, బజారులూ బావులూ, చెరువులూ మొదలైనవాటి చిత్రాలు గీయడం ప్రారంభించారు. చిత్ర కళను వృద్ధిచేయడానికి వాళ్ళను అప్పుడప్పుడు ప్రకృతి దృశ్యాలను చూపడానికి తీసికొని వెళ్తూ వుండే వాడిని. ఏ వస్తువునైనా కళ్ళతో చూసి అంచనా వేసుకోనడం అభ్యసింప జేయడానికి వాళ్ళచేత రకరకాల ఆటలు ఆడించే వాణ్ణి. ఏదయినా ఒక చెట్టును చూసినప్పుడు దాని కాండమూ, కొమ్మలూ మొదలైన వాటిని చూస్తూనూ, చూడకుండా ఊహించుకుంటూనూ కాగితం మీద చిత్రాన్ని గీయడం, సూర్యోదయం సమయంలోని రంగురంగుల కాంతులను చూచి వాటిని స్మరణలో వుంచుకోవడం, సూర్యాస్తమయ కాలంలో మారుతున్న రంగుల ప్రత్యేకతలను చూడటం, వాటిని తమ అనుభవంలోకి తెచ్చుకోవడం, ఒక చెట్టు దూరం నుంచి చూస్తే ఎలా కనిపిస్తుందో, దగ్గరగా వుండి చూస్తే ఎలా కన్పిస్తుందో గుర్తుపెట్టుకోవడం, చెట్లూ, చేమలూ, పర్వతాలూ, పదార్థాలూ, మనుషులూ, పశువులూ మొదలైన వాటి నీడలు ఎలా పెరుగుతూ, తరుగుతూ వుంటాయో బాగా చూడటం మొదలైనవి అభ్యసింప జేశాను. ఈ విధంగా కొద్దిరోజుల్లోనే నా క్లాసులో చిత్ర కళకు సంబంధించిన కార్యక్రమం చిత్రంగా సఫలమయింది.

## 4

ఒకరోజు హైస్కూలు నుంచి ఒక దుర్భిణి (బైనాక్యులర్) తీసికొని

వచ్చాను. దూరపు వస్తువులు ఎలా దగ్గరగా కనిపిస్తాయో పిల్లలకు అందులో చూపించాను. వాళ్ళకు చాలా ఆశ్చర్యం వేసింది. ఆ రోజంతా వంతుల ప్రకారం ఒకరి తరువాత ఒకరు దుర్భిణిని కంటి దగ్గర పెట్టుకొని చూస్తూ వున్నారు. రాత్రిపూట గ్రహాలనూ, నక్షత్రాలనూ చూడటానికి ఒక టెలిస్కోపు తీసికొని వచ్చాను. "మీరు చాలా శ్రమ చేస్తున్నారండీ!" అనేవాళ్ళు మిత్రులు.

ఇటువంటి సందర్భాలలో నా సహోపాధ్యాయులు నాదగ్గరే వుంటున్నారు. ఇప్పుడు నన్ను నిందించడం మాని నాదగ్గర ఏదయినా నేర్చుకోవాలనే ఆసక్తి చూపుతున్నారు. వారానికి ఒక గంట ఉపాధ్యాయులందరూ నా క్లాసులోకి వచ్చి నేను ఎలా పనిచేస్తున్నదీ చూస్తూ వుండవలసినదని డైరెక్టరుగారు ఆదేశించారు.

ఆ సాయంత్రం చీకటిపడిన తరువాత నేను నా విద్యార్థులకు టెలిస్కోపులో చంద్రుణ్ణీ, నక్షత్రాలనూ చూపించాను. 'ఆహాహా,ఆహాహా' అంటూ ఆనందంతో కేకలు వేశారు!

చంద్రుణ్ణి చూపిస్తూ నేను చెప్పాను-"చూడండీ, చంద్రునిలో రాట్నం త్రిప్పుతున్న ముసలమ్మ, మేకలాంటివి వున్నాయని మీరందరూ చెప్పుకుంటూ వుంటారే అవి చంద్ర గ్రహం మీద ఉన్న లోయలూ, పర్వతాలు. అక్కడ మనుషులు జీవించ లేనంత చల్లదనం వుంటుంది. పిల్లలు వింతగా నా ముఖం వైపే చూస్తూ వున్నారు.

నేను చెప్పాను-"మనం నివసిస్తున్న యీ భూమి, చంద్రగ్రహమూ అక్కా చెల్లెళ్లు. వీటికి తండ్రి సూర్యుడు."

విద్యార్థులు ఆశ్చర్యంగా నావైపే చూస్తూ వున్నారు.

ఒకడు అడిగాడు—"ఈ కథ ఏ పుస్తకంలో వ్రాసి వుందండీ?"

నేను చెప్పాను—"ఇది కథ కాదు, వాస్తవం"

పిల్లలు అన్నారు—"నిజమయినదేనంటారా?"



నేను చెప్పాను—"పిల్లలూ, అక్షరాలా నిజం."

ఈ సందర్భంగా నేను వాళ్ళకు సూర్యునిలోనుంచి భూమి ఎలా విడిపోయిందీ వివరించ నారంభించాను. పిల్లలు బాగా ప్రభావితులయ్యారు. రోజులు గడుస్తూ వున్నాయి. ఈ మధ్యలో నేను వాళ్ళకు భూమి ఎలా చల్లబడిందీ గుంటలూ, మెట్టలూ, లోయలూ, కొండలూ ఎలా ఏర్పడిందీ; నదులూ, సరోవరాలూ ఎలా ఏర్పడ్డాయి, నాచు, తుంగ, చేపలూ, కప్పలూ, నీటి జీవులూ, భూమి మీది ప్రాణులూ, అడవులూ, అడవి మనుషులూ, వాళ్ళ ద్వారా క్రమంగా ఈ నాటి మనుషులూ ఎలా ఏర్పడుతూ వచ్చారో వివరించాను. వాళ్ళకు యీ విషయాలు చాలా అద్భుతంగా కన్పించాయి. పిల్లలు చాలా ఏకాగ్రతతో వింటూ వచ్చారు. మా ప్రధానోపాధ్యాయులు ఏడవ తరగతి విద్యార్థులను కూడా యీ విషయాలు వినడానికి పంపించడం ప్రారంభించాడు.

ఒక రోజు నేను గ్లోబ్ తీసికొని వచ్చాను. పిల్లలతో చెప్పాను—"చూడండీ, ఈ పదార్థలన్నీ ఎలా ఏర్పడిందీ ఇది వరకే చెప్పాను."

తరువాత విద్యార్థులకు గ్లోబ్ చూపించి మరికొన్ని విషయాలు చెప్పాను. నీరు ఎక్కడ వున్నదీ, భూమి ఎక్కుడ వున్నదీ. నల్లవాళ్ళు ఎక్కడవున్నదీ, తెల్లవాళ్ళు ఎక్కడవున్నదీ, ఎఱ్ఱటివాళ్ళు ఎక్కడ వున్నదీ, పసుపు రంగు వాళ్ళు ఎక్కడవున్నదీ, పొట్టివాళ్ళు ఎక్కడ వున్నదీ, పొడుగు వాళ్ళు ఎక్కడ వున్నదీ వివరించాను. ఆ తరువాత నేను భూమి మీద నైసర్గిక విభాగాలూ, వాటి పేర్లూ చెప్పాను. మనం ఆసియాలో ఎక్కడ వున్నదీ తెలియ జేశాను—"ఆసియాలో ఇదిగో ఈ కనిపిస్తున్నది ఇండియా, ఇదిగో ఇండియాలో కాతియావాడ్. ఇదిగో భావనగర్, ఇక్కడ మనం ఉంటున్నాము."

నేను పిల్లలతో అన్నాను—"ఈ గ్లోబ్ తీసుకోండి. ఆ పెట్టెలో మ్యాప్‌లు ఉన్నాయి. వాటిని బయటికి తీయండి. గ్లోబ్‌లో యీ మ్యాప్‌లు

ఎక్కడెక్కడ కనిపిస్తాయో చూడండి."

నేను పిల్లలతో రోజూ ఏదో ఒక కొత్త విషయం చూడమని చెపుతూ వున్నాను. నేనన్నాను—"ఇప్పటి వరకూ మీరు చూసిన గ్రామాలూ, పట్టణాలూ వెతికి కనుక్కోండి. అక్కడికి ఏ మార్గాంలో పోవచ్చునో కూడా చూడండి. మార్గ మధ్యంలో ఏయే నదులున్నాయో ఏయే గ్రామాలున్నాయో చూడండి."

ఇదంతా ఒక పద్ధతిలో జరిగింది. ఇక మరో పద్ధతిలో మరికొన్ని విషయాలు చెప్పాను. నేను ఆఫ్రికాకు వెళ్లి చూసి వచ్చాను. అంచేత ఆఫ్రికా మ్యాప్‌ను దగ్గర పెట్టుకొని ఆఫ్రికా సంగతులు వాళ్ళకు వినిపించడం ప్రారంభించాను. విక్టోరియా, నియాంజా, టాంగానీకా, జాంబెసీ, నైలునదీ మొదలైన వాటిని గురించీ, ఆఫ్రికా సింహాలూ, ఏనుగులూ మొదలైన వాటిని గురించీ, ఆఫ్రికా నివాసులను గురించీ అనేక విషయాలు వివరించాను. తరువాత మరో రోజు చెప్పాను—"మన చుట్టుప్రక్కల వుండే చేతి వృత్తుల వాళ్ళనూ, చేనేత కార్మికులనూ, కుండలు చేసే వాళ్ళనూ, గొర్రెలు కాసే వాళ్ళనూ చూసిరండి!" ఇటువంటి వాళ్ళను చూపించే దృష్టితోనే వాళ్ళను వెంట బెట్టుకొని ఒకటి రెండు యాత్రలు కూడా చేయించాను. గ్రామమంతా చూపించాను. గట్టుమీదికీ, గుట్టమీదికీ తీసికొని వెళ్ళాను. నదీ తీరానికి తీసికొని వెళ్ళాను. కొండల దగ్గరకు తీసుకొని వెళ్ళాను. వాళ్ళకు భూగోళం పట్ల ఆసక్తిని కలిగించాను. వాళ్ళ మనసుల్లో అభిరుచిని కలిగించాను. అభ్యసించాలనే అభిలాష కలిగించాను.

ఆ తరువాత వాళ్ళకోసం భూగోళ సంబంధమైన పఠన మందిరం ఏర్పాటు చేయాలని ఆలోచించాను. కాని యాత్రా సంబంధమైన వర్ణనలు వున్నటువంటి మంచి మంచి పుస్తకాలు మాతృ భాషలో దొరకలేదు. దొరికిన పుస్తకాలనే వాళ్ళకు యిచ్చి చెప్పాను—"ఈ పుస్తకాలు చదువుతూ వుండండి. యాత్రీకుడు ఎక్కడ నుంచి ఎక్కడకు వెళ్తున్నాడో చూడండి. చదువుతూ చదువుతూ అతనితో పాటు మీరు గూడా తిరగండి"



విద్యార్థులు యాత్రాసంబంధమైన వర్ణనలు చదవడానికి బాగా ఇష్టపడుతున్నారు. కొందరికి కాతియావాడ్ సర్వస్వం చాలా ఆనందాన్ని కలిగించింది. మ్యాప్‌లో చూసి ఒక గ్రామాన్ని ఎంచుకొని, వాళ్లు ఆ సర్వస్వంతో ఆ గ్రామానికి సంబంధించిన విషయాలు చదవడం ప్రారంభించారు. ఈ విధంగా తెలిసినటువంటి, తెలియనటువంటి అనేక గ్రామాలకు సంబంధించిన విశేషాలను తెలుసుకున్నారు. శ్రీ రవిశంకర్ రావల్ చిత్రాలు వాళ్ళకు అహమదాబాద్‌ను బాగా పరిచయం చేశాయి. ప్రతి ప్రముఖమైన స్థానానికీ దాన్ని గురించి తయారు చేసిన చిత్రాధారం లభిస్తే చాలా బాగుంటుంది. ఒకరోజు మా పాఠశాలకు రవిశంకర్‌గారు వచ్చారు. ఆయన దగ్గర మద్రాసు దృశ్యాలకు సంబంధించిన ఫిల్మ్ ఒకటుంది. నేను ఆ ఫిల్మ్‌ను పిల్లలకు చూపించాను. ఒక వైపు దుష్ప్రభావాన్ని కలుగజేసే సినిమా మరోవైపు విలువైన విద్యాసాధనంగా, బోధనా సాధనంగా ఉపయోగ పడుతున్నది. దూర ప్రాంతాల దృశ్యాలను యథాతథంగా చూపించడం వలన విద్యార్థుల భౌగోళిక జ్ఞానం విస్తృతమవుతుంది. అభిరుచి కూడా అధికమవుతుంది. ఒకసారి సిజర్స్ సిగరేట్ వాళ్ళ ఎడ్వర్‌టైజ్‌మెంట్ పేపర్సు నా చేతి కొచ్చాయి. అందులో దేశ దేశాల మనుషుల చిత్రాలు ఉంటాయి. ఆ చిత్రాలను చూడమని విద్యార్థుల కిచ్చాను. వాళ్ళకు ప్రపంచాన్నంతటినీ పరిచయం చేయడం నా ఉద్దేశ్యం కాదు. వాళ్ళకు అంతా జ్ఞాపకం ఉంటుందని కూడా నేను అనుకోవడం లేదు. అయితే ప్రపంచం చాలా విశాలమైనదీ, అందులో చాలా విషయాలు చూడదగినవీ, తెలిసికో దగినవీ వున్నాయనీ, వాటిని చూడడానికి ఇవన్నీ సాధనాలు మాత్రమే ననే భావాన్ని వాళ్ళ మనఃఫలకాల మీద ముద్రించడమే నా ఆశయం.

నేను మరో ఆటను కూడా కల్పించాను. దాని పేరు "పదండి

యాత్రకు పదండి పోదాం!" విద్యార్థులు భావనగర్ నుంచి అహమదాబాద్‌కూ, ద్వారకకూ, బొంబాయికీ, హిమాలయాలకూ, విదేశాలకూ బయలు దేరుతారు. ఎలా బయలుదేరాలి, ఏయే బండ్లలో కూర్చోవాలి, ఎక్కడెక్కడ బండ్లు మారాలి, చూడదగిన ప్రదేశాలు ఏమేమి వున్నాయి ఆ ప్రదేశాలలో చూడదగినవి ఏమేమి వున్నాయి, యాత్రకు ఎంత కాలం పట్టుతుందీ, ఎవరెవరిని కలుసుకోవలసి వుంటుందీ, ఏమేమి కొన వలసి వుంటుందీ-మొదలైన విషయాలను ఆలోచించేవాళ్లు. వాస్తవంగా యాత్ర చేస్తే ఎంత ధనం ఖర్చవుతుందో అంచనా వేసే వాళ్ళు. పట్టణాల గైడ్స్ చూచి యాత్రలో చూడదగిన స్థానాల పేర్లు నోట్ చేసుకొనేవాళ్లు. భూగోళ శాస్త్ర పుస్తకంలో ప్రసిద్ధిగాంచిన వస్తువుల పేర్లు చదివి ఏమేమి కొన వచ్చునో నిశ్చయించుకొనే వాళ్ళు. నిజంగానే యాత్ర చేయబోతున్నారా అన్నట్లుగా విషయ సేకరణను అభ్యసించేవాళ్ళు. ఈ రకమైన అభ్యాసాన్ని భూగోళాన్ని బోధించే విధానంలో ఒక నమూనాగా వాళ్ళ చేత చేయిస్తున్నాను. మిగిలిన కార్యక్రమం అంతా విద్యార్థులకే వదలివేస్తున్నాను. మ్యాప్ చూసి వాళ్ళు అగ్గి పెట్టెలు ఎక్కడ నుంచి వస్తున్నాయో తెలుసుకొనడానికి ప్రయత్నిస్తున్నారు. మన దేశం నుంచి ప్రత్తి విదేశాలకు ఏయే మార్గాల ద్వారా పోతున్నదో తెలుసుకొనడానికి ఊహాలోకంలో ప్రత్తిబేలు మీద కూర్చొని ప్రయాణం చేస్తున్నారు. ఒకప్పుడు బజారులో తిరగడానికి వెళ్ళేవాళ్లు. ఒక దుకాణంలో ఏయే దేశాలు, ఏయే పట్టణాలు, ప్రోగయ్యాయో తెలిసికొనే వాళ్లు. ఒక్కొక్కప్పుడు నదుల పేర్లు ఒక్కొక్కప్పుడు పట్టణాల పేర్లు, ఒక్కొక్కప్పుడు పర్వతాల పేర్లు, అదే విధంగా భౌగోళిక వస్తువుల భౌగోళిక నామాలు మొదలైన వాటితో అంత్యాక్షరి ఆట ఆడేవాళ్ళు. చిత్రకళలో విద్యార్థులు ఎంత ప్రేమతో ఒక చెట్టును చిత్రించే వాళ్ళో అంత ప్రేమతో దేశదేశాల మ్యాప్‌లు గీయడంలో కూడా వాళ్ళకు ఆనందం కలుగుతూ వుండేది. వాళ్ల తాము



గీసిన మ్యాప్‌లో తాము చూసి నటువంటి, చదివినటువంటి, వినినటువంటి గ్రామాలనూ, నదులనూ, పర్వతాలనూ చూపించేవాళ్ళు. ఎక్కువ ప్రదేశాలు చూపించడానికి భూగోళం చదివి కొత్త కొత్త గ్రామాలు ఎక్కడెక్కడున్నాయో తెలుసుకొనేవాళ్ళు. ఈ విధంగా మా క్లాసులో భూగోళశాస్త్ర బోధన కొనసాగుతూవుంది.

నా సహోపాధ్యాయులు ఒకరోజు నాతో అన్నారు—"మిత్రమా, ఈ పని మీరు మాత్రమే చేయ గలరండీ. ఇన్ని విషయాలు మేము తెలుసుకోవాలన్నా తెలిసికోలేము. ఈ విధంగా భూగోళాన్ని గురించి చర్చించడం కూడా మాకు సాధ్యం కాదు."

నేనన్నాను—"బ్రదర్స్, మనసులో ఉత్సాహం ఉంటే, మనం కొంచెం శ్రమపడితే అన్నీ సాధ్యమవుతాయి."

## 5

వార్షిక పరీక్షలు దగ్గరకొస్తూ వున్నాయి. నేను నా కార్యక్రమాన్ని అంచనా వేసుకొనడానికి కూర్చున్నాను. అలా కూర్చొని గణితం సంగతి ఆలోచిస్తూ వున్నాను. అయితే నేను ఇంతవరకు గణితం ముట్టుకోలేదని కాదు, కాని దానిని గురించి చర్చించాలనే అభిలాష నేడే కలిగింది. గణితంలో పరీక్షించుదామని విద్యార్థులకు కొన్ని లెక్కలు చేయమని ఇచ్చాను. అందరూ సరిగానే చేశారు. మొదట్లో విద్యార్థులు లెక్కల విషయంలో బాగానే ఉన్నారని భావించాను. ఏ విషయంలో నేను ప్రత్యేకంగా ప్రయోగం ద్వారా కొత్త కార్యక్రమాన్ని చూపించలేక పోయానో, ఆ విషయంలో విద్యార్థులు వెనక బడకుండా ఉండటం మంచిదేనని భావించాను. కాని గణితానికి సంబంధించిన ప్రశ్నల మూలంలో ఉన్న తార్కిక పద్ధతిని ప్రయోగించి, వాళ్ల చేసిన విధానానికి కారణం అడగ్గానే వాళ్ళ బలహీనత బయట పడింది. గణితం విషయంలో వాళ్ళు అంధకారంలోనే

పడివున్నారు. వాళ్ళకు కూడటం, హెచ్చించటం మొదలైన వాటి జ్ఞానం బాగానే వుంది. కాని వాళ్ళ జ్ఞానం కృత్రిమమైనదీ, యాంత్రికమైనది. దీనికి ఉపాయమేమిటా అని ఆలోచించడం ప్రారంభించాను. నేను సందిగ్ధావస్థలో పడిపోయాను. గణితం నాకు అంత ప్రియమైన విషయంగాదు. అయితే ప్రస్తుతం గణితం బోధింపబడుతున్న విధానంలోని గుణదోషాలు నాకు బాగానే తెలుసు. ఆ దోషాలను ఎలా తొలగించాలో ఇంకా నేను అన్వేషించలేదు. అటువంటి స్థితిలో అది నాకు విషమ సమస్య అయిపోయింది. డెప్యూటీ డైరెక్టరు గారి వద్దకు వెళ్లాను. ఆయనతో స్పష్టంగా చెప్పాను.—"అయ్యా, గణితం విషయంలో నేను కొత్త కార్యక్రమమేదీ నిర్వహించి చూపించలేను. అయితే విద్యార్థులకు వివరంగానే గణితం బోధించాను, బోధిస్తాను. పాఠ్యక్రమం పూర్తి చేస్తాను."

డైరెక్టరుగారు అన్నారు—"ఎంచేత? గణితం బోధించే విధానంలో మార్పులు తీసికొని రావడానికి అవకాశం లేదా?"

నేనన్నాను—"అయ్యా, అవకాశం వుండటానికైతే వుంది. అయితే యీ మార్పు మూలంలోనే జరగాలి. పిల్లలకు ఒంట్లునేర్పే దగ్గరనుంచే ఉచితమైన పద్ధతిలో బోధించాలి. ఒక్కసారి తర్కబద్ధంగా అది మనసుకు పట్టక పోతే విద్యార్థి గణితంలో ఎప్పుడూ బలహీనంగానే వుంటాడు. గణితం అటువంటి విషయం.

డైరెక్టరుగారన్నారు—"అయితే మీరు వాళ్ళకు ఒంట్లు దగ్గర నుంచే గణితం ఎందుకు బోధించ కూడదూ?"

నేనన్నాను—"అలా చేయడానికి సమయం చాలదు. ఒకవేళ సమయం దొరికినా విద్యార్థులు లెక్కలు యాంత్రికంగా చేయడానికి బాగా అలవాటు పడిపోయారు. కారణాలు అడక్కుండా, తెలుసుకోకుండా లెక్కలు చేస్తున్నారు. అటువంటి వాళ్ళను సరయిన దారిలో పెట్టడం కష్టం—చాలా కష్టం."



డైరెక్టరు గారు అన్నారు—"అయితే యీ విద్యార్థులు లెక్కల విషయంలో........"

నేనన్నాను—"నా శక్తి కొలదిగా లెక్కలు బాగానే నేర్పుతాను. అయితే గణితం విషయంలో చేయగల ప్రయోగం వీళ్ళ మీద చేయలేను."

డైరెక్టరు గారు అడిగారు—"మీకు ఒకటవ తరగతి అప్పగించాననుకోండి, అప్పుడు ఆ క్లాసులో గణితం బోధించే విషయంలో ప్రయోగం జరుపుతారా లేదా?"

నేనన్నాను—"గణితంలో ప్రయోగం చేసేటప్పుడు ఒకటి, రెండు, అనే దగ్గర నుంచే ప్రారంభించాలని నేను ఆశిస్తున్నాను. అప్పుడే ఇదిగో, ఈ పద్ధతి మంచిదని నేను నమ్మకంగా చెప్పగలను. నా సహోపాధ్యాయులు కూడా గణితం విషయంలో ఏదో ఒక నూతన విధానం అనుసరించాలని ఉత్సాహపడుతున్నట్లు నాకు తెలుసు. వచ్చే సంవత్సరం నాకు ప్రయోగం జరిపే అవకాశం లభిస్తే నేనూ, చంద్రశంకర్ ఈ విషయంలో తప్పకుండా ప్రయోగం జరుపుతాం. మాంటిస్సోరీ గణిత పద్ధతి మంచిదని నేను భావిస్తున్నాను. అది సహజమైన పద్ధతి. దానిని నేను అధ్యయనం చేశాను. మననం చేసుకున్నాను. అయితే అనుభవంలో చూడలేదు."

డైరెక్టరుగారు నన్ను ప్రశ్నించారు?"వచ్చే సంవత్సరం మీరు డెప్యూటీగానూ, ట్రైనింగు స్కూల్లో ఉపాధ్యాయుని గానూ, గణితంలో ప్రయోగ కర్తగానూ పదవిని స్వీకరించగలరా?"

నేనన్నాను—"అయ్యా, అప్పటి సంగతి తరవాత చూద్దాం! కాని యీ సంవత్సరానికి మాత్రం గణితం విషయంలో ప్రత్యేకతనూ, కొత్తదనాన్నీ చూపించలేను."

## 6

వార్షిక పరీక్ష దగ్గరకు వచ్చింది. నా పద్ధతిలో విద్యార్థులను పరీక్ష కోసం తయారు చేస్తున్నాను. విద్యార్థులు చాలా ఉత్సాహంతో పరీక్షకు సిద్ధమవుతున్నారు. పరీక్షలో విద్యార్థులు కృతార్థులు కాగలరనే విశ్వాసం నాకు బాగావుంది.

పరీక్ష రోజు రానే వచ్చింది. ఉన్నతాధికారి గారు అన్ని తరగతులను పరీక్షించడం పూర్తి చేశారు. ఈ రోజు నా క్లాసు పరీక్షిస్తారు. మా షరతు ప్రకారం నా క్లాసును ఆయనే పరీక్షించాలి. ఆయన నవ్వుతూ అన్నాడు—"లక్ష్మీశంకర్‌గారూ, నేను మీ క్లాసును పరీక్షించను. మీ క్లాసులోని విద్యార్థుల నందరినీ పై క్లాసుకు ప్రమోట్ చేస్తున్నాను."

నేనన్నాను—"వద్దండీ, అలా చేస్తే నా క్లాసులో కొంతమంది విద్యార్థులకు న్యాయం జరగదు."

డైరెక్టరుగారు అడిగారు—"అయితే కొందరికి అన్యాయం జరుగుతుందంటారా?"

నేనన్నాను—"అవునయ్యా, కొందరికి పై క్లాసుకు వెళ్ళే అర్హత లేదు. వాళ్ళను నేను పై క్లాసుకు పంపించలేను."

డైరెక్టరు గారు అన్నారు—"మీరు అందరికీ చక్కగా బోధించినట్లు గానే నాకు కన్పిస్తున్నది. మీ బోధనను నేను అంగీకరిస్తున్నాను."

నేనన్నాను—"అయ్యా, మీరు చెప్పేది నిజమే! కాని నా బోధనా పద్ధతి ప్రభావం అందరి మీదా సమానంగా ఉండదుకదా! ఒక విద్యార్థిని అది స్పృశించనేలేదు. కొందరు దీని ప్రభావానికి పూర్తిగా దూరంగానే ఉండిపోయారు."

డైరెక్టరు గారు అన్నారు.—"సరే మంచిది, అలా పాఠశాలకు పనికిరాని వాళ్ళు ఎవరెవరు ఉన్నారు?"

నేనన్నాను—"అయ్యా, వాళ్ళు పాఠశాలకు పనికిరాని వాళ్ళు



కాదు. పాఠశాలే వాళ్ళకు పనికిరానిది. వాళ్ళు ఏ పనికి అర్హులో ఆ పనిలో మన పాఠశాల శిక్షణ ఇవ్వలేదు."

డైరెక్టరు గారు అన్నారు—"సరే, అలాగే ననుకోండి. కాని అటువంటి వాళ్లు ఎవరెవరు?"

నేను చెప్పాను—"జగజీవన్ సేఠ్ కొడుకు నేమీ పోలీస్ డిపార్టు మెంట్‌కు బాగా పనికి వస్తాడు. అతణ్ణి ఏదయినా తాలింఖానా (వ్యాయామ శాల)లో చేర్పించితే బాగుంటుంది. అతని తండ్రి అతణ్ణి మిలటరీ ఆఫీసరు దగ్గర ఉంచి కొంచెం నియమ నిబంధనలు నేర్పిస్తే అయిదేళ్ళల్లో ఉద్దండుడైన జమాదార్ కాగలడు. ఇప్పుడు అతడు సగం పాఠశాలకు జమాదార్ గానే పనిచేస్తున్నాడు."

ఆయన అడిగారు—"ఇంకా ఎవరెవరు బలహీనంగా ఉన్నారు?"

నేను చెప్పాను—"అయ్యా, ఈ రకమైన విద్యార్థులు ముగ్గురున్నారు. వాళ్ళు పూర్తిగా వెనకబడి వున్నారు. సెలవల్లో వాళ్ళను నా దగ్గర ఉంచుకొంటాను. పై క్లాసుకు అర్హత సంపాదించడానికి తగిన శిక్షణ ఇచ్చి చూస్తాను. అయ్యా, పాఠశాలల ప్రస్తుతపు నియమ నిబంధనలు మార్చడానికీ, పాఠ్యక్రమంలోని క్లిష్టతను తొలగించడానికి మీరేమైనా ప్రయత్నం చేయగూడదా?"

డైరెక్టరు గారు అన్నారు—"ప్రస్తుతానికి ఆ విషయం అలా వుండనివ్వండి. ఈ విషయంలో నా కాళ్ళు చేతులు కట్టి వేశారని మీకు అనేకసార్లు చెప్పే వున్నాను గదా! సరే మంచిది, అయితే మీ క్లాసు పరీక్ష సమాప్తమయినట్లు భావించ వచ్చునా?"

నేనన్నాను—"లేదండీ!"

డైరెక్టరుగారు నవ్వుతూ తమాషాగా అన్నారు—"ఆరు మాసాల పరీక్ష సమయంలో ఏర్పాటు చేసినట్లు ఏదయినా ప్రత్యేకమైన కార్యక్రమం తయారు చేసి వుంచారా? ఇప్పుడు మీ ఉపాయాలన్నీ మాకు

కూడా తెలిసిపోయాయి!"

## 7

ఈ రోజు మా పాఠశాల సమావేశం జరుగుతూ వుంది. పరీక్షలు అయిన తరువాత ప్రతి సంవత్సరం ఇటువంటి సమావేశం జరుగుతూనే వుంటుంది. మంచి మార్కులతో ఉత్తీర్ణులయిన విద్యార్థులకు ఈ రోజు బహుమతులు కూడా ఇస్తారు. సమావేశానికి గ్రామంలోని అధికారులూ, అనధికారులూ ఎంతోమంది హాజరయ్యారు. ఈ సందర్భంగా కార్యక్రమం రూపొందించే పనిని హెడ్‌మాస్టరు గారు నాకు ఒప్పగించారు. నేను ఆ పనిని విద్యార్థులకు ఒప్పగించాను. నేను సలహాలు మాత్రమే యిచ్చాను. పని అంతా విద్యార్థులే చేశారు.

మొట్టమొదట కోలాటంతో రాసలీల ప్రారంభమయింది. అరగంట వరకు సంగీతం వినిపించి ఆహూతులను ఆనందపరచారు. తరువాత ఆటల పోటీలు జరిగాయి. కుంటుతూ నడవడం, మూడుకాళ్ళతో నడవడం, పరుగు తీయడం, మ్యూజికల్ ఛైర్స్ మొదలైన వాటిల్లో పోటీలు జరిగాయి. అందరూ ఆటలుచూస్తూ ఆనందించారు. ఆటలు ముగిసిన తరువాత మూకాభినయం ప్రదర్శించ బడింది. ఆతరువాత అనుకరణ. ఒకడు గ్రామంలోని సేఠ్‌నూ, ఒకడు విద్యాధికారినీ, ఒకడు మిలటరీ ఆఫీసరునూ, మరొకడు దేశ నాయకులనూ అనుకరిస్తూ అభినయించారు. తరువాత విద్యార్థులు తాము తయారు చేసిన చిత్రాలు తీసుకొని వచ్చారు. వాటిని ఓపికగా ప్రతిఒక్కరికీ చూపించారు. పాఠశాల భవనమంతా విద్యార్థుల చిత్రాల సందడితో నిండిపోయింది.

అంతిమ కార్యక్రమం బహుమతీ ప్రదానం. ప్రతి సంవత్సరం 125రూపాయల విలువగల బహుమతులు విద్యార్థులకు పంచేవాళ్ళు.

ఆఖరుకు డైరెక్టరుగారు లేచి నిలబడ్డారు. ఎప్పటి మాదిరిగానే రెండు మాటలు మాట్లాడారు. ఆయనన్నాడు—



"మిత్రులారా! నా అభిప్రాయం ప్రకారం ఈ రోజు బహుమతీ ప్రదానం మరోరకమైనది. నా ప్రక్కనే కూర్చున్న యీ మిత్రుడు బహుమతులు అందజేసే విషయంలో నాకు ఒక క్రొత్త విషయం సూచించాడు. ఈ సంవత్సరం 125రూపాయల విలువగల బహుమతులను విద్యార్థులకు వేరువేరుగా పంచడంలేదు. వీరి పేరుమీద పాఠశాలలో ఒక పఠన మందిరం ఏర్పాటు చేయబడుతుంది. పై అధికారుల దగ్గరనుంచి దీనికి అవసరమైన అనుమతి కూడా తీసుకొని వున్నాను. ఈ మొత్తం ఆ పఠన మందిరానికి వినియోగించ బడుతుంది. ఇక ముందు నుంచి ప్రతి సంవత్సరం యీ మొత్తం ఆ పఠన మందిరానికే లభించ గలదు. మీకు యీ శుభవార్త వినిపించడానికి నేనెంతో సంతోషిస్తున్నాను. వ్యక్తిగత బహుమతులు ఇవ్వడం వలన కొందరు విద్యార్థులకు అభిమానమూ, కొందరు విద్యార్థులకు నిరాశ కలుగుతుంది. ఈ క్రొత్త యేర్పాటుతో బహుమతులకు ప్రత్యేకించిన ధనంతో విద్యార్థులందరూ ప్రయోజనం పొందగలరు. వేరువేరుగా, వ్యక్తిగతంగా యిచ్చే బహుమతుల నిష్ప్రయోజనాన్నీ, ఆ బహుమతులకు ప్రత్యేకించిన మొత్తాన్ని యీ విధంగా సద్వినియోగ పరచే విధానాన్నీ సూచించిన యీ మిత్రునకు ఈ సభలో అందరి తరపున కృతజ్ఞతను తెలియ జేస్తున్నాను."

"ఈ సందర్భంగా మరో విషయం కూడా మీకు వివరించ దలచుకున్నాను. ఒక సంవత్సరం క్రితం యీ మిత్రుడు నూతన విద్యా విధానంతో, నూతన బోధనా పద్ధతులలో నాలుగవ తరగతిలో ప్రయోగం చేసి చూడటానికి అనుమతిని కోరుతూ వచ్చాడు. అప్పుడు నేను వీరిని చదువుకున్న మూర్ఖుడనే భావించాను. ఇటువంటి వ్యసనపరులు, పిచ్చివాళ్ళు ఛాలామంది వుంటారనీ, కాని ఆచరణ దగ్గరకు వచ్చేసరికి జారుకుంటారనే ఉద్దేశ్యంతోనే వీరికి అనుమతి యిచ్చాను. నిజంగా అప్పుడు నేను వీరిని విశ్వసించలేదు. కాని వీరి ప్రయోగాలు అద్భుతంగా సఫల

మయ్యాయని నేనిప్పుడు ఆనంద పూర్వకంగా అంగీకరిస్తున్నాను. అంతే కాదు, నా భావాలలో కూడా వీరు అనేక మార్పులు తీసికొని రాగలిగారు. ప్రాథమిక పాఠశాలల్లో అనుసరించబడుతున్న పాత కాలపు బోధనా పద్ధతిని త్వరగా రూపుమాపాలనే హెచ్చరిక నా అంతఃకరణంలో ధ్వనిస్తూనే వుంది. మనలాంటి పాతకాలపు అధికారులూ, అధ్యాపకులూ సంతోషంగా, స్వేచ్ఛగా యీ విద్యారంగంలో నుంచి తప్పుకొని, కొత్త తరానికి చెందిన విద్యా వేత్తలకూ, కల్పనా శీలురైన ప్రతిభా వంతులకూ, సృజన శీలత కలిగిన ఆలోచనాపరులకూ స్థానం కల్పించాలి.

"సహృదయులారా, నా, ఆనందాన్ని ఎలా వ్యక్తం చేయాలో కూడా తెలియడంలేదు. యీ మిత్రుడు సృష్టించిన నాలుగవ తరగతి విద్యార్థులు ఎంత క్రమశిక్షణతో వున్నారో, ఎంత ఆరోగ్యవంతులుగా ఉన్నారో, ఎంత ఉత్సాహవంతులుగా వున్నారో ఎంత ఆనందంగా వున్నారో మీరే చూడండి! వీళ్ళ శక్తి సామర్థ్యాలకూ, బౌద్ధిక వికాసానికీ నేనే సాక్షిని. ఈ విద్యార్థులను గురించి వీరి తల్లిదండ్రులు కూడా అమితమైన సంతృప్తిని వెల్లడించడం అనేకసార్లు విన్నాను."

డైరెక్టరుగారి ఉపన్యాసంతో పాటు సమావేశ కార్యక్రమం కూడా సమాప్తమయింది. అందరూ ఎవరిళ్ళకు వాళ్లు వెళ్ళిపోయారు.

ఓ సంవత్సరంపాటు నిర్వహించిన ప్రయోగంలో నా ప్రయత్నాలు అద్భుతంగా సఫలమయిన కారణంగా కలిగిన ఆనందంతో నేను కూడా ఇంటికి చేరాను. నూతన విద్యా విధానం, నవీన బోధనా పద్ధతుల ఉజ్వల మైన భవిష్యత్తుకు సంబంధించిన మధురమైన కలలలో కలిసిపోయాను.

తేదీ : 8-5-1932

## మా పుస్తకాలు

| | | సాదాప్రతి | మేలుప్రతి |
|---|---|---|---|
| 1. | వేమన్నవాదం | 5-00 | —— |
| 2. | ఆంధ్రుల సంస్కృతి-చరిత్ర I | లేదు | 20-00 |
| 3. | " " II | 20-00 | 25-00 |
| 4. | ఆంధ్రదేశంలో సంఘ సంస్కరణోద్యమాలు | 10-00 | 18-00 |
| 5. | తరతరాలభారత చరిత్ర | 15-00 | 25-00 |
| 6. | ఆధునిక భారత చరిత్ర | 16-00 | 28-00 |
| 7. | ప్రాచీన భారతదేశ చరిత్ర డి. డి.కోశాంబి పరిచయం | 10-00 | 20-00 |
| 8. | మానవుడే చరిత్రనిర్మాత | 12-00 | 20-00 |
| 9. | చరిత్రలో ఏం జరిగింది | 10-00 | 20-00 |
| 10. | చరిత్రంటే ఏమిటి? | 7-00 | 10-00 |
| 11. | భారత చరిత్రలో రైతు | 1-80 | —— |
| 12. | చరిత్ర రచనలో మతతత్వం | 2-00 | —— |
| 13. | పిడుగుదేవర కథ | 8-00 | 12-00 |
| 14. | సౌరశక్తికి సంకెళ్లు | 12-00 | 20-00 |
| 15. | మార్క్స్ రాసిన పెట్టుబడి | 12-00 | —— |
| 16. | భారతీయ ఆర్థిక వ్యవస్థ | 3-00 | —— |
| 17. | పెట్టుబడిదారీ విధానం: పరిణామం | 3-00 | —— |
| 18. | వైద్యుడు లేని చోట | 40-00 | 60-00 |

| | | | |
|---|---|---|---|
| 19. | మనిషికోసం మందులా కాదు మందులకోసం మనిషి | 2-00 | —— |
| 20. | భారతదేశంలో నా జైలుజీవితం | 10-00 | 16-00 |
| 21. | సామాన్యుల సాహసం | 5-00 | 10-00 |
| 22. | మాకథ | 10-00 | 20-00 |
| 23. | భూమి పుత్రిక | 10-00 | 16-00 |
| 24. | కళ్యాణ మంజీరాలు | 10-00 | —— |
| 25. | ఒకతల్లి | 5-00 | —— |
| 26. | రాకాసికోర | 6-00 | —— |
| 27. | ఎవరిదీఅడివి | 12-50 | 20-00 |
| 28. | మృత్యుంజయుడు | 20-00 | 40-00 |
| 29. | ఏడుతరాలు | 13-00 | —— |
| 30. | ఉక్కుపాదం | 10-00 | 16-00 |
| 31. | జైత్రయాత్ర | 12-00 | 20-00 |
| 32. | భూమి | 13-50 | 20-00 |
| 33. | కార్టూన్లలో లెనిన్ | 10-00 | —— |
| 34. | " మావో | 10-00 | —— |
| 35. | " క్యూబా | 8-00 | —— |
| 36. | కూలిగింజలు | 5-00 | —— |
| 37. | దళితకథలు | 3-50 | —— |
| 38. | సాగరకన్య | 3-00 | —— |
| 39. | బుడుంగు | 2-50 | —— |
| 40. | గురువుకు ఎగనామం | 2-75 | —— |
| 41. | పిల్లగుర్రం నదిని ఎలాదాటింది | 1-60 | —— |
| 42. | ఉప్పెన | 5-00 | 9-00 |

## పగటి కల

గిజుభాయి బగేకా

ప్రస్తుతం ప్రాథమిక పాఠశాలలలో బోధించ బడుతున్న విషయాలు గానీ, విధానాలు గానీ బాలలకు చాలా హానికరమైనవిగా వున్నాయి. విద్యార్హతను పరీక్షలతోనూ, బహుమతులతోనూ, పోటీలతోనూ, కుస్తీపట్లతోనూ కొలుస్తున్నారు. ఈ రకపు చదువు సంధ్యల ఫలితాలే ఈర్ష్య, ద్వేషం, దెబ్బలాటలు, అశాంతి, అసంతృప్తి, అదుపు తప్పటం, పరిస్థితి అస్థవ్యస్థంగా మారిపోవటం.

ఈ విధానానికి స్వస్తి పలకాలని, ఓ నూతన విధానం కావాలని గిజుభాయి ఎన్నో ప్రయోగాలు చేశారు. సత్ఫలితాలు పొందారు. ప్రాథమిక విద్యారంగంలో మౌలికమైన మార్పులెన్నో ప్రవేశ పెట్టారు, తాను ఆచరించి రుజువు చేశారు. ఆయన స్వయంగా తన పద్ధతుల్లో దాదాపు ఆరువందల మంది ఉపాధ్యాయులకు శిక్షణ ఇచ్చి విద్యాకార్యకర్తలను రూపొందించారు. ఓ నూతన మార్గం చూపించారు.

కేవలం ఉద్యోగం, జీతం అనే పరిమిత స్థాయిలో జడంగా బతికేసే ఉపాధ్యాయులను కాకుండా ఆదర్శంగా-ప్రేరణ నిచ్చే వ్యక్తిత్వంతో-ధైర్యంతో ఒక ఆశయం కోసం జీవించే "భావి ఉపాధ్యాయుల" నిర్మాణం గిజుభాయి "పగటి కల."